# భృగురాజకాండ

సంకలనము

శ్రీ పుచ్చా శ్రీనివాసరావు




రోహిణి పబ్లికేషన్స్

# భృగురాజకాండ

(భృగుసంహిత సుందర విశేష ఫలితకాండ)

సంకలనము

శ్రీ పుచ్చా శ్రీనివాసరావు





రోహిణి పబ్లికేషన్స్

మెయిన్‌రోడ్, రాజమండ్రి.

# విజ్ఞప్తి

భృగు సంహిత అతి పురాతన శాస్త్రము. ఫలితములు తెలుసుకొనుటకు అత్యుత్తమ గ్రంధంగా చెప్పబడింది. ఈ భృగుసంహిత యందు అనేక భాగములు తెలియజేసినప్పటికి ప్రత్యేకించి రాజయోగకాండ విశేష ప్రాచుర్యము పొందినది.

ఈ గ్రంధము ఆధారంగా ప్రతి మానవునియొక్క జాతకము అవసర్గము లేకుండా జన్మతిధి, వారము, జనన కాలఘడియలు, నామాక్షర సంఖ్య ఆధారంగా సులభంగా వారి వారి జాతక ఫలితములు, భూత, భవిష్యత్, వర్తమాన కాలములలో జరిగే శుభా శుభా ఫలితములును, శాంతి విధానములతో తెలుసుకోవచ్చును.

భృగురాజకాండ మూలగ్రంధమందు చెప్పబడిన ఫలితములు ఈనాడు అనుభవములో పరిపోవుటలేదు. ఆయా కాలములలో దేశ కాల మాన పరిస్థితులకు అనుగుణంగా పలుమార్పులు సంభవించుట సహజమే కదా. అయితే కొద్దికాలం క్రితం ఉత్తర భారతదేశమందు హిందీలో ప్రచురించబడిన గ్రంధమందు ఈ విషయమే తెలియజేస్తూ ఈనాటి పరిస్థితులకు తగినట్లుగా తగుమార్పులు చేసి ముద్రించినట్లుగా తెలియజేయబడింది.

ఈ గ్రంధాన్ని ఆధారంగా చేసికొని మూలములోని విషయములకు మార్పు రానీయకుండా ఈ గ్రంధ రచన చేయడం జరిగింది. ఈ రచనను మలచడంలో తెలియకుండా ఏవయినా దోషములు వుంటే, సహృదయులయిన పాఠకులు దానిని నా దృష్టికి తీసుకొనివస్తే మలి ముద్రణంలో సవరించగలనని మనవి చేస్తున్నాను.

ఈ గ్రంధాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించిన, చక్కని అభిరుచి కలిగిన రోహిణి పబ్లికేషన్స్ అధినేత శ్రీ పైల అప్పారావుగారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు....

పుచ్చా శ్రీనివాసరావు,
04-07-1998.

# మా కేటలాగ్

1. జ్యోతిష పదార్ణవము — శ్రీ పుచ్చా శ్రీనివాసరావు — 50-00
2. నవరత్న కల్పతరువు — " — 40-00
3. జాతక దీపిక — " — 30-00
4. నక్షత్ర చింతామణి — శ్రీ బొమ్మకంటి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి — 25-00
5. హస్త సాముద్రిక శాస్త్రము — శ్రీ లక్కోజు రమేష్‌బాబు — 80-00
6. హిందీ-తెలుగు కోష్ — శ్రీ కప్పగంతుల సత్యనారాయణ — 100-00
7. మినీ హిందీ-తెలుగు డిక్షనరీ — " — 35-00
8. కోట్ల కొద్దీ పేర్లు (పిల్లల పేర్లు) — శ్రీ మల్లాది వేంకట శేషశాయి — 25-00
9. విద్యార్థి కల్పవల్లి — శ్రీ ముసునూరి నారాయణరావు — 90-00
10. సుందరకాండము — శ్రీ ఎస్.టి.పి. కోనప్పాచార్యులు — 150-00
11. అప్పకవీయం — డా॥ శ్రీ బులుసు వేంకట సత్యనారాయణమూర్తి — 30-00
12. ఛందోదర్పణము — వ్యాఖ్యాత డా॥ చిర్రాపూరి శ్రీరామశర్మ — 35-00
13. సులక్షణ సారము — డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు — 30-00
14. కావ్యాలంకార సంగ్రహం — వ్యాఖ్యాత డా॥ శ్రీ పోచినపెద్ది వెంకట మురళీ కృష్ణ — 45-00
15. చంద్రాలోకము — డా॥ బులుసు వేంకట సత్యనారాయణ మూర్తి — 20-00
16. Prosody (ఆంగ్ల ఛందస్సు) — శ్రీ ఎం.వి.నారాయణాచార్యులు — 30-00
17. అహోబల పండితీయము — శ్రీ యరసూరి మల్లికార్జునరావు — 35-00
18. కలప జంత్రి — శ్రీ పి. బి. వీరాచారి — 30-00
19. సంపూర్ణ నీతిచంద్రిక — చిన్నయసూరి, కందుకూరి వీరేశలింగం — 65-00
20. స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్ — పానుగంటి వెంకట రమణ — 50-00

# భృగురాజ కాండ

## (భృగు సంహిత యందలి విశేష ఫలిత కాండ)

సూర్యాది గ్రహములు శక్తిలో పరమాత్మాంశ, జీవాంశ అనే రెండు అంశలు ఉంటాయి. ఆత్మాంశ (ఆత్మశక్తి) అధికంగా ఉండడం వల్ల పురాణ పురుషులయిన శ్రీరాముడు, శ్రీకృష్ణుడు వంటి అవతార పురుషులు, బుద్ధుడు, శంకరాచార్యులు వంటి మహాత్ములు అవతరించి ధర్మ సంస్థాపన చేస్తారు. తమకార్యములు పూర్తయిన వెంటనే తిరిగి ఆత్మాంశలో లీనమవుతారు. దీన్నే పరమాత్మాంశ అని అంటారు. ఆత్మ శక్తి సాధారణంగా ఉండి జీవాంశ ఎక్కువగా ఉంటే మనుష్యులు జంతువులు వంటివి ఏర్పడి తమ కర్మ ఫలాన్ని అనుభవించి తిరిగి జీవాంశలో తద్వారా సూర్యాది గ్రహములలో లీనమవుతారని శాస్త్రాల్లో చెప్పబడింది.

జీవాంశ అధికంగా గల బుద్ధి జీవులయిన మానవులు, తమ జన్మ విశేషాలను, పూర్వ జన్మ, మరునటి జన్మలో ఏర్పడే స్థితి గురించి, ఈ జన్మలో జరిగిన, జరుగుతున్న, జరగబోతున్న విశేషాలను తెలుసుకోవాలని కుతుహల పడుతూ ఉంటారు. ఈ మానవులు కర్మ ఫలితాలను విచారణ చేయడానికి 'జ్యోతిశ్శాస్త్రం' చెప్పబడింది.

ఈ జ్యోతిశ్శాస్త్రంలో కర్మ ఫలితాన్ని తెలియజేయడానికి అనేక క్రమముల పద్ధతులు తెలియజేయబడ్డాయి. వీటిలో గ్రహ గణితంతో సంబంధం లేకుండా ఫలితాలను సులువుగా తెలియజేసే వాటిలో ముఖ్యమైనది సంహితలలో నవివరంగా తెలియజేసారు. వీటిల్లో బహు ప్రచుర్యం పొందినది భృగుసంహిత. ఈ భృగుసంహితయందు జాతక ప్రకరణము, ఫలితములను కుండలి ఫలిత కాండలు, రాజయోగకాండ అని ప్రత్యేక

భాగాలుగా విపరించబడింది. ప్రత్యేకించి రాజయోగ కాండ ఆధారంగా ఎక్కువ శ్రమ లేకుండా (గణితం మరియు ఇతర వివరముల) జాతకుని జీవితంలో జరిగే ముఖ్య సంఘటనలను, శుభాశుభములను, శాంతి పద్ధతులు, గతజన్మ వివరాలతో సహ తెలుసుకోవచ్చును.

శ్లో. సూర్యం నత్వా గ్రహపతిం జగదుత్పత్తి కారణమ్ ।
వక్ష్యామి వేదనయనం యథా బ్రహ్మ ముఖాచ్ఛ్రుతమ్॥
శాన్తాయ గురుభక్తాయ సర్వదా సత్యవాదినే
ఆస్తికాయ ప్రదాతవ్యం తతః శ్రేయో హ్యవాప్స్యతి॥

తా. సర్వ జగదుత్పత్తి హేతుభూతుడైనట్టి, గ్రహాధిపతియైనట్టి సూర్యునికి నమస్కరించి, బ్రహ్మముఖము నుండి జ్యోతిశ్శాస్త్రమును ఎట్లు వినియుంటినో అదే విధముగా చెప్పుచున్నాను. ఈ శాస్త్రమును శాంత స్వభావము గలవారికి, గురుభక్తి కలవారికి, ఎల్లప్పుడు సత్యమునే చెప్పువారికి, ఆస్తిక బుద్ధి కలవారికి చెప్పవలెను. శ్రేయోలాభంకలుగును అని శాస్త్రములలో చెప్పబడింది.

శ్లో. నోదీరయేత్ ద్వినస్తమపి వృధాయ విశ్వాసహీనా యచ నాస్తికాయ ।
అసర్ధవాయా విసయాయ వెత్యం కుశంకినే వా బహుగర్వవాచే॥

వినయం లేనివారికి, విశ్వాస హీనులకు, ప్రతిఫలం యివ్వనివారికి, కుశ్శంకలు చేయువారికి, గర్వపోతులకు, నాస్తికులకు, వృధాగా ప్రశ్నించే వారికి ఈ ఫలితములు తెలియజేయరాదని కూడా చెప్పబడింది.

ఈ గ్రంథాన్ని ఉపయోగించే విధానము.

ఫలితం కోరే వారి వద్ద నుండి ఈ క్రింది సమాచారం తీసుకోవాలి. అవి

1. జన్మకాల సమయం ఘ. వి.ఘలలో
2. జన్మ తిథి

3. జన్మ వారం
4. పేరులోని అక్షరాలు (సంఖ్య)
5. ఈ సంహిత సంఖ్య 5.

ఈ అయిదింటిని కూడగా ఏ సంఖ్య వస్తుందో ఆ సంఖ్యకు చెప్ప బడిన కథ ఆధారంగా, ఆ జాతకుని జీవిత ఫలితములు తెలుసుకోవచ్చు.

**గమనించ దగిన విషయములు :-**

(అ) జననకాల ఘ-వి.ఘలలోని ఘడియలను, మిగిలిన విఘడియలను 1గా ఊహించి దానిని ఘడియలకు కలపాలి. ఉదా : 14ఘ-38 వి.ఘల అనగా 14+1=15 సంఖ్య అవుతుంది.

(ఆ) పేరు అనగా సాధారణంగా నిత్యం వాడకంలో ఉపయోగించే (రిజిష్టర్‌లలోనిది) పేరులోని అక్షరాల సంఖ్యలు. నామాక్షర సంఖ్యలు అవుతాయి.

(ఇ) జన్మకాల తిథి, వారం తెలియని వారికి తిదుల సమయ ఘ. వి.ఘలు. ఆనాటి తిది, వారం ఆధారంగా జన్మకథనం తెలుసుకోవచ్చు.

ఉదా = పేరు : వినాయక రావు. పుట్టిన తేదీ : 11-5-1960. జననకాల ఘ. లు; 32-30 తిధి పౌర్ణమి, వారము : బుధవారం.

| | |
|---|---|
| జనన కాల ఘడియలు : 32+1 = | 33 |
| తిధి : పౌర్ణమి | 15 |
| వారం : బుధవారం | 4 |
| పేరు : | 6 |
| భృగుసంఖ్య : | 5 |
| ఫలితములకు 63వ కథ చదువుకోవాలి. | 63 |

# 11వ కథ

ఈ 11వ కథలో చెప్పబోవు జీవుని జాతకమందు గ్రహములు మంచి ఫలితాలను యిస్తాయి. ఈ జాతకులు సర్వకార్యములందు సమర్థులు. మంచి ఉత్సాహం కలిగి ఉంటారు. మంచి మాటకారులై ఉంటారు. మంచి పేరు కలిగి ఉంటారు. సాధారణ విద్య కలిగి ఉంది, అనేక రంగములలో విశేష ప్రజ్ఞ కలిగి ఉంటారు. ప్రభుత్వ వ్యవహారములందు నేర్పరులై ఉంటారు. మంచి భోజనము చేయుటయందు ఆసక్తి కలిగి ఉంటారు. మంచి వాహనం ఉంటుంది. ఆకస్మికంగా, అనుకోకుండా వీరు ధనవ్యయం చేస్తారు.

వీరి జీవితంలోని ముఖ్యసంఘటనలను పరిశీలిస్తే 1 మొదలు 8 సంవత్సరం వరకు అంటే చిన్నతనమందు చిన్న చిన్న అనారోగ్యముల బారిన పడనను దినదినాభివృద్ధి చెందుతు ఉంటారు. ఇంట్లో అనేక శుభ కార్యములకు, విద్యకోసం ధనం ఖర్చుచేస్తారు. జాతకునకు కురుపులు, దెబ్బలు వంటి స్వల్ప అనారోగ్యములు, తండ్రికి ధనలాభం కలుగుతాయి. సంగీతంవంటి ఇతర కళలయందు నేర్పరితనం కలిగి ఉంటారు. ఇతరులకు సహాయం చేయుస్వభావం కలిగి ఉంటారు.

మొదటి సంవత్సరములో జ్వర సంబంధమయిన అనారోగ్యముల తోను 2వ సంవత్సరంలో కడుపునొప్పులు, 3వ సంవత్సరంలో సోదర లేదా సోదరీ జన్మంవల్ల తల్లికి కొంచెం అనారోగ్యంగా ఉంటుంది. ఇదే సమ యంలోతండ్రికి ధనలాభం, నానావస్తువుల లాభం ఏర్పడుతుంది. 4 నుండి 7వసంవత్సరాల కాలంలో ఇంటియందు వివాహాది శుభకార్యములు, విద్యాభి వృద్ధి, తండ్రికి ఇతరదేశములలో (అంటే అనేకచోట్ల) మంచి పేరుకలిగి

ఉంటారు. తల్లికి కొంచెం అనారోగ్యం ఏర్పడినను ఔషధములవల్ల అది శాంతిస్తుంది.

8వ సంవత్సరంనుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి విశేషలాభములు ఏర్పడతాయి. జాతకునకు విద్యాసౌఖ్యం, నూతన వస్త్ర, వస్తు లాభము కలిగి ఉంటారు. పాఠశాలలో క్రీడలవంటి ఇతర కార్య క్రమములలో పాల్గొని, పారితోషికములు, బహుమతులు పొందుతారు. ఈ సమయంలోనే తండ్రికి కొంచెం కష్టంగా ఉంటుంది, అయితే దానధర్మాదుల వలన శాంతి పొంది తిరిగి లాభమును పొందుతారు. ఈ సమయంలోనే వీరు ప్రేమలో పడతారు.

17 నుండి 25 సంవత్సరాల మధ్యకాలంలో మంచి అనుకూల మయిన, మంచి భార్య/ లేదా భర్తను పొందుతారు. సంతోషంగా కాలం గడపడంతో సమయం తొందరగా గడుస్తుంది. మంచి ఉద్యోగం కలిగి ఉంటారు. సంతానం కలిగి ఉంటారు. మంచి ప్రభుత్వోద్యోగం కలిగి ఉంటారు.

26 నుండి 32 సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగ బాధ్యత లలో స్థాన చలనం ఉంటుంది. ఉద్యోగములో ప్రమోషన్లు, ధన వాహనాది లాభములు కలిగి ఉంటారు. అయితే ఇదే సమయంలో వీరికి ఒక శత్రువు ఏర్పడి స్వల్పకష్టములు, భయం ఏర్పడుతుంది. జపహోమాదులవల్ల దుర్గా దేవిని పూజించడం జరిగి మెల్లగా కష్టములు శాంతిస్తాయి. తిరిగి దిన దినాభివృద్ధి కలిగి ఉంటారు.

33 నుండి 40 సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగములో అధిక సౌఖ్యం, గృహములో శుభకార్యములు, నూతన స్త్రీలతో పరిచయ ములు. ఇందువల్ల అధికంగా ధనవ్యయం, అనేక వినోద, విహార కార్య క్రమములలో పాల్గొంటారు, నూతన వస్త్రభూషణ లాభం, శత్రు మిత్రత్వ

ములు సమానంగా ఉంటాయి. గృహమునందు వృద్ధుల మరణం సంభవించుచు అధిక ధనం వ్యయము కలుగుతుంది.

ఈ గ్రంధకర్తఅయిన శుక్రాచార్యుని ఓస్వామి ధన చింత యెట్లు తొలగుతుంది, అని కోరగా శ్రీ మహాలక్ష్మిని యధావిధిగా పూజించితే సమస్తకష్టములు తొలగి సర్వసంపదలు పొందుతారు.

40 నుండి 45 సంవత్సరముల మధ్యకాలంలో అక్కడనుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో చేసే ఉద్యోగములో ధనలాభం, అనేక కార్యములు సిద్ధిస్తాయి. తిరిగి స్వస్థానంను వస్తారు. కీర్తికలిగి ఉంటారు. ఇంట్లో శుభకార్యములవల్ల ధనవ్యయము కలుగుతుంది. పుత్రకళత్రాది వర్గమూలకముగా విచారం కలుగుతుంది. తగిన దానధర్మములు చేయుట వల్ల కష్టములు తొలగి మంచి సంతోషంగా ఉంటారు.

51 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో తిరిగి ధనవ్యయం ఎక్కువగా ఉంటుంది. కష్టాదిక్యంవల్ల శరీర అనారోగ్యము కలిగి ఔషధ సేవచేయడంవల్ల శాంతి కలుగుతుంది. అనేక ధర్మకార్యములు చేస్తూ, తీర్థ యాత్రలు చేస్తారు.

61 నుండి 70వ సంవత్సరముల మధ్యకాలంలో సుఖదుఃఖములు సమానంగా ఏర్పడతాయి. అయిననూ ప్రశాంతంగా కాలం గడుపుతూ 80వ సంవత్సరంలో వైశాఖమాసంలో గురువారంనాడు, ఉత్తరాషాఢ నక్షత్రంలో చంద్రుడు ఉండగా పరలోకం పొందుతారు.

ఈ జీవుడు తిరిగి ఏ దేశంలో ఎలా జన్మిస్తాడు అని శుక్రుని ప్రశ్నించగా మరుసటి జన్మంలో ఉన్నతవంశంలో, మంచి సంపదలు కలిగి ఉన్న యింట్లో జన్మిస్తారు.

(గమనిక : ఈ కథయందు చెప్పబడిన ప్రదేశములు, కొన్ని కార్యములు అసాధ్యం కనుక వాటిని వదలడం జరిగింది.)

# 12 వ కథ

శుక్రాచార్యుడు ఈ జన్మ పత్రిక యొక్క ఫలితములను చెప్పు చున్నాడు. ఈ జాతకుడు అనేక కార్యములు చేయుటద్వారా జయం పొందుతారు. మంచి పేరు కలిగి ఉంటారు. భార్యా పిల్లలయందు మంచి ప్రేమ కలిగి, మంచి కీర్తి, మంచి మాట కలిగి ఉండి, శాంతవంతులై ఉంటారు. అతి సులభంగా కార్యానుకూలత కలిగి వుంటారు. మంచి మంచి ప్రదేశములు తిరుగుతారు. అనేకమంది సేవకులు కలిగిఉంటారు. మంచి అనుకూలమయిన కళత్ర సౌఖ్యమును పూర్తిగా పొందుతారు.

1 వ సంవత్సరంలో ఏదైన ప్రదేశం నుండి పడుట, 2 వ సంవత్సరంలో ముఖపీడ, 3 వ సంవత్సరంలో విరోచన సంబంధ రోగములు కలిగి వుంటారు. ఇదే సమయంలో గృహములో శుభములు కలుగుట, సోదర లేదా సోదరీ జన్మంవల్ల తండ్రికి ధనలాభం ఏర్పడుతుంది. 4 వ సంవత్సరంలో తల్లికి అనారోగ్యం కలుగుతుంది. 5 నుండి 18 సంవత్సరంల మధ్యకాలంలో విద్యాభివృద్ధి కలుగుతుంది. ఒక స్వల్పకష్టము లేదా ఈ జాతకుని ఒక చర్యవల్ల తల్లి తండ్రులకు- విచారమును ఆశ్చర్యం కలుగును.

ఈ కష్టములు ఏవిధంగా తొలగుతాయి అని శుక్రుని ప్రశ్నించగా తగిన విధంగా దానధర్మముల చేయుట వలన అన్నశాంతి చేయుట వలన సమస్త కష్టములు శాంతించి మాతాపితృ సౌఖ్యం కలుగుతుంది.

8 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలోతల్లికి,తండ్రికి సౌఖ్యం ఉంటుంది. తండ్రికి అనేక రకములుగా కలసివస్తుంది. విద్యాలాభం కలుగుతుంది. వివాహాది కార్యములవల్ల ఇతర శుభకార్యములు వల్ల ఇంటియందు మంగళాచరణం కలుగుతుంది.

17 నుండి 25 సంవత్సరముల మధ్య కాలంలో స్త్రీ మూలక ధన లాభము, సత్కళత్రం, కళత్రసౌఖ్యం ఏర్పడతాయి. ఈ సమయంలో కొంత సంతాన నష్టం కలుగుతుంది. దీనినుండి నివారణకోసం గోపాల మంత్రమునుగాని, పుత్రస్థానాధిపతినిగాని తగు రీతిగా జపించిన సంతాన సౌఖ్యం కలుగును. కుటుంబంలోని వృద్ధులు ఒకరు మరణించుటచే ధనం ఎక్కువ ఖర్చు అవుతుంది. తాము చేసే పనులలో విశేషమయిన నేర్పు కలిగి ఉంటారు. ప్రభుత్వ వ్యవహారంలలో నేర్పు కలిగి ఉంటారు.

26 నుండి 34 సంవత్సరములమధ్యకాలంలో అనేక రకములయిన సౌఖ్యాలుపొందుతారు. నూతన పరిచయాలు ఏర్పడతాయి. సంతానలాభం, ప్రభుత్వ మూలక ధనలాభం కలుగుతాయి. తూర్పుదిశ వైపు ప్రయాణం అక్కడనే ఉద్యోగం, పదోన్నతి ఏర్పడతాయి. 35 నుండి 42 సంవత్సరంల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా ఉంటుంది. గృహంలో శుభకార్యములు, సంతాన అభివృద్ధి, వాహనసౌఖ్యం, విదేశ వస్త్ర ఆభరణ లాభం కలుగుతాయి. అయితే ఒక అధికారితో వైర్యంవల్ల కొద్దికాలం చికాకుగా ఉంది తరువాత కాలంలో శత్రుత్వం తగ్గి మిత్రులుగా మారతారు. 43 వ సంవత్సరం నుండి 50 సంవత్సరాల కాలంలో కీర్తి పెరుగుతుంది. భూ గృహలాభం కలుగుతుంది. ధార్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. విశేషంగా ధనం కూడపెడతారు. వాహన సుఖం ఏర్పడుతుంది.

50 వ సంవత్సరం నుండి 58 వ సంవత్సరముల మధ్య కాలంలో గృహంలో శుభకార్యముల నిమిత్తం అంటే సంతానానికి వివాహం వంటి అనేక శుభకార్యముల వల్ల, ఇతర కార్యక్రమములవల్ల విశేషంగా ధన వ్యయం అవుతుంది. కొంతకాలం ఇంటికి దూరంగా లేదా సంతానానికి దూరంగా ఉండవలసి వస్తుంది. 59 నుండి తరువాత సంవత్సరాలలో తీర్థయాత్రలు చేస్తారు. విశేష దానాలు చేస్తారు. సంతోషంగా ఏ బరువు

బాధ్యతలు లేకుండా 70 వ సంవత్సరం వరకు సుఖంగా కాలం గడుపు తారు. ఆ తరువాత కాలంలో చైత్రమాసంలో రేవతి నక్షత్రం ఉండే శుక్ల పాడ్యమి శుక్రవారం నాడు మరణం కలుగుతుంది.

ఈ జీవుని పూర్వజన్మ వృత్తాంతం గురించి భృగు మహర్షి ఈ విధంగా తెలియజేసారు. ఈ జీవుడు నివసించే ప్రాంతానికి దక్షిణ ప్రాంతంలో సా అనే పేరుగల పట్టణం నందు ఉన్నత కుటుంబంలో సుఖంగా, విశేష ధనవంతునిగా, జ్ఞానవంతునిగా జీవించి అనేక పుణ్య కార్యములు, దాన ధర్మాలు చేసేవాడని తెలియ చేసారు. అయితే ఆ జన్మలో చేసిన పాపకార్యంలో పాల్గొనుటచే ఈ జన్మమందు 50 నుండి 58 సంవత్సరాల కాలంలో అనారోగ్యం ఏర్పడుతుందని తగిన శాంతి విధానముల చేయుటవలన మనశ్శాంతి, ఆరోగ్యం కుదుటపడుతుందని చెప్పబడింది.

# 13 వ కథ

భృగు మహర్షి ఈ 13వ కథగురించి తెలియజేస్తూ ఈ జన్మపత్రి కలో గ్రహములు శుభస్థానములు పొంది ఉండుటచే మంచి శుభఫలితము లను ఇచ్చును. మంచి మనస్సుతో గౌరవం పొందుతూ, వినయులుగా ఉంటారు. మంచివాక్కు కలిగివుంటారు. తీపిపదార్థములయందు యిష్టం కలిగి ఉంటారు· అయితే గతజన్మలో చేసిన కొన్నిపాపములవల్ల బాల్య, యవ్వన, మధ్యవయస్సులలో కొన్నికష్టాలు అనుభవిస్తారని తెలియజేయ బడింది. గత జన్మలో చేసిన పాపానికి నివృత్తి చెప్పమని కోరగా ఈ విధంగా తెలియజేసారు. 7 గురివింద గింజల ఎత్తు బంగారు రేకుపై

మూర్తిని వ్రాయించి శాస్త్రానుసారం పూజాదులు చేయించి దానమిచ్చిన సమస్త కష్టములు శాంతించి శుభములుకలుగుతాయని చెప్పారు.

పుట్టినది లగాయతు 2వ సంవత్సరంలోపు ముఖము, దంతాలు, ఆసన సంబంధమయిన అనారోగ్యముతో బాధపడతారని 3వ సంవత్సరంలో సహోదర లేదా సహోదరి యోగం ఏర్పడుతుంది. ఇదే సమయంలో తల్లికి కొంచెం అనారోగ్యం చేస్తుందని చెప్పబడింది. 5 నుండి 7 సంవత్సరముల మధ్యకాలంలో ఎత్తైన ప్రదేశాలనుండి పడుట లేదా వాహనముల వల్ల ప్రమాదాలు, విద్యారంభం, బంధుప్రియత్వం, తండ్రికి అనాయాసంగా ధనలాభం కలుగుతాయి.

8నుండి 16 సంవత్సరములలో గృహంలో అనేక శుభకార్యములు జరుగుతాయి. నూతన వస్త్ర, ఆభరణము, రత్నములవంటి విలువయిన వస్తువులు ఏర్పడతాయి. సదా సంతోషంగా కాలం గడుపుతారు. అయితే మధ్యలో తల్లికి, తండ్రికి అనారోగ్యములు ఏర్పడతాయి. తండ్రికి ఉద్యోగ రీత్యా లేదా ఇతర కారణములవల్ల నూతన ప్రదేశాలందు నివసిస్తారు. విద్యనిమిత్తం కాలం గడుస్తుంది.

17నుండి 25 సంవత్సరముల మధ్యలో అనేకమంది మిత్రులతో ఏర్పడడం, గౌరవం పొందగలగడం, ప్రభుత్వ మూలకంగా గౌరవం,పదవీ లాభం ఏర్పడతాయి. అయితే ఇంతకుముందరే చెప్పబడిన గతజన్మ కర్మని అనుసరించి చెడుతలంపులు కలిగి కొంత కష్టాన్ని ఎదుర్కొవలసివస్తుంది. ఒక వ్యక్తితో పరిచయంవల్ల ఏర్పడిన అనుబంధం కారణంగా విచారం వ్యాపించి రాత్రి పగళ్ళు బాధపడతారు. దీనివల్ల కొంత మానసిక శాంతి కోల్పోతారు. యధాశక్తి అనుసరించి శాంతి, దాన, జపములవల్ల శుభములు కలుగుతాయి. తగిన వైద్యసహాయం, సేవ అంది కుదుటపడతారు.

25నుండి 33 సంవత్సరములమధ్య కాలంలో వివాహం జరిగి సంతానం కలుగుతుంది. కొంత సంతానం అల్పాయుర్దాయంవల్ల నష్ట పోతారు. అయితే జాతకానుసారం లేదా సంతాన గోపాల విగ్రహమును చేయించి ఆవుపాలతో కడిగి, ఎర్రని వస్త్రం తొడిగి శాస్త్రానుసారం షోడ శోపచార పూజలుచేయించి దానం యిచ్చిన సంతానం నిలబడును అనిచెప్ప బడెను. ఉద్యోగములో చిన్నచిన్న ఆటంకములు ఏర్పడినను అవంతట అవే సమసిపోయి పదోన్నతి కలుగుతాయి.

34నుండి 42 సంవత్సరముల మధ్యకాలంలో గౌరవం, విశేషధన లాభం, గృహంనందు శుభకార్యములు జరుగుతాయి. ఎదురుగా మంచిగా మాట్లాడుతూ మనకు వ్యతిరేకంగా వుండే శత్రువులు ఏర్పడతారు. అయితే తగిన శాంతులు చేయుటవల్ల ఈ ఉపద్రవాలు తొలిగి సర్వశాంతి కలుగు తుంది. ఇది భృగువాక్యం సందేహంలేదు.

43నుండి 52 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభ ములు కలుగుతాయి. తర్వాత తీర్థయాత్రలుచేస్తారు. చోరభయం లేదా జంతు సంబంధమయిన బాధలు కలుగుతాయి. బీదలకు వివాహం నిమిత్తం సహాయం చేస్తారు. దేవాలయములకు ఇతర ధార్మిక కార్యక్రమములకు ధనం ఖర్చుచేస్తారు. ఎల్లప్పుడు సంతోషంగా ఉంటారు.

53నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో భూ, గృహలాభం పొందుతారు. అనారోగ్యం ఏర్పడుటవల్ల ఇతర ప్రదేశాలకు వైద్యం నిమిత్తం వెళ్ళెదరు. కొన్ని ఇతర కష్టాలవల్ల మనస్సులో ఆందోళనలు కలుగుతాయి. అయితే మహామృత్యుంజయ మంత్రంవల్ల కష్టాలు తగ్గు తాయి. 61నుండి 70 సంవత్సరాల మధ్యకాలంలో సుఖంగా కాలం గడిచినను శ్లేష్మవాతంచేత బాధపడతారు. తదనంతర కాలంలో వైశాఖ

మాసంలో బహుళ చతుర్దశి శుక్రవారంనాడు వృశ్చికరాశిలో చంద్రుడు ఉండగా నిర్యాణం కలుగుతుంది.

ఈ జాతకుని పూర్వజన్మ వృత్తాంతం తెలియచేస్తూ శుక్రమహర్షి ఈ విధంగా తెలియజేసాడు. అ అనే పేరుగల పట్టణమందు ఉన్నత కులంలో జన్మించెనని చ అనే మొదటి అక్షరం పేరుగల కళత్రం కలిగి ఉండినని తిరిగి ఈ జన్మలోను వారే దంపతులని చెప్పెను.

# 14వ కథ

భృగు మహర్షి ఈ విధంగా తెలియజేయుచున్నది ఏమనగా ఈ జాతకుల జాతకమందు గ్రహములు మంచి స్థానములో ఉన్నవి. వీరు విలాసవంతులు, మంచి మాటకారులు. అందరికి యిష్టులుగా ఉంటారు. వీరు సదాసుఖం అనుభవిస్తారు. రెండు కళలయందు నేర్పుకలిగి ఉంటారు. దైవభక్తి ఉంటుంది. బంధుప్రీతి కలిగి ఉంటారు. వీరియొక్క దైవభక్తి కారణంగా చిన్న చిన్న కష్టాలేవైనా వెనువెంటనే తొలగిపోతాయి.

వీరి జీవితంలో జరిగే ముఖ్య సంఘటనలను పరిశీలిస్తే 1వ సంవత్సరములో జ్వరములు 2వ సంవత్సరంలో ఉదర సంబంధ వ్యాధులు, 3వ సంవత్సరంలో ఆసనపీడలు కలుగుతాయి. 4 నుండి 8 సంవత్సరముల మధ్యకాలంలో బంధుప్రీతి, విద్యారంభం, చదువుటయందు ఇష్టం కలుగుతాయి. విద్యా విషయంగా ప్రతి సంవత్సరం బహుమానమును పొందుతారు, అందరి మన్ననలు పొందుతారు. 8 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో దినదిన విద్యాభివృద్ధి, అనేకరకములుగా సంపద అభివృద్ధి చెందుట, ఇతర కళలయందు నేర్పరితనం, సోదర సోదరి వృద్ధి వాహన లాభం కలుగుతాయి. తల్లికి అనారోగ్యం కలుగుతుంది. అయితే తగిన జప, శాంతులవల్ల శాంతి కలుగుతుంది.

17 నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి లాభం, విద్యాభివృద్ధి, ఉన్నత విద్యాభ్యాసం తదనంతర పరీక్షలందు ఉత్తీర్ణులవు తారు. ప్రభుత్వోద్యోగం చేస్తారు. శరీరంలో తెలియని గుప్తవ్యాధివల్ల శరీరబలం తగ్గుతుంది. తీవ్ర అసంతృప్తి కలుగుతుంది. మాతాపితృ సౌఖ్యం కలుగుతుంది. అనేక విధములుగా లాభం పొందుతారు.

26 నుండి 34 సంవత్సరంల మధ్యకాలంలో సంపదలు వృద్ధి చెందుతాయి. అనేక వస్తువుల కోసం విశేషంగా ధనవ్యయం చేస్తారు. అనేకమంది మిత్రులు పరచయం అవుతారు. మంచి సుఖవంతమయిన వాహనసౌఖ్యం పొందుతారు. స్వజనులను సంతోషంగా ఉండేలా చూస్తారు.

35 నుంటి 41 సంవత్సరముల మధ్యకాలంలో వివిధ నిర్మాణములు చేపడతారు. నూతన గృహం ఏర్పడుతుంది. గృహమందు శుభకార్యములు చేస్తారు. పుత్రోత్సాహం కలుగుతుంది. ప్రభుత్వం నుండి ధనలాభం కలుగు తుంది. అన్ని రంగములలోను దినదినాభివృద్ధిగా ఉంటుంది. విశేషంగా ప్రయాణాలు చేస్తారు. అనేక రకములయిన సుఖములు పొందుతారు. వీరు జీవితంలో సాధించ తగినవి ఈ కాలంలోనే సాధిస్తారు.

42 నుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో అధిక లాభం, అధిక ఉత్సాహం, మంచి కీర్తి కలిగి ఉంటారు. అయితే ప్రభుత్వంతో కొంత శత్రుత్వం ఏర్పడుతుంది. శత్రువులు ప్రత్యక్షంగా ఏమి చేయలేరు కాని పరోక్షంగా చెప్పుడు మాటలు చెప్పి శత్రువృద్ధి చేస్తారు. ఈ రక మయిన విచారంతో శరీరంలో అనారోగ్యం కలుగుతుంది. కళత్రానికి స్వల్ప అనారోగ్యం కలుగుతుంది.

ఏ ఉపాయంచేత ఈ రకమయిన కష్టాలు తొలగుతాయి అని శుక్ర మహర్షిని కోరగా ఈ విధంగా తెలియజేసారు. పూర్వజన్మలో పూజలో నుండగా అందమయిన స్త్రీ కంటపడగా పూజను వదలి మోహం ఏర్పరుచు

కున్నారు. అందువల్ల ఈ జన్మలో ఈ దోషాలు, కష్టాలు ఏర్పడ్డాయి. అందువల్ల దేవతారాధన శాస్త్రప్రకారం చేయించి తగిన శాంతులు చేయించి నచో మనోదౌర్బల్యం తొలగి కష్టాలు కడతేరగలవని తెలియజేసారు.

51 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో పుత్ర, పౌత్ర సౌఖ్యం కలుగుతాయి. వివాహాది శుభకార్యములు చేస్తారు, తీర్థయాత్రలు చేస్తారు. భూ, గృహ లాభం కలుగుతుంది. ప్రతి సంవత్సరం అన్నదానం వంటి అనేక దానములు చేస్తారు. పుత్రునికి ఏర్పడిన ఔషధం సేవవల్ల శాంతిస్తుంది. 61 నుండి 70 సంవత్సరముల కాలంలో అనేక విధములుగా లాభం పొందుతారు. దేవతారాధన చేస్తూ కాలం గడుపుతారు.

## 15 వ కథ

ఈ జాతకుని జన్మ పత్రిక విశేషములు తెలుపుమని కోరగా అందుకు భృగువాక్యం ఈమనగా — అందలి విశేషములు తెలియజేస్తూ ఈ జీవుడు జాతకమందలి విగ్రహములు సుఖము, సౌఖ్యం, శుభములు ఇచ్చును. గుణము, ధనం కలిగి వుంటారు. అయితే దైవ ఘటన వల్ల చెడు కార్యము చేస్తూ చెడు మనస్సు కలిగి వుంటారు. విశేషంగా ధనం ఖర్చుచేస్తారు. దానికి కారణం ఏమిటని శుక్రమహర్షి ని కోరగా ఆయన ఈ విధంగా చెప్పిరి. ఈ జీవుడు పూర్వజన్మలో మంచి కుటుంబంలో జన్మించెను. మంచి పనులు చేస్తూ సత్కార్మలు చేయు వ్యక్తిగా పేరుపొంది నాడు. పెద్దలను గౌరవిస్తూ, దేవతలకు ప్రీతి కల కార్యములు చేస్తూ అందరిచే మంచివానిగా పేరు గాంచాడు. ఇతని కళత్రం ధర్మపరాయణు రాలు దైవయోగం వలన వస్త్రములు లేకుండా దేవి పూజ చేయు సందర్భంలో భర్త చూసి కామ మోహితుడై అచటనే కౌగలించుకొనెను.

అందువలన ఏర్పడిన దోషం చేత ఈ జన్మలో చెడుకార్యములు చేస్తాడని భృగు మహర్షి తెలియచెప్పెను. ఆ దోష నివారణకై బంగారు రేకుపై చండికా మంత్రం లిఖించి శాస్త్రానుసారం పూజించి వస్త్రభూషణాదులతో దాన మిచ్చుట వలన దోషం యొక్క తీవ్రత తగ్గుతుందని చెప్పబడింది.

ఇతని జీవిత విశేషములను భృగు మహర్షి తెలియజేస్తూ 1వ సంవత్సరంలో నేత్ర రోగమును, 2వ సంవత్సరంలో ముఖసంబంధ వ్యాధులు 3వ సంవత్సరంలో సోదర భ్రాతృయోగం కలుగును.ఇదే సమయంలో తండ్రికి లాభం చేకూరుతుంది. 4వ సంవత్సరంలో తండ్రికి విశేష మయిన కీర్తి లభిస్తుంది. 5వ సంవత్సరం నుండి 9వ సంవత్సరం మధ్య కాలంలో విద్యారంభం జరుగుతుంది. తరువాత కాలంలో విద్యాభివృద్ధి తిరిగి సోదర లేదా సోదరీయోగం కలుగుతాయి. తల్లి అనారోగ్యం బారిన పడుతుంది.

9 మొదలు 16 సంవత్సరముల మధ్యకాలంలో వ్రణ సంబంధ మయిన పీడలు కలుగుతాయి. విద్య సాధారణంగా గడచిపోతుంది. నూతన పరిచయాలు ఏర్పడతాయి. ప్రతి సంవత్సరం పరీక్షలలో ఉత్తీర్ణు లవుతారు. నూతన ఆభరణములు, వాహన లాభం కల్గుతుంది.

17 నుండి 25 సంవత్సరముల కాలంలో చెడు ఆలోచనలు ఏర్పడ తాయి. ఈ కారణం చేత విశేషంగా ధనం ఖర్చుపెడతారు. చెడ్డపేరు వస్తుంది. అధికారులతో, ప్రభుత్వంతో గొడవలు కారణంగా నష్టం ఎదురు కోవలసి వస్తుంది. దుష్టజన స్నేహం కలుగుతుంది. తనవారి మాటను వినక దుష్టజన స్నేహం ఏర్పడుతుంది. ఇదే సమయంలో వివాహం జరిగి పుత్ర ప్రాప్తి కలుగుతుంది. ఇంతకు మునుపు చెప్పిన విధంగా శాంతి పూజా కార్యక్రమములు చేయుట వల్లన ఈ దోషం శాంతిస్తుంది.

26వ సంవత్సరం నుండి 38వ సంవత్సర మధ్యకాలంలో అనేక

విధములయిన లాభములు ఏర్పడతాయి. దేశదేశాంతర కీర్తి, గౌరవం పొందుతారు. అనేక వాహనములు కలిగి వుంటారు. సంతానానికి అనేక సౌకర్యములు కలుగజేస్తారు. అనేక మంచి పనులకు ధనం ఖర్చుచేస్తారు. సభా గౌరవం పొందుతారు. అనారోగ్యం ఏర్పడుతుంది. మంచి వైద్యం వల్ల అనారోగ్యం కుదుట పడుతుంది.

39 నుండి 50వ సంవత్సరముల మధ్యకాలంలో వివిధ ఉత్సవాలలో పాల్గొంటారు. ఇంట్లో అనేక శుభకార్యములు చేస్తారు. గృహ, భూలాభం కలుగుతుంది. ప్రత్యేకించి గృహనిర్మాణం విశేషంగా జరుగుతుంది. తమ అభిరుచి మేరకు చిత్ర విచిత్రంగా నిర్మాణం చేస్తారు. అందు నివశిస్తారు.

51 మొదలు 60వ సంవత్సరం మధ్యకాలంలో విశేషంగా ధనం సంపాదిస్తారు. ధన ధాన్య లాభం పొందుతారు. శుభకార్యముల మూలకంగా ధన వ్యయం చేస్తారు. ఇతరుల మీద స్నేహితుల సంతానానికి వివాహాది శుభకార్యములు చేస్తారు. ధర్మమార్గంలో నడుస్తారు. గొప్పవారి ఉపదేశములు పాటిస్తారు. పుత్ర పౌత్రాదులకు వివాహాది శుభకార్యములు చేస్తారు.

61 నుండి 70వ సంవత్సరంల మధ్యకాలంలో తీర్థయాత్రలు, ఇతర దేశాలు సంచరిస్తారు. వాతశ్లేష్మాది రోగముల వల్ల కష్టం కలుగుతుంది. తగిన వైద్య సౌకర్యం ఏర్పడడం వల్ల ఆరోగ్యం కుదుట పడుతుంది. ఇదే సమయంల్లో వివిధ దోషముల నివారణ కోసం దైవ సహాయం కోరి జప తపాదులు ఆచరిస్తారు. అప్పుడప్పుడు ఒంటరితనం అనుభవిస్తారు.

ఆ తదనంతర కాలంలో అనేక సుఖ సౌఖ్యములు పొంది, విశేషంగా దాన ధర్మాలు చేస్తారు. ఆ తరువాత ఉత్తరాయణ పుణ్యకాలంలో సద్గతి పొందుతారు.

# 16వ కథ

ఈ జన్మ పత్రికలో గ్రహములు శుభస్థానములలో ఉండుటచే ఈ జాతకులు మంచి ఆయుర్దాయం కలిగి ఉంటారు. విశేషమయిన ఆరోగ్యంతో మంచి విద్యకలిగి, మంచి బుద్ధికలిగి, శ్రేష్టమయిన ధనిక ఉదార కుటుంబంలో జన్మిస్తారు. అందమయిన దేహం కలిగిఉంటారు. ఉన్నతమైన వక్షం, కన్నులు, బలం మంచి విశేషభాషలు తెలుసుకొని ఉన్నతులుగా ఉంటారు. ఎప్పుడు సత్కర్మలతో మంచి మిత్రులతో కూడివుంటారు. విశేషమయిన వస్త్రములను, ఆభరణములతోను అలంకారప్రియులై ప్రకాశిస్తారు. దేవగురు భక్తికలిగి మిత్రకార్యములందు నేర్పుకలిగి ఉంటారు.

వీరికి అన్ని విశేషమయిన నేర్పుకలిగిన అంతరంగిక మిత్రులు ఉంటారు. వీరితో అన్నివిషయములు ముచ్చటిస్తారు. వీరిజీవితంలో ఎక్కువ కష్టాలుండవు. చిన్నతనంలోను, యవ్వనకాలంలోను, తరువాత మధ్యవయస్సులో స్వల్పకష్టం కలిగిస్తుంది. ఇవితప్ప వేరే కష్టాలు వీరిని దరిచేరవు.

ఈ స్వల్పమయిన కష్టములు ఏ విధంగా తొలుగుతాయి అని శుక్ర మహర్షిని ప్రశ్నించగా ఆయన ఈ విధంగా తెలియజేసారు. బీజాక్షర సంపుటితో శ్రీమహావిష్ణు మంత్రాన్ని జపించాలి, షోడశోపచార పూజలతో శ్రీమహావిష్ణువును ధ్యానించి తగిన దాన ధర్మములను, అన్నశాంతినిచేయాలని చెప్పబడింది.

వీరి జీవితంలో జరిగే ముఖ్య విశేషాలను తెలియజేస్తూ 1వ సంవత్సరంలో జ్వరభయం 2వ సంవత్సరంలో ఉదరసంబధ పీడను, 3వ సంవత్సరంలో నేత్రబాధ కలుగుతుంది. తల్లికి కొంచెం అనారోగ్యం చేస్తుంది. తండ్రికి విశేషలాభం, పదోన్నతి కలుగుతుంది. 4 నుండి 7వ సంవత్సరం మధ్యకాలంలో దెబ్బలు, పురుగులవల్ల కొంచెం బాధపడతారు. అయితే

విద్యారంభం జరుగుతుంది. దినదిన విద్యాభివృద్ధి జరుగుతుంది. గృహ మందు శుభకార్యములు జరుగుతాయి, అనేక ప్రదేశములు సంచరిస్తారు. వినోద విహార కార్యక్రమములలో ఉత్సాహంగా పాల్గొంటారు. 8వ సంవత్సరంలో స్వల్పఅనారోగ్యం కలుగుతుంది.మహామృత్యుంజయ మంత్రంతో జపించుట, జపతపాదులు చేయుటవల్ల సర్వబాధలు తొలగుతాయి.

8నుండి 16వ సంవత్సర మధ్యకాలంలో తండ్రికి విశేష ధనలాభం కలుగుతుంది. విశేషంగా చదువుకుంటారు. కళానైపుణ్యం ఏర్పడుతుంది. అనేకమంది మిత్రులతో పరిచయం ఏర్పడుతుంది. చదువు నిమిత్తం ఇతర ప్రాంతములకు వెళ్తారు. కొంచెం అనారోగ్యంవల్ల ఔషధసేవ చేయవలసి వస్తుంది. అనేక విద్యలలో నేర్పుకలిగి ఉంటారు.

17 నుండి27వ సంవత్సరం మధ్యకాలంలో చదువు పూర్తవుతుంది. మంచి అధికారం కలిగిన ఉద్యోగం చేస్తారు. విశేషంగా ధనం సంపాదిస్తారు. వివాహం జరుగుతుంది. విశేషమయిన ప్రీతితో నిర్మించుకున్న గృహంలో లేదా సర్వసౌఖ్యములు కలిగిన ఇంటియందు ఆనందంగా జీవిస్తారు. అనేక వ్యవహారములలో నేర్పుకలిగి ఉండి అధికారులతో మెప్పు పొందుతారు. తద్వారా గౌరవించబడతారు. మంచి సంతానం కలుగుతుంది. అయితే అయినవారితో కొన్ని విషయములలో విభేదం ఏర్పడుతుంది. అయినను అవి చాలతక్కువ కాలంలోనే అవి తొలగిపోతాయి.

28నుండి 38 సంవత్సరముల మధ్యకాలంలో సంతానయోగంకలుగుతుంది. ఇదే సమయంలో భార్యకు/భర్తకు అనారోగ్యం కలుగును. నెమ్మది మీద ఔషధసేవానంతరం ఆరోగ్యం కుదుటపడుతుంది. రాజకీయంగా ప్రయాణములు చేయవలసివస్తుంది. అనేక విషయములలో లాభం కలుగుతుంది. మిత్రలాభం కలుగుతుంది. ధనసంపాదనకూడా సంతృప్తికరంగా ఉంటుంది.

39 సంవత్సరం మొదలు 47వ సంవత్సరం కాలంలో ఇంట్లో శుభకార్యములుచేస్తారు. భూమూలకధనలాభం కలుగుతుంది. అన్నిరంగాల లోనుఅభివృద్ధికరంగా ఉంటుంది. సంతానానికి, విద్యా, ఇతర రంగములలో విశేషంగా ధనం ఖర్చుచేస్తారు. కొన్ని విషయములపై దృష్టిమళ్ళడంతో అధిక ధనవ్యయం చేస్తారు. కొద్దిగా ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటారు.

48నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో కళత్రము అనారోగ్యం బారినపడుటచేత కొంత విచారం కలుగుతుంది. మానసికంగా ఒక కష్టం ఏర్పడి చాలా బాధిస్తుంది. కొంతకాలం గడిచిన తరువాత దైవారాధన చేయుటవలన మెల్లగా స్వస్థత చెందుతారు. మిగిలిన కాలమంతా సుఖంగానే గడచిపోతుంది· 61నుండి 69 సంవత్సరముల మధ్యకాలంలో మంచిగౌరవం, ఉత్సాహం, కీర్తి వృద్ధిచెందుతాయి. శ్వాసకు సంబంధించిన వ్యాధులతో బాధపడతారు. దీనికి ఉపశమనంగా తుంగ, శొంఠి,కరక్కాయ పొడిగా చేసి, తేనెతో ఉదయం సాయంకాలం 7 నెలలు తీసుకుంటే రోగ నాశనం అవుతుంది. సంపూర్ణంగా అన్ని సుఖములు అనుభవించి భాద్రపద మాసంలో కృష్ణఅష్టమి రోజున వృషభరాశిలో చంద్రుడు వుండగా బంధు జనులతో వుండగా దేహత్యాగం జరుగుతుంది.

# 17 వ కథ

భృగు మహర్షి ఈ జాతకుని గురించి ఈ విధంగా తెలియజేసారు ఈ జాతకం నందు గ్రహములు సాధరణ బలం కలిగి ఉంటాయి. ఆర్థిక స్థితి చక్కగా ఉంటుంది. శత్రువులను,మిత్రులను సమానంగా చూడగలరు. నీతిపరులు, అనేక విషయములపై పరిజ్ఞానం కలవారు. మంచిఆలోచన కలిగి ఉంటారు, చాలామందితో పరిచయాలు ఉంటాయి. ఇతరుల కార్య

క్రమములు చేయుటలో నేర్పు కలిగి ఉంటారు. బలమయిన దేహం విశాల మయిన భుజములు కలిగి ఉంటారు. అలంకారం చేసుకొనుటయందు ఆసక్తి కలిగి ఉంటారు. వీరియొక్క కళత్రం కూడా మంచి అందంగా, చూడ ముచ్చటగా ఉంటారు.

ఈ జాతకునకు చిన్నతనంలోను, మధ్యవయస్సులోను, వృద్ధాప్యం నందు కొద్దిగా కష్టాలు ఎదురవుతాయి. చిన్నతనంలో ఏర్పడే కష్టం వాత, పిత్త సంబంధంగా జ్వర బాధ కలుగుతుంది. దీనికి నివారణ భృగుమహర్షి తెలియచేస్తూ ఔషద సేవ, దానములు, తగిన జపములు రహస్యంగా చేయ వలెను. భువనేశ్వరి యంత్రంతో గంధ పుష్పములతో శాస్త్రప్రకారం పూజించి, వటిక మంత్రమును 108సార్లు జపించి అన్నశాంతిచేసి రాత్రి సమయమందు దానమిచ్చినచో తొలగి బలం, సుఖం ఏర్పడతాయి.

వివిధ సంవత్సరములలో ఏర్పడే ఫలితములను పరిశీలిస్తే 1వ సంవత్సరంలో ఆసన సంబంధమయిన అనారోగ్యములు, 2వ సంవత్సరములో ముఖసంబంధ వ్యాధులు, 3 సంవత్సరంలో శరీరంపై కురుపులు తో కొంత బాధపడతారు. 4వ సంవత్సరంలో తల్లికి అనారోగ్యం చేస్తుంది. ఔషద సేవవల్ల పైరోగములు శాంతిస్తాయి. 5వ సంవత్సరంలో తండ్రికి అధిక లాభం, ధనవృద్ధి, మంచిపేరు వస్తుంది. ఈ సమయంలోనే విద్యా ప్రారంభం, నూతన వస్త్ర భూషణలాభములు కలుగుతాయి.

6 నుండి 14 వ సంవత్సరముల మధ్యకాలంలో ఏర్పడే ఫలితం తప్పక జరుగుతాయి. నేను చెప్పినవి యధార్థముగా జరుగుతాయి. విద్యాభి వృద్ధి జరుగుతుంది. ముఖ్యంగా గణితశాస్త్రాభివృద్ధి జరుగుతుంది. ఇంటి యందు వివాహాది శుభకార్యములు జరుగుతాయి. అయితే తరుచు అనా రోగ్యం బారిన పడుతూ ఉంటారు.

15 నుండి 23వ సంవత్సరముల మధ్యలో విద్యాభివృద్ధి ప్రత్యే

కించి గణితశాస్త్రంలో విశేష అభివృద్ధి కలుగుతుంది. అనేక పరీక్షలలో జయం కలుగుతుంది. రాజద్వారంనందు (Interview) లలో విశేషము యిన నేర్పు చూపిస్తారు. ఇదే సమయంలో వివాహం జరుగుటకు అవ కాశం ఉంది.

ఉద్యోగలాభం కలుగుతుంది. సోదరుల ద్వారా లాభం కలుగు తుంది. కళత్రమునకు ఉదర సంబంధమయిన అనారోగ్యం కలుగుతుంది. తండ్రి ఆరోగ్యంలో కొంత తేడా కనిపిస్తుంది. ఉప్పు, నెయ్యి, బంగారం కంటిదానం ఇచ్చుట వలన పైదోషముల తీవ్రత తగ్గుతుంది. పుత్రికా లాభం కలుగుతుంది. కళత్ర సహితంగా రెండు రకముల యోగములు ఏర్పడుతాయి.

24 నుండి 35 వ సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగములలో ఉన్నత స్థితి, అధిక ఉత్సాహం, ధనలాభం కలుగుతాయి. స్వజనులతో, లేదా ఇతర కాలమందు వారితో శత్రుత్వం ఏర్పడుతుంది. అయితే అది త్వరలోనే నివారించబడుతుంది. ఇదే సమయంలో వీరికి ఒక వ్యక్తి ప్రీతి కలుగుతుంది. వారితో ఎక్కువకాలం గడపడానికి యిష్టపడతారు. ఇది ఎందుకు ఏర్పడింది అని కోరగా, శుక్ర మహర్షి చెప్పుతున్నారు. పూర్వ జన్మంలో కళత్రం యెడల అధిక ప్రేమ కలిగి ఉండుటచే అది ఈ జన్మలో ఈ విధమయిన ప్రీతి కలిగెను.

36 నుండి 45 సంవత్సరముల మధ్యకాలంలో ధనలాభం, నూతన గృహలాభం, వీటి నిమిత్తమై ధనవ్యయం అవుతుంది. ఈ సమయంలోనే తండ్రి ఆరోగ్యం కొంత ఆందోళనకరంగా ఉంటుంది. విందు, వినోద కార్యక్రమాలలో తరచు పాల్గొంటారు. గృహమందు వృద్ధుని మరణం వల్ల బంధు జనులతో పరిచయం ఏర్పడటం, ప్రతిష్ఠ ఏర్పడతాయి.

45 నుండి 55 సంవత్సరముల మధ్యకాలంలో అనేక విధముల

లాభములు, ఉద్యోగమందు మంచిపేరు ప్రఖ్యాతులు కలుగుతాయి. గృహ మందు శుభకార్యములు చేస్తారు. కళత్ర చింత కలుగుతుంది. 56 నుండి 65 సంవత్సరము మధ్య కాలంలో పుత్రపౌత్రులతోను, ధనధాన్యములతోను తులతూగుతారు. శ్వాస పీల్చటంలో కొంత ఇబ్బంది కలుగుతుంది. ఊపిరి తిత్తులకు సంబంధించిన వ్యాధులతో బాధపడతారు.

ఆ తరువాత కాలంలో సుఖంగా కాలం గడుపుతు భాద్రపద మాసంలో కృష్ణపక్షంలో త్రయోదశి రోజున నిర్యాణం కలుగుతుంది.

# 18 వ కథ

శుక్ర మహర్షి ఈ జాతక పత్రిక గురించి చెప్పుచున్న దేమనగా ఈ జాతకమందలి గ్రహములు శుభ ఫలితములు ఇస్తాయి. వీరు కష్టపడి ధనం సంపాదించే నేర్పు కలవారు. మంచి సంతానం కలిగి ఉంటారు. వీరికి ప్రజలలో మంచి పేరు ఉంటుంది. దైవభక్తి, సాధువుల యందు భక్తి కలిగి ఉంటారు. విలువయిన వస్తువులు సేకరించుట యందు ఆసక్తి కలిగి వుంటారు. ఒత్తయిన జుత్తు, అందముగా వుంటారు. మంచి వివేకం, జ్ఞానం, కలిగి వుంటారు. కవిత్వ మందు ప్రీతిని కలిగి వుంటారు.

వీరికి జీవితంలో చిన్న చిన్న ఆటంకములు ఏర్పడినను వీరి భక్తి కారణంగా మరియు ఆయా కాలములలో వీరిచే చెయ్యబడ్డ ప్రాణ ప్రతిష్ఠాది పూజలు, శాంతుల వల్ల ఎటువంటి ఇబ్బంది పడరు. పూర్వ జన్మమందు ఈ జీవుడు ఉన్నత కాలములో జన్మించి మంచి విద్య నభ్యసించి మంచి దైవభక్తి కలిగి కలిగి ఉండేవారు. వీరి తండ్రి ఉన్నత ఉద్యోగములో రాజసమానులుగా వుండెడి వారు.

వీరి జీవితంలో సంఘటనలను పరిశీలిస్తే 1వ సంవత్సరంలో నేత్ర

రోగములు 2వ సంవత్సరంలో సాధారణ జ్వరములు, మూడవ సంవత్స రంలో కురుపులతో బాధపడతారు. 4వ సంవత్సర మందు సోదరయోగం ఏర్పడుతుంది. తండ్రికి భూమి మూలకంగా ధనలాభం కలుగుతుంది. ఈ సమయంలోనే విద్యారంభం కలుగుతుంది. ఇదే సమయంలో తండ్రికి ఉద్యోగ రీత్యా ఇతర ప్రాంతాలకు ప్రయాణం అవుతాయి. ఈ సమయంలో తండ్రికి అధిక ధనలాభం కలుగుతుంది. ఉద్యోగములో ఉన్నత సాధనము పొందుతారు.

6 నుండి 15 సంవత్సరముల మధ్యకాలంలో ఏర్పడే ఫలితము లను పరిశీలిస్తే అధిక ప్రయాన మూలకముగా విద్యాభివృద్ధి కలుగుతుంది. తండ్రికి ఉద్యోగరీత్యా కొద్దిగా లేదా చాలా తక్కువగా కష్టాలు ఎదు ర్కొంటారు. ఏ దానంవల్ల ఈ కష్టం తొలగుతుంది అని భృగుమహర్షి ని కోరగా యథావిధిగా స్వర్ణమూర్తి (బంగారు రూపు) దానం చేస్తే కష్టం నివారించబడుతుంది.

16 నుండి 25వ సంవత్సరముల మధ్యకాలంలో అనేక విధంగా సౌఖ్యములు ఏర్పడతాయి. విద్యాభ్యాసం పూర్తవుతుంది. మంచి ప్రభుత్వో ద్యోగంలో ప్రవేశిస్తారు. పితృ చింత మాతృ కష్టం కలుగుతుంది. నాన ధర్మాది పుణ్యకార్యముల వల్ల సర్వదుఃఖములు నశిస్తాయి. వివాహం జరుగుటకు అవకాశముంది. పుత్రప్రాప్తి, సోదరలాభం కలుగుతుంది.

24 నుండి 34వ సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగములో విశేష గౌరవం, ధనాభివృద్ధి, పూర్వ కర్మానుసారంగా ఇతర వ్యక్తుల (స్త్రీ/పురుష) యందు ప్రీతి కలుగుతుంది. ఈ కారణంగా అధిక వ్యయం అవుతుంది. ఇదే సమయంలో ప్రతాపయోగం నిమిత్తం, ఇతర నిర్మాణ ముల నిమిత్తం అధిక వ్యయం అవుతుంది. ఈ సమయం మొత్తం సంతోషంగా కాలం గడుస్తుంది.

35 నుండి 45 సంవత్సరముల మధ్యకాలంలో అనేక విధము లయిన సుఖములతోను నానాద్రవ్యములతోను కూడి ఉంటారు. ఉద్యోగ రీత్యా అనేక మందితో ప్రయాణములు చేసి ధనలాభం పొందుతారు. గౌరవాభివృద్ధి కలుగుతుంది. కళత్రానికి ఆరోగ్యంలో కొంత మార్పు వస్తుంది. ఔషధసేవ వలన, చండికాదేవిని ప్రార్థించుటవలన ఈ అనా రోగ్యము శాంతిస్తుంది అని భృగుమహర్షి చెప్పియున్నారు.

46 నుండి 55 సంవత్సరముల మధ్యకాలంలో అనేక లాభములను, కీర్తిని పొందుతారు. గృహంలో అనేక శుభకార్యములు జరుగుతాయి. పుత్రికా వర్గం వారివల్ల అధిక ధనవ్యయం జరుగుతుంది. వస్త్రములు, గృహోపకరణములకై విశేషమయిన ధనం ఖర్చుచేస్తారు. స్వల్ప కష్టం కలుగుతుంది. ఔషధ సేవవలన ఈ కష్టం శాంతిస్తుంది.

56 నుండి 65 సంవత్సరముల పర్యంతం మంచిమిత్రునితో లేదా బాగా తెలుసున్నవారితో శత్రుత్వ మేర్పడుతుంది. ఆ శత్రువు ప్రత్య క్షంగా మిత్రునివలె, పరోక్షమందు శత్రువువలె సంచరిస్తాడు. రాజకీయం నందు ఆటంకములు కలిగిస్తూ వ్యవహారమునందు సమంగా ఉంటాడు. శత్రువిధ్వంసన పూజలు చేయుటవలన ఈ కష్టం తొలగుతుంది. ఆ తరు వాత కాలంలో వీరికి అనేకమంది సేవకులు ఏర్పడతారు. మంచి పేరు సంపాదిస్తారు. మంచి పదవి లభించినను ఆకస్మికంగా ఏర్పడే ఇబ్బంది వల్ల భయవిచారములు కలుగుతాయి.

ఇదే సమయంలో జీవచింత కలుగుతుంది. తెలియని రోగములు పీడిస్తాయి. ఔషధసేవ వృథా అవుతుంది. రెండు విధములయిన కష్టములు కలుగుతాయి. తగిన దేవతాప్రతిష్ఠల వల్ల ఈ కష్టములు తొలగుతాయి. మానసిక సంతృప్తి ఏర్పడుతుంది. ఈ విధంగా వీరి జీవితం జరిగి అనాయాసముగా మరణిస్తారు.

# 19 వ కథ

శ్రీమహాగణాధిపతికి నమస్కరించి భృగుమహర్షి చెప్పినదేమనగా ఈ జన్మపత్రికయొక్క గ్రహములు మంచిదృష్టికలిగి ఉండుటచే సమస్త సంపదలు, మంచి ఆరోగ్యము, దీర్ఘాయుర్దాయం కలిగి వుంటారు. తల్లి తండ్రులయందు భక్తికలిగి ఉంటారు. మంచి సుఖములు అనుభవిస్తారు. ఉన్నతమయిన విద్య అభ్యసిస్తారు. విలువయిన వస్త్రములు ధరిస్తారు. అనేక కార్యములందు నేర్పుకలిగి ఉంటారు. మంచిపేరు కలిగి ఉంటారు. మధ్యవయస్సులో కొన్ని కష్టములు కలిగినను మంచి ఆయుర్దాయం కలిగి ఉంటారు.

ఏ ఉపాయంచే ఈ దోషములు తొలగుతాయి చెప్పవలసినదిగా భృగుమహర్షి ని కోరగా ఆయన చెప్పినది ఏమనగా బంగారురేకుపై 4 అంగుళముల వృత్తం గీయించి అందు రాజరాజేశ్వరి యంత్రమును చందన అగరు, కుంకుమలతో పూజించి అదే మంత్రమునులక్షసార్లు జపించి అన్న దానం చేసినచో సమస్త దోషములు తొలగి పూర్ణాయుర్దాయం కలుగు **తుంది.**

మొదటిసంవత్సరములందు జ్వరమును, రెండవ సంవత్సరమందు సుఖ పీడను, మూడవ సంవత్సరమందు ప్రజబాధలు కలుగుతాయి. సోదరవృద్ధి కలుగును, తండ్రికి ఉద్యోగమందు లాభం కలుగుతుంది. 4 నుండి 12వ సంవత్సరం మధ్యకాలంలో ఈ జాతకుని తండ్రికి లాభం కలుగుతుంది. ఈ 4వ సంవత్సరమందే విద్యారంభం కలుగుతుంది. జ్వర పిత్తాదులవలన స్వల్ప అనారోగ్యం కలుగుతుంది. తల్లికి తండ్రికి కొంచెం అనారోగ్యం ఏర్పడుతుంది.

13 నుండి 23వ సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి, అనేక ప్రవేశ పరీక్షలలో పాల్గొంటారు. కృతార్థులవుతారు. తండ్రికి ఐశ్వర్యాభివృద్ధి, అనేక భూవస్త్ర భూషణాది లాభములు కలుగుతాయి. జాతకునకు వాహన సౌఖ్యం కలుగుతుంది. గృహమందు శుభకార్యముల మూలకంగా వినోద కార్యక్రమములు బంధుజన సమావేశములు, నూతనగృహ నిర్మాణం మొదలగునవి జరుగును.

24నుండి 34 సంవత్సరముల మధ్యకాలంలో అనేక వాహనములు కలిగి వుంటారు. సంతానయోగం కలుగుతుంది. తల్లిదండ్రులకు అనారోగ్యములు కల్గుతాయి. అనుకోని విధంగా శత్రువులు ఏర్పడి ఇబ్బంది పెడతారు. ఇందువల్ల ఒక విచారం కలుగుతుంది. దీనికి కారణం ఏమిటనగా క్రితం జన్మలో రోగగ్రస్థమయిన ఆవును దానమిచ్చుటవలన దోషం ఏర్పడినదని అందువల్ల ఈ జన్మమందు ఈ కష్టమేర్పడిందని భృగు మహర్షి తెలియజేసారు. దీనికి నివారణ తెలియజేయమనగా ఒక ఆవును దూడతో దానమిచ్చిన సుఖప్రదంగా వుంటుందని చెప్పబడింది.

35నుండి 45 సంవత్సరముల మధ్యకాలంలోచాలా వుత్సాహకరంగా మంచి అభివృద్ధికరంగా వుంటుంది. శుభకార్యముల నిమిత్తం అధికంగా ధనవ్యయంచేస్తారు. అనేకదేశములు ప్రయాణం చేస్తారు. విద్యావంతులయిన వారి స్నేహం లభిస్తుంది. అనేకవిషయములపై చర్చాగోష్టులు సాగిస్తారు. పిల్లలకోసం ధనం ఖర్చుచేస్తారు. 44, 45సంవత్సరంలో కళత్రానికి వాత సంబంధమయిన రోగం కలుగుతుంది.

46 మొదలు 55 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి అనారోగ్యం కలుగుతుంది. మంచి వైద్యం చేయించుచు అన్నదానం చేయించిన యెడల సందేహం లేకుండా రోగనివారణ జరుగుతుంది. దినదినాభివృద్ధిగా అధికలాభం కలుగుతుంది. ఒక తీర్థయాత్ర కుటుంబ పరివార సహితంగా వెళ్ళి విరివిగా దానాదులుచేస్తారు.

56మొదలు దలు 65 సంవత్సరముల మధ్యకాలంలో అధికసౌఖ్యం అధిక ధనలాభం, మంచికీర్తి కలుగుతాయి. పిల్లలకు వివాహంవంటి శుభకార్యములు చేస్తారు. తద్వార ధనవ్యయంచేస్తారు. ఈ సమయంలో ఆదాయ వ్యయములు సమానంగా వుంటాయి. ఎక్కువ సమయంభక్తిలో గడుపుతారు.

ఈ విధంగా సంపూర్ణంగా జీవితాన్ని అనుభవించి వైశాఖమాస మందు కృష్ణపక్షమి అష్టమి తిధి కలిగిన ఆదివారంనాడు మఖానక్షత్రంలో చంద్రుడు వుండగా నిర్యాణం కలుగుతుంది.

ఓ శుక్రుడా! అంత్యకాలమందు అనుకోకుండా మానసిక చింత భయం కలుగుతుంది, ప్రాణభయం కలుగుతుందని మనస్సులో చింత పడతారు.

# 20 వ కథ

ఈ జాతక పత్రిక యందలి గ్రహములు బలము కలిగి ఉన్నాయి. శుక్రుడు చెప్పేది ఏమనగా ఈ జాతకులు శ్రీమంతులు, కళాభిమానులు అనేక విధములయిన లాభములు పొందుతారు. తమ కార్యములందు పట్టుదల కలిగి వుంటారు. కుటుంబం అంటే వాత్సల్యం కలిగి వుంటారు. ఇతరుల పనులు చేయుటలో నేర్పుకలిగి వుంటారు. వీరు విశాల వక్షస్థలం పెద్దకన్నులు కలిగి వుంటారు.

పూర్వజన్మ ప్రభావము వలన ఇతరులతో (స్త్రీ పురుష) సమాగమం ఏర్పడుతుంది. వీరు అందంగా వుంటారు. ఆప్తమిత్రలాభం కలిగి ఉంటారు. ఈ జాతకులకు రెండురకములయిన కష్టాలు బాల్యావస్థలోను, మధ్యవయస్సులోను కలుగుతాయి. అయితే తగిన జప, తప, శాంతులు చేయుట ద్వారా సత్ఫలితములు తొలగి సుఖములు కలుగుతాయి.

1 నుండి 4వ సంవత్సరం మధ్యకాలంలో ఫలితములు పరిశీలిస్తే 1-2 సంవత్సరములలో ముఖరోగమును, విషుచికాది రోగములు కలుగుతాయి. 3వ సంవత్సరమందు మాతృసంబంధమయిన పీడ కలుగుతుంది. ఔషధసేవ వలన శాంతించి తిరిగి సోదరలాభం కలుగుతుంది. గృహమందు శుభకార్యములు జరుగుతాయి. తండ్రికి మంచి అభివృద్ధికరంగా ఉంటుంది. నాలుగవ సంవత్సరమందు ఎత్తైన ప్రదేశము నుండి పడుట జరుగుతుంది. వ్రణ సంబంధమయిన పీడ, భూమూలకంగా తండ్రికి ధన లాభం కలుగుతుంది.

5 నుండి 12వ సంవత్సరం మధ్యకాలంలో శుభఫలితములు, విద్యారంభం కలుగును. తల్లి ఆరోగ్యం కొంత ఆందోళన కలిగిస్తుంది. అయితే దానజపాదులు చేయించుటచే ఈ కష్టం నివారించబడుతుంది. ఉద్యోగరీత్యా తండ్రికి ప్రయాణాలు కలుగుతాయి. పిమ్మట ధనలాభం కలుగుతుంది. సోదర సోదరీయోగం అనేక విధములుగా ధనలాభం కలుగుతుంది.

13 నుండి 20 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి, పారితోషిక మూలకంగా లాభం కలుగుతుంది. గృహమందు వృద్ధుల మృత్యువు కలుగుతుంది. శుభకార్యముల నిమిత్తం తండ్రికి విశేషంగా ధన వ్యయం కలుగుతుంది. భూవాహనాది లాభములు కలుగుతాయి. అనేక ప్రదేశములు పర్యటిస్తారు. విద్యార్జన నిమిత్తం జలసముదాయం అధికంగా గల ప్రదేశమునకు స్థాన లాభము కలుగుతుంది.

21 నుండి 27 సంవత్సరముల మధ్యకాలంలో వివాహాది శుభకార్యములు జరుగుతాయి. మంచి యోగ్యమయిన కళత్రం కలిగి వుంటారు. అల్పాయుర్దాయముగల సంతానం కలుగుతుంది. ప్రత్యేకించి ప్రథమ సంతానం నష్టం కలుగుతుంది. ప్రయత్నపూర్వకంగా సంతానగోపాల మంత్రం లేదా జాతకరీత్యా పంచమాధిపతిని పూజించినయెడల సంతాన

గోపాలమంత్రమును బంగారు లేదా రాగిరేకుపై వ్రాయించి 6 నెలలు పూజించినచో దానములు చేయుటవలన విశేష ఆయుర్దాయంగల సంతానం కలుగుతుంది.

28నుండి 36వ సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభకార్యములు కలుగుతాయి. వాత పిత్తాధిక్యమువలన స్వల్ప అనారోగ్యం కలుగుతుంది. ఇది క్రమంగా పెరిగి ఔషధసేవ చేయుటవలనకూడా తగ్గక పీడిస్తుంది. తగిన ఔషధ జప, హోమాదులవలన తగ్గుతుంది. ఇదే సమయంలో వుద్యోగరీత్యా పదోన్నతి, భూధనవృద్ధి, కీర్తి కలుగుతాయి.

37 నుండి 49 సంవత్సరముల మధ్యకాలంలో సంతానమునకు వివాహాదుల మూలకంగా ధనధాన్య వ్యయము కలుగుతుంది. అనేక ఆభరణాలకోసం ధనం ఖర్చుచేస్తారు. నూతన వాహనాలు కొనుగోలు చేస్తారు. అనేక ప్రదేశములు పర్యటిస్తారు. ఈ పర్యటనవలన ధనవాహనాదిలాభములుకలుగుతాయి.దానధర్మముల మూలకముగా అధికవ్యయం అవుతుంది.

50 నుండి 60సంవత్సరముల మధ్యకాలంలో భూలాభవృద్ధి, పుత్రపౌత్రాది సర్వసుఖములు కలుగుతాయి. దైవకార్యముల నిమిత్తం ధనం ఖర్చుచేస్తారు. బీదవారికి శుభకార్యముల నిమిత్తం ధనసహాయం చేస్తారు. ఇదే సమయంలో వీరికి కీర్తి విశేషంగా కలుగుతుంది.

60 నుండి 70వ సంవత్సరము మధ్యకాలంలో దానధర్మాలతో దైవ చింతనలో సుఖముగా కాలం గడుపుతారు. 80 సంవత్సరముల ఆయుర్దాయం కలిగి కార్తీకమాసమందు పౌర్ణమిరోజున వృషభరాశియందుచంద్రుడు వుండగా నిర్యాణం కలుగుతుంది.

ఈ జీవుడు మరునటి జన్మంలో విశేషమయిన పేరుప్రఖ్యాతులు కలిగిన వారిఇంట జన్మిస్తారు. పూర్వజన్మ పుణ్యమువలన మంచిపేరు పొందుతారు, ఇది భృగువాక్యము. తప్పదు.

# 21 వ కథ

భృగుమహర్షి చెప్పినది ఏమనగా ఈ జాతక పత్రికయందలి గ్రహములు శుభసాధనములందు వుండుటచే జాతకులు అందమయిన వారు, విశాలమయిన పెద్దకళ్ళు, వక్షస్థలము కలిగివుంటారు. అందరితో మంచిగా వుంటారు. చక్కగా మాట్లాడే నేర్పుకలిగి వుంటారు. కఠినంగామాట్లాడరు. ఇతరుల కార్యములందు నేర్పుకలిగి వుంటారు. అనేక సుఖములు అనుభవిస్తారు. అయితే వుద్యోగములో పై అధికారులతో సరిగా వ్యవహరించక కొంతకాలం వైరం కలిగివుంటారు. తగిన శాంతులు చేయుట ద్వారా ఈ కష్టంకూడా త్వరలోనే తొలగుతుంది.

ప్రభుత్వ వ్యవహారములలో విశేషమయిన నేర్పుకలిగి వుంటారు. అనేకరకములయిన విద్యలందు నేర్పుకలిగి వుంటారు. ధర్మశాస్త్రమును పఠిస్తారు. అనారోగ్యము ప్రాప్తించుట వలన మానసికచింత కలుగుతుంది. శరీరహాని కలుగుతుందనే సందేహం ఏర్పడుతుంది. తగిన శాంతులు చేయుట వలన ఈ దోషములు తొలగుతాయి. వివిధ సంవత్సరములలో జరిగే ఫలితములను పరిశీలించినచో 1-2 సంవత్సరముల కాలంలో దంత సంబంధమైన జ్వరభయమును మూడవ సంవత్సరములో కురుపులతో బాధపడతారు. మాతృకష్టము కలుగుతుంది, సోదర లేదా సోదరీయోగం కలుగుతుంది. ఇదే సమయంలో తండ్రికి ధనలాభం కలుగుతుంది. 4వ సం॥లో తల్లికి కొంతఅనారోగ్యం కలుగుతుంది. అయితే ఔషధసేవవలన ఈ అనారోగ్యం శాంతిస్తుంది. ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. 5నుండి 8 సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జనలో వుంటారు. సందేహంలేకుండాతండ్రికి ధనలాభం కలుగుతుంది. స్వల్పఅనారోగ్యములు ఏర్పడినను ఔషధము తీసుకొనుట వలన శాంతి కలుగుతుంది,

9 మొదలు 16సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు అనేక శుభకార్యములవల్ల భూషణ, వస్త్ర, వాహనములవల్ల ధనవ్యయం కలుగుతుంది. అనేకమందితో పరిచయం గీతావాయిద్యములవల్ల వినోదము కలుగును. విద్యాభివృద్ధికలుగుతుంది. ప్రభుత్వ పారితోషికములు ఉన్నతాధికారుల మన్ననలు పొందుతారు.

16నుండి 20 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి, ధనలాభము, కీర్తివృద్ధి కలుగుతాయి. ఉన్నతవిద్య అభ్యసిస్తారు. అనేకమంది మిత్రులతో పరిచయం కలుగుతుంది. ఈ సమయమందు విద్యార్హత, విశేషఖ్యాతి కలుగుతుంది. మిత్రగోష్ఠులతో కాలం గడిచిపోతుంది. ధనసంపాదన మార్గం ఏర్పడుతుంది.

21 నుండి 27 సంవత్సరముల కాలంలో పదవీలాభం కలుగుతుంది. ఇదే సమయంలో ఒక మంచి వ్యక్తితో పరిచయం అవుతుంది. తదనంతర కాలంలో ఇతనే ప్రాణమిత్రుడవుతాడు. వీరిద్దరు కలసి ప్రయాణము చేయుట, తద్వారా ధనలాభం కలుగుతుంది. ఇదే సమయంలో వివాహాది శుభకార్యములు జరుగుతాయి.

28 నుండి 35 వ సంవత్సరముల మధ్యకాలంలో అనేక విధములుగా ధనలాభం కలుగుతుంది. నూతన గృహ నిర్మాణం చేస్తారు. సంతానవృద్ధి కలుగుతుంది. ఇదే సమయంలో అనేక నూతన పరిచయములు కలుగుతాయి. ప్రత్యేకించి ఒక సుందరమయిన స్త్రీ/పురుష పరిచయం ఏర్పడుతుంది. ఈ పరిచయంవల్ల అకారణ శతృవృద్ధి కలుగుతుంది. ఇందువలన కొంత మానసిక కష్టం కలుగుతుంది. ప్రభుత్వ మూలకంగా కొంత ధనలాభం కలుగుతుంది. ఇంతవ మందర చెప్పబడిన మానసిక ఆందోళన శతృవృద్ధి తొలగి శత్రువులే మిత్రులవుతారు. అన్ని కార్యములందు జయం కలుగుతుంది.

36 నుండి 42 సంవత్సరముల మధ్యకాలంలో అనేక సంపదలు కలిగి వుంటారు. నానా విధ వాహన ప్రాప్తి అవుతుంది. గృహాభివృద్ధి, చరస్థిరాస్తుల నిమిత్తం ధనవ్యయం చేస్తారు.

43 నుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో ఆ తరువాత 60 సంవత్సరం పర్యంతరం ఉద్యోగమునందు వున్నత పదవీ లాభం కలుగుతుంది. కళత్రంతో ఖేదము కలుగుతుంది. పౌత్రజననం వల్ల శుభకార్యములను, దినదినాభివృద్ధిగా లాభమును కలుగుతాయి. శరీరమునకు కొంచెం అనారోగ్యము ఏర్పడుతుంది. అయితే, జప, హోమ మంత్రాదులు ఔషధసేవ చేయుట వల్ల ఈ అనారోగ్యం తొలగుతుంది. ఈ సమయంలో తీర్థయాత్రాదులు చేస్తారు. దాన ధర్మాలవల్ల విశేషమయిన పేరు పొందుతారు. పుత్రపౌత్రాదులతో సుఖముగా కాలం గడుపుతారు.

61 నుండి 65 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభ కార్యములు చేస్తారు. పురాణ శ్రవణం చేస్తారు. అంత్యమున కష్టాధిక్యము వలన బాధపడతారు. ఆ తరువాత కాలంలో నానా విధమయిన సుఖములు అనుభవిస్తూ వైశాఖమందు కృష్ణపక్షమి శుక్రవారముఅనురాధ నక్షత్రంలో చంద్రుడు వుండగా ఉదయం సమయంలో మరణిస్తారు. భృగు మహర్షి చెప్పినదేమనగా ఈ జాతకులు పూర్వ జన్మమందు వున్నత కుటుంబంలో జన్మించినారు, రాబోయే జన్మలో ఐశ్వర్యవంతుల యింట జన్మిస్తారు. దేవతాగురు భక్తి కలిగి వుంటారు.

# 22వ కథ

శ్రీ గణేశాయనమః, ఈ జాతకుని చక్రఫలితములు తెలియచేయుచున్నాను, శ్రద్ధతో వినవలెను. ఈ జాతక చక్రమందలి గ్రహములు బలమైనవి. జాతకుడు మంచి వుద్యోగము కలిగివుండి విజ్ఞానవంతుడుగా పేరు కలిగి వుంటాడు. అందరికి యిష్టుడు, ధనవంతుడు, మంచివంశం

నందు జన్మించి సత్కుటుంబం కలిగి వుంటారు. ఒక సమయంలో చెడు స్నేహంవల్ల చెడు అలవాట్లకు బానిస అయి మనస్సులో ఆందోళనకలిగి వుంటారు. కొద్దికాలం తరువాత పశ్చాత్తాపం చెంది సక్రమమయిన మార్గంలో జీవిస్తారు. బుద్ధి అనుసారం అన్ని కార్యములందు చేస్తారు. వస్త్రభూషణములకై అధిక ధనవ్యయం చేస్తారు. మాతాపితృసౌఖ్యం పొందుతారు.

1వ సంవత్సరంలో జ్వరభయం, 2వసంవత్సరం దంత పీడయు, 3-4 సంవత్సరముల కాలంలో సోదర సోదరీ లాభం గృహమునందు శుభకార్యముల నిమిత్తం వాహనాదుల కొరకు తండ్రికి ధనవ్యయం కలుగుతుంది. ఇందు సందేహం లేదు. 5 నుండి 7 సంవత్సరముల మధ్య కాలంలో విద్యాభివృద్ధి, చపలత్వము కలిగివుంటారు. 8వ సంవత్సరములో వాహనాదుల నుండి పడుట లేదా ఇతర కారణములు వల్ల కొంచెం భయం కలుగుతుంది. జల, అగ్నివల్ల భయం ఏర్పడుతుంది. ఈ 8వసంవత్సర కాలంలోనే తండ్రికి ధనలాభం కలుగుతుంది. శుభకార్యముల నిమిత్తం ధనవ్యయం చేస్తారు. అనగా వివాహాది శుభకార్యముల నిమిత్తం, యజ్ఞ యాగాదుల కోసం, ప్రజోపయోగం కోసం జరిగే కార్యక్రమాలకై ధన వ్యయం చేస్తారు.

11నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి ధనలాభం కలుగుతుంది. జాతకునికి విద్యాభివృద్ధి కలుగుతుంది-యుద్ధ విద్యలు అభ్యసించుట యందు ఆసక్తి కలిగి వుంటారు. సంగీత సాహిత్యాది విద్యల యందు అభిమానం కలిగి వుంటారు. 16నుండి 20 వ సంవత్సరం మధ్య కాలంలో నూతన మిత్రుల పరిచయం, మాతా పితృ సంబంధమయిన విచారము కలుగుతుంది. ఉన్నత విద్యను అభ్యసిస్తారు.

21నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో అటు పిమ్మట 30 సంవత్సరం పర్యంతరం ఉద్యోగములో ప్రవేశించుట, పదవీలాభం, కలుగుతుంది. వివాహాది శుభకార్యములు జరుగుతాయి. సంతానం కలుగుతుంది. అనేక ప్రయాణాలు చేస్తారు. అనేక విధములయిన సుఖములు అనుభవిస్తారు.

30 నుండి 40 వ సంవత్సరం మధ్యకాలంలో ఈ క్రింది ఫలితములు ఏర్పడతాయి. అందులో సందేహం లేదు. ఈ కాలమందు చేయు ఉద్యోగములో ఒత్తిడులు ఎదురౌతాయి. అధికారుల కోపానికి గురి అవుతారు. గృహమందు వృద్ధ మృత్యువు కలుగుతుంది. మనస్సులో గుప్తచింత ఏర్పడుతుంది. తద్వారా అనారోగ్యానికి గురి అవుతారు. ఔషధసేవ వలన ఈ అనారోగ్యం శాంతిస్తుంది. మహా మృత్యుంజయ మంత్రమును 1 లక్ష జపించాలి. నూతనంగా ఏర్పడే మిత్రులవల్ల ధన లాభం కలుగుతుంది. అంతరంగ విషయములన్ని ఈ నూతన మిత్రునితో సంభాషిస్తారు.

41 నుండి 50 వ సంవత్సరముల మధ్యకాలంలో ప్రభుత్వ వ్యవహారములతో, ప్రభుత్వ అధికారులతో శత్రుత్వం ఏర్పడుతుంది. అయితే కాలానుసారంగా జయము, శత్రునాశనం కలుగుతుంది. భూలాభం, బంగారం మొదలగునవి కొనుగోలు చేస్తారు. ఇందులో సందేహం లేదు.

51 నుండి 55 సంవత్సరముల మధ్యకాలంలో అధిక కష్టములు కలుగుతుంది. అయితే ఇదే సమయంలో అధిక దాన ధర్మములతోను, గోదానములతోను దేవి దేవతా పూజాదులతోను, పుత్ర పౌత్రాది సుఖములు కలుగుతాయి. సర్వరోగములు నాశనం అవుతాయి.

61 నుండి 70 వ సంవత్సరం మధ్యకాలంలో తీర్థయాత్రలు చేయుట, దైవభక్తి కలుగుతాయి. నూతన గృహనిర్మాణం చేస్తారు.

వాత శ్లేష్మాది శరీర పీడవలన శ్వాసకోస రోగములు కలుగుతాయి 71 నుండి 80 వ సంవత్సరముల మధ్యకాలంలో సుఖంగా నడుస్తుంది, ఎక్కువ ఇబ్బంది లేకుండా దేహత్యాగం చేస్తారు.

రాబోయే జన్మలో ఎక్కడ జన్మించునని కోరగా ఈ విధంగా తెలియజేసారు. ఉన్నత వంశంలో, ధనవంతుల కుటుంబంలో జన్మించి ప్రఖ్యాతి పొందుతారు. వీరు ఏకపుత్రులు విచక్షణాపరులు కీర్తి కలిగి వుంటారు. సర్వ కార్యములందు నేర్పరులై వుంటారు. దైవారాధన తత్పరులు, అహింసా ప్రీతి కలిగి వుంటారు. ప్రయత్నంతో కాని సంతానం కలుగదు.

# 23 వ కథ

ఈ జన్మ పత్రిక యందు జాతక ఫలితములు శుభఫలితములుతో కూడి వుంది. జీవితం ప్రధమ భాగంలో సామాన్య ఫలితములను, తరువాయి భాగంలో సౌఖ్యమును పొందుతారు. ఈ జాతకులు బలవంతులు, బుద్ధిమంతులు, ఉదారస్వభావులు, న్యాయశాస్త్ర ప్రవీణులు అగుదురు. వీరు పూర్వ జన్మంలో స్త్రీగా జన్మించారు. ఈ కారణంవల్ల ఈ జన్మలో కొందరు స్వజనులవల్ల భయం కలుగుతుంది. చోరభయం లేదా అగ్ని భయం కలుగుతుంది. ఎత్తైన ప్రదేశముల నుండి పడుట లేదా వాహన ప్రమాదం జరుగు సూచనలు వున్నాయి. సదామిత్రులతో కూడివుంటారు. జలాశయముల యందు ప్రీతి కలిగి వుంటారు.

వీరు మంచి కీర్తి కలిగి, దేవతా గురుభక్తి కలిగి వుంటారు. ఒక సమయంలో అనాచారాలై భక్తిలేని వారుగా వుంటారు. తిరిగి పశ్చాత్తాపమును పొంది భక్తి కలిగి వుంటారు. ప్రభుత్వ కార్యములందునేర్పరులై వుంటారు. వీరి మధ్యకాలంలో ధన ధాన్యవృద్ధి కలుగుతుంది. దాన మంత్రాది శాంతుల వలన సమస్త కోరికలు నెరవేరును.

1వ సంవత్సరంలో నేత్రసంబంధమయిన పీడ,2 వ సంవత్సరంలో దంతబాధయు, 3, 4 సంవత్సరముల మధ్యకాలంలో మాతాపితృపీడ, తండ్రికి ధనలాభం, భూలాభం కలుగుతాయి.

5 నుండి 8 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభములు తండ్రికి లాభం కలుగుతాయి. విద్యాభివృద్ధి కలుగుతుంది. శరీరంపై వ్రణ సంబంధమయిన బాధ కలిగి ఔషధసేవ వలన శాంతించును. సోదర, లక్ష్మీరూప సంపత్తి కలిగిన సోదరీలాభం కలుగుతుంది. దిన దినాభి వృద్ధిగా ధనధాన్యలాభము కలుగుతుంది. తండ్రియొక్క ధనం శుభ కార్యముల నిమిత్తం వ్యయనవుతుంది. 8 వ సంవత్సరంలో కొంత అనారోగ్య మేర్పడిననూ స్వర్ణదానం, హోమయాగాదులవల్ల సర్వరోగ ములు శాంతిస్తాయి.

9 నుండి 12 వ సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి మనస్సు సందు గుప్తవిచారం కలుగుతుంది. పిమ్మట మంచి పేరు, ధనలాభం తప్పక జరుగును. స్వల్ప అనారోగ్యం కలిగి శీఘ్రముగా శాంతిస్తుంది. ఇదివరకు సాదించిన ధనం వివాహాది శుభకార్యముల నిమిత్తం ధనం ఖర్చు అవు ది. లాభవ్యయములు సమానంగా వుంటాయి. 13 మొదలు 20 వత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధులు అభివృద్ధి చెందుతాయి. ందు విధములయిన యోగములు కలుగుతాయి. రాజద్వారమునందు జయం కలుగుతుంది. శత్రునాశనం జరుగుతుంది. అనేక విధములయినవిషయ ములందు నేర్పుకలిగి వుంటారు.

21 నుండి 30వ సంవత్సరం మధ్యకాలంలో ఈ దిగువ ఫలితా ములు తప్పక జరుగును. తల్లి తండ్రుల ఆరోగ్యం కొంత ఆందోళన కలుగజేస్తుంది, పిమ్మట ధనలాభం తప్పక పొందుతారు. మంచి ఉద్యోగం దొరుకుతుంది. రాజమూలక (ప్రభుత్వ) ధనలాభము, కీర్తిని పొందుతారు.

పుత్ర, పుత్రికా లాభమును పొందుతారు. జాతకమునందలి రాజ్యాధిపతిని పూజించుట వలన పదవీలాభం కలుగుతాయి.

31 నుండి 40వ సంవత్సరముల మధ్యకాలంలో ధనధాన్యసమృద్ధి, గృహనిర్మాణం చేయుట వంటి శుభకార్యములు నిమిత్తం ధనం వ్యయం చేస్తారు. తండ్రికి అనారోగ్యములు కలిగి ఔషధసేవ వలన శాంతిస్తుంది. ఔషధసేవతోపాటు శాస్త్రానుసారం దైవప్రార్థన చేయవలెను. ఆ తరువాత అన్నదానం చేయాలి. ఇదే సమయంలో ప్రభుత్వం నుంచి భయమేర్పడి తిరిగి లాభం వాహనాది సౌఖ్యం, గుప్తధనం, మంచికీర్తి కలుగుతాయి.

41 నుండి 45 అటుపిమ్మట 50 సంవత్సరముల పర్యంతం, ధనాభివృద్ధి, కీర్తి కలుగుతాయి. కొంత మానసిక ఆందోళన కలిగి ఔషధసేవ వలన శాంతిస్తుంది. కొంతమంది మిత్రులతో శత్రుత్వం కలుగుతుంది. తద్వారా మానసికంగా కొంత బాధ ఏర్పడుతుంది. జపహోమాది కార్యముల వలన శత్రువుల నాశనం, రోగనాశనం కలుగుతుంది.

51 నుండి 60 వ సంవత్సరం మధ్యకాలంలో పుత్రాభివృద్ధికొరకు పాటుపడతారు. ఇదే విషయంపై మనస్సునందు విచారం కలిగి ఉంటారు. పరోపకారం చేయుటలోను, ప్రజోపయోగ నిర్మాణములలో ఆసక్తితో పాల్గొంటారు. తీర్థయాత్రలు, గృహనిర్మాణం విషయంలో అధికవ్యయం చేస్తారు.

ఆ తరువాత కాలంలో శ్లేష్మవాతరోగములచేత పీడింపబడతారు. 61 నుండి 70 సంవత్సరముల కాలంలో సకుటుంబంతో కాలం గడుపుతూ, భగవంతుని ప్రార్థిస్తూ శ్రావణమాసంలో కృష్ణపక్షం పంచమీ బుధవారం రోజున తులారాశియందు చంద్రుడు చిత్తానక్షత్రములో ఉండగా దేహత్యాగంచేసి సద్గతులు పొందుతారు.

# 24వ కథ

భృగుమహర్షి ఈ జాతకుని జాతక ఫలితములు ఈ విధంగా తెలియజేస్తున్నారు. ఇట్టి గ్రహసంపత్తిగల జాతకులు సుందరంగా మంచి మాట పలుకుబడి ఉండి, ఏ వ్యవహారమైనను చేయగలిగిన నేర్పు కలిగి ఉంటారు. ధనధాన్య సమృద్ధి కలిగి ఉంటారు. అయితే వీరు కోపం కలిగి ఉంటారు. జీవితమందలి మొదటి భాగములో కొంత కష్టంగాను, మధ్యావస్థలో మధ్యమంగాను, అంత్యావస్థలో సర్వసౌఖ్యములను అనుభవిస్తారు.

వీరు మంచి ఉద్యోగం కలిగి ఉందురు. భోగములు అనుభవించుటయందు ఆసక్తి కలిగి ఉంటారు. వీరు మంచి కళత్రం కలిగి ఉంటారు. కొంతకాలం గుప్తరోగములతో బాధపడతారు. ఈ రోగముల వల్ల శరీర దుర్బలత్వం ఏర్పడును. అందువల్ల సంసారసుఖం తక్కువగా ఉంటుంది. తగిన శాంతులు చేయుటవలన ఈ దోషంనుండి నివారణ కలుగుతుంది. వీరి జీవితంలోని ముఖ్య ఫలితములను పరిశీలించగా

1 నుండి 8వ సంవత్సరం మధ్యకాలంలో జరుగు ఫలితములను మాతృకష్టం, తండ్రికి ధనలాభం కలుగుతుంది. కురుపులవల్ల శరీరం దుర్బలమవుతుంది. కడుపునొప్పులు, ముఖపీడ కలుగుతుంది. సోదర సోదరీయోగం గృహమందు శుభకార్యములు జరుగుతాయి. విద్యారంభం అవుతుంది. ఆటపాటలతో ఈ కాలం గడచిపోతుంది.

9 నుండి 15వ సంవత్సరముల మధ్యకాలంలో శాస్త్రమునను సరించి కొన్ని చెడు ఫలితములు కలుగుతాయి. తండ్రికి విశేషలాభం చేకూరుతుంది. ఈ కష్టములు ఏ విధముగా తొలగును అనగా భృగువు చెప్పినదేమనగా మహా మృత్యుంజయజపం చేసిన తరువాత తగిన దానములు చేయుటవల్ల ఈ కష్టనష్టములు నశించును. తండ్రికి ఉద్యోగమందు

కొంత శత్రుత్వం ఏర్పడుతుంది. విద్యావిషయములు సాధారణంగా ఉండును. ఈ విధముగా కాలం గడచును.

16 నుండి 22 సంవత్సరముల మధ్యకాలంలో విద్య సంపూర్ణంగా పూర్తి అవుతుంది. రాచకార్యములందు నేర్పరులగుదురు. తద్వార ధన సంపాదన చేయు నేర్పు ఏర్పడుటుంది. ఒక వృద్ధమృత్యువువల్ల విశేషంగా ధనం ఖర్చు అవుతుంది. ఇదే సమయంలో కొంతమందితో శత్రుత్వము, భయం కలుగుతాయి. అనుకోకుండా ఏర్పడిన కష్టములు మంత్ర దాన జపాదులవల్ల శాంతించును.

22 నుండి 30వ సంవత్సరముల మధ్యకాలంలో వృత్తి, ఉద్యోగాలందు మంచి అభివృద్ధికరంగా వుంటుంది. మంచి సంతానం కలుగుతుంది. శుభకార్యముల మూలకంగా ధనవ్యయం అవుతుంది. శ్వాసకోశరోగములు వల్ల స్వల్ప అనారోగ్యం కలుగును. ఔషధసేవ వలన శాంతించును. గృహ, వాహనాభివృద్ధి, నానావిధ రత్నలాభమును, భూషణ వస్త్రలాభము కలుగుతాయి.

31 నుండి 40 సంవత్సరముల మధ్యకాలం అన్ని విషయములలో అభివృద్ధికరంగా వుంటుంది. శుభకార్యముల నిమిత్తం ధనం ఖర్చుచేస్తారు. కొంత మానసిక అశాంతి ఏర్పడుతుంది. చేయు ఉద్యోగమందు అశాంతి ఏర్పడుతుంది. అయితే ఇది దైవారాధన వల్ల శాంతిస్తుంది. వాహనాభివృద్ధి, మంచిపేరు పొందుతారు. తండ్రికి స్వల్ప అనారోగ్యం కలిగి ఔషధ సేవ వలన శాంతిస్తుంది.

41 నుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో కీర్తివృద్ధి, భూలాభం కలుగుతాయి. అధిక ఉష్ణం వలన కొంత అనారోగ్యం ఏర్పడుతుంది. 51 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో పుత్ర చింత, జ్ఞాన మార్గాభివృద్ధి, పరకార్యాశక్తి, భూమూలక ధనవృద్ధి. వీరుచేయు అనేక

కార్యములవల్ల స్వజాతిలోను, అన్యజాతిలోను మంచిపేరు గౌరవం కలిగి వుంటారు.

60 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో అనేక తీర్థయాత్రలు చేస్తారు. మహాదానములు చేస్తారు. కళత్రంకు అనారోగ్యమేర్పడి ఔషధ సేవ వలన లాభం పొందక సద్గతిని పొందుతారు. అనంతరం జాతకులు, మాఘమాసంలో శుక్ల పక్షమందు కృత్తికానక్షత్రంలో చంద్రుడుండగా సప్తమితిధిరోజున దేహత్యాగం చేస్తారు.

మరుజన్మలో కైలాసగిరి ప్రాంతంలో ధనవంతుల కుటుంబంలో జన్మిస్తారు. వీరు మంచిమిత్రులు కలిగి వుంటారు.

# 25 వ కధ

శ్రీ గణేశాయనమః. భృగు మహర్షి ఈ జాతకం గురించి తెలియ జేయుచున్నది ఏమనగా ఈ జాతకులు బాల్యం మొదలు వృద్ధాప్యం వరకు అనారోగ్యం లేకుండా మంచి ఆరోగ్యం కలిగి వుంటారు. పరోపకారం చేయకలిగి వుంటారు. మంచిమాట కలిగి వుండి విద్యావంతులు మంత్ర తంత్రములందు ఆసక్తి కలిగి వుండి కవిత్వప్రియులై వుంటారు. రెండు విద్యలయందు ప్రవీణత కలిగి వుంటారు. వీరి జీవితమంతయు సుఖశాంతు లతో గడుస్తుంది.

వీరి జీవితంలో జరగబోవు ఫలితములను భృగువు ఈ విధముగా తెలియజేస్తున్నారు, బాల్య, యవ్వనావస్థలలో ఏర్పడే మూడు కష్టములు ఏర్పడతాయి. ఏ విధమయిన క్రియలచే ఈ కష్టములు శాంతించును అనగా మొదటి కష్టము నివారణకై సువర్ణదానం చేయవలెను. రెండవ కష్టం శాంతించుటకు గుమ్మడికాయలో బంగారం వుంచి దానం యివ్వవలెను.

మూడవ కష్టం నివారణకై నువ్వులను దానం యిచ్చి తగిన అన్నశాంతి చేయవలెను.

1 నుండి 8వ సంవత్సరంల మధ్యకాలంలో ఏర్పడిన ఫలితములు 1వ సం॥రంలో ఆసనపీడ, 2వ సంవత్సరంలో ఉదరసంబంధమయిన పీడ, ముఖమునకు సంబంధించిన రోగములు, మాతృకష్టమును కలుగును. 3వ సంవత్సరంలో తండ్రికి ధనలాభం, సోదరసోదరీ యోగం కలుగుతాయి. 5వ సంవత్సరంలో తండ్రికి ధనలాభం అక్కడనుండి విద్యాభివృద్ధి కలుగుతాయి. తరువాయి కాలంలో పూర్వవిద్యను వదలి ఉత్తమ విద్యాభ్యాసం చేయుదురు. స్నేహితులతో ఆటపాటలతో కాలం గడచును.

9 నుండి 12వ సంవత్సరం మధ్యకాలంలో గృహమందు శుభ కార్యములు, వాహనలాభం కలుగును. వస్త్రభూషణాదులు లభించును. ఆ తరువాయి 15వ సంవత్సరంలో విద్యాభివృద్ధి చక్కగా జరుగుతుంది. తల్లి తండ్రి అనారోగ్యముల బారిన పడుతారు. ఔషధసేవ, తగినశాంతులు చేయించుటవల్ల ఈ కష్టం నివారణ చెందుతుంది.

16 నుండి 22 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాకీర్తివృద్ధియు, ప్రభుత్వ వ్యవహారములయందు జయం, తగిన ఉద్యోగములో ప్రవేశించుట జరుగును. నూతన మిత్రుల పరిచయం అగును. 22 నుండి 30వ సంవత్సరంలలో వివాహం జరుగును. సంతానమునకు అల్పాయువుగాని, గర్భస్రావ దోషం కలుగును. గర్భరక్షణ కొరకై ప్రయత్న పూర్వకంగా పంచమాధిపతిని పూజించవలయును. ఉద్యోగం అనుసరించి అనేక ప్రయాణములు చేయుదురు. పుత్రజన్మం జరుగును. గృహనిర్మాణం, వివాహాది శుభకార్యముల వల్ల తండ్రి ధనం వ్యయం అవుతుంది.

31 నుండి 40 సంవత్సరముల మధ్యకాలంలో నూతన వాహన, వస్త్ర భూషణాది లాభములు కలుగును. దినదినాభివృద్ధిగా ధనలాభం కలుగును. ఉద్యోగమందు గౌరవం లభించును. వాతాధిక్యం వల్ల స్వల్ప అనారోగ్యం కలుగుతుంది. దాన జపాదుల వలన ఈ కష్టం శాంతిస్తుంది.

41 నుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో పుత్ర, పుత్రికా వర్గమునకు అనేక శుభములు జరుగును. అనేక విధములుగా ధనం ఖర్చు చేస్తారు. నూతన వాహన లాభం కలుగును. శరీరమందు జ్వరము వంటి అనారోగ్యములు కలిగి పీడించబడుదురు. ఔషధసేవ వలన ఈ కష్టం శాంతిస్తుంది.

51 నుండి 60 ఆ తరువాయి 70 సంవత్సరముల మధ్యకాలంలో సంతానమునకు వివాహాది శుభకార్యములు చేయుదురు. పుత్రపౌత్రులతో, దాసదాసీ జనులయొక్క సౌఖ్యం పొందుతారు. కఫ సంబంధమయిన పీడ కలిగి దేహకంపం జరుగును. ఔషధసేవకై ధనవ్యయం చేయుదురు. మిత్రుల, కళత్ర సంబంధ విచారం కలుగును.

ఆ తదనంతర కాలంలో కార్తీకమాసంలో బహుళపక్షంలో త్రయోదశి గురువారం రోజున అశ్వని నక్షత్రమునందు చంద్రుడు వుండగా, ఒక నదీతీరమందు దేహత్యాగం చేస్తారు.

శుక్రుడు చెప్పుచున్నాడు. ఈ జీవుడు ఏ దేశములో తిరిగి జన్మించును అని అడుగగా భృగువు చెప్పుచున్నాడు, ఉత్తరదేశమందు, ఊరి పేరులో వ అనే అక్షరం మొదటిగా వుండును. ఆ ప్రదేశంలో ఆస్తిపర కుటుంబంలో ఈ జాతకుడు తిరిగి జన్మించును. పూర్వజన్మలో చేసిన పుణ్యకార్యముల వల్ల మంచి విద్యాభివృద్ధి కలిగియుండి, అందరికి బాగా కావలసినవాడై పెద్దల యెడ గౌరవం కలిగియుండును.

# 26వ కధ

భృగు మహర్షి ఈ జాతకుని జాతక ఫలితములు ఈ విధంగా తెలియజేసారు.

ఈ జాతకులు భాగ్యవంతులు, మంచిపేరు కలిగి వుంటారు. మంచి జ్ఞానము కలిగి వుండి, పరోపకారి అనే పేరు కలిగి వుంటారు. వీరుమంచి ఓర్పు కలిగి వుంటారు. విద్యావినయ సంపన్నులు, మంచి ఉన్నతమయిన ఆలోచనలు కలిగి వుంటారు. దీనులయందు దయ కలిగి వుంటారు.

ఒకానొక సమయమందు పర పురుష / స్త్రీ ప్రీతి కలిగి వుంటారు పర్యటనములు చేయుట అంటే ప్రీతి కలిగి వుంటారు. అనేక దుర్జనులతో, సజ్జనులతోను, కలసి వున్ననూ మంచి బుద్ధి కలిగి వుంటారు. కొంతకాల మయిన పిమ్మట ఒక శత్రువును కలిగి వుంటారు. ఉద్యోగ సంబంధ మయిన చిక్కులు ఏర్పడును. అయితే దైవానుగ్రహం వలన శత్రునాశనం జరుగును.

వీరి జీవితకాలంలో బాల్యమునందు, యవనమందు, ప్రౌఢి వయస్సునందు చిన్నచిన్న కష్టములు కలిగి వుంటారు. తగిన దాన శాంతులు ద్వారా ఈ కష్టములు నివారణయగును.

1వ సంవత్సరం నుండి 8వ సంవత్సరం మధ్యకాలంలో 1వ సంవత్సరం జ్వరపీడయు, 2వ సంవత్సరంలో నేత్ర, ముఖపీడ, 3వ సంవత్సరంలో ఆసన పీడయు కలుగుతాయి. 4వ సం॥లో తండ్రికి ధనలాభం కలుగును. జాతకునకు స్వల్ప కష్టము కలుగును. విద్యారంభమగును.

5 నుండి 8వ సంవత్సరం మధ్యకాలంలో విద్యాభివృద్ధి, తండ్రికి వాహనాది సౌఖ్యం, ధన వృద్ధి కలుగును. ఈ కాలమంతయు విద్యార్జనలోను, ఆటపాటలలోను కాలమంతయు గడుస్తుంది.

9 నుండి 14 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభ కార్యములు జరుగును. విద్యాభివృద్ధి కలిగి వుండి బహూమానములు పొందుదురు. క్రీడలయందు ఆసక్తితో పాల్గొనుదురు. 15 నుండి 23వ సంవత్సరముల మధ్యకాలంలో జాతకుని తండ్రికి అధికమయిన లాభములు కలుగుతాయి. జాతకునకు విద్య పూర్తవుతుంది. రెండు విధములయిన యోగములవలన ఆనందముతో కూడి వుంటారు. మంచి ఉద్యోగము కలిగి ఉందురు. అనేక వ్యవహారములలో నేర్పు కలిగి వుంటారు. ఇదే సమయంలో స్వల్ప అనారోగ్యం ఏర్పడును. ఔషధ శాంతి వలన ఈ అనారోగ్యం నివారణ పొందును.

24 నుండి 32 సంవత్సరంల కాలంలో ఉద్యోగమందు గౌరవం, తద్వారా ధనలాభం కలుగుతాయి. వివాహాది శుభకార్యములు, కళత్ర సౌఖ్యం ఏర్పడును. సంతాన లాభం కలుగును. గృహమందు అనేక శుభములు కలుగును. ఒక మిత్రునితో శత్రుత్వం ఏర్పడుట వలన విచారము కలుగును. కొంతకాలం తరువాత ఈ విచారం తొలగిపోతుంది.

33 నుండి 39 సంవత్సరముల మధ్యకాలంలో అన్ని వ్యవహారము లందు జయం కలుగుతుంది. ధన విషయమై దినదినాభివృద్ధిగా వుండును. ఇతర ప్రదేశములు వెళ్ళుట వలన ధనధాన్యాభి వృద్ధి కలుగును. సంతానం కోసం విశేషంగా ధనం ఖర్చు చేస్తారు. మనస్సుకు తృప్తికరముగా అను కొన్న పనులు జరుగుతాయి. నూతన గృహ లాభం, ధనలాభం కలుగును దినదినాభివృద్ధిగా కీర్తిని పొందుతారు.

40 నుండి 47 సంవత్సరంల మధ్య కాలంలో ఉద్యోగ విషయంలో దినదినాభివృద్ధిగా వుంటుంది. పుత్రసంబంధమయిన కష్టం కలుగుతుంది. తగిన దాన జపాదుల వలన ఈ కష్టములు తొలగుతాయి, ఈ పుత్ర కష్టం వలన మనో విచారం కలుగుతుంది.

48నుండి 55 సంవత్సరం మధ్యకాలంలో ధర్మమార్గముగా ధన వ్యయం, భూలాభం, లోకమాన్యత కలుగును. ప్రజోపయోగ నిర్మాణము లకై ధనవ్యయం చేస్తారు. ఇదే కాలంలో కొంత అనారోగ్యం ఏర్పడు తుంది. ఔషధసేవ వలన దానముల వలన రోగనాశనం కలిగి పునర్జన్మముగా వుండును. పిమ్మట ధనలాభం కలుగును.

56 నుండి 63 వ సంవత్సరము పర్యంతము ధనలాభం. సంఘ ములో గౌరవం కలుగుతుంది. పుత్ర పౌత్రసుఖం కలుగును. తీర్థ యాత్రలు చేస్తారు. ధర్మ మార్గములో ధనం ఖర్చు చేస్తారు.మంచి కీర్తి కలిగి వుంటారు.

64 నుండి 69 సంవత్సరముల మధ్యకాలంలో కఫాధిక్యము వలన అనారోగ్యం, కళత్రి వియోగం వల్ల విచారం కలుగుతుంది. ఆ తరువాయి కాలంలో జ్యేష్ట శుద్ధ త్రయోదశి గురువారు రోజు స్వాతి నక్షత్రం చంద్రుడు వుండగా స్వగృహమందు నిధనం కలుగుతుంది.

వీరు మరుసటి జన్మంలో శ్రోత్రియ కుటుంబంలో జన్మించి నానా శాస్త్ర సంబంధమగు శాస్త్రములందు ప్రవీణత కలిగి వుంటారు.

# 27వ కథ

శ్రీగణేశాయనమః ఈ జాతకులు మంచి సంప్రదాయం, జ్ఞానులు గల కుటుంబంనందు అతిజ్ఞానులై జన్మించెదరు. తల్లితండ్రులు, తాత ముత్తాతలు మంచి ఆస్తికలిగి వుండి ధర్మపరివర్తన కలిగి ఉంటారు. ఈ జాతకులు అనేక కార్యములందు నేర్పరులై వుంటారు. అనేకమంది మిత్రులు కలిగి ఉంటారు. వ్యవసాయం చేయుదురు. ఏత్తైన శరీరం స్వల్ప శిరోజములు కలిగి ఉంటారు. తల్లితండ్రుల యెడల, గురువుల

యందు గౌరవం కలిగి వుంటారు. సభలలో మాట్లాడే నేర్పు కలిగి వుంటారు. సమస్త విషయపరిజ్ఞానం, సంతోషం తృప్తిని కలిగి వుంటారు బాల్యంనందు యవ్వనంలోను స్వల్పకష్టములు కలిగివుంటారు. అయితే జప, దాన, హోమాదులవల్ల ఈ కష్టములు నివారణ చెందును.

1 నుండి 7 సంవత్సరముల మధ్యకాలంలో నేత్ర ఉదర పీడలు కలుగును. దినదిన ప్రవర్ధమానముగా తండ్రికి ధనలాభం కలుగును. విద్యారంభం అగును. బంధుజనులందరిచే కీర్తించబడుదురు. సోదర సోదరీ జననంచే తల్లికి కొంచెం అనారోగ్యమేర్పడును. అయితే త్వరలోనే ఈ కష్టము తొలగును. ఆ తరువాత ఇంటియందు సౌకర్యములు, ధనధాన్య సమృద్ధి కలుగును.

8 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి జరుగుతుంది. ప్రభుత్వ పారితోషికములును పొందుదురు. మూడురకాలయినవిద్యల యందు ప్రవీణులగుదురు. మంచిగౌరవం పొందుతారు. నూతన వస్త్రలాభం, భూషణ వాహనాది లాభములు పొందుతారు.

17 నుండి 20 సంవత్సరమువరకు తరువాత 24వ సంవత్సర వరకు ఫలితములను పరిశీలించినచో ఈ కాలమందు విద్యాభ్యాసంపూర్తయి సాంఘిక, సంక్షేమ కార్యక్రమాలలో పాల్గొనుదురు. అనేక విధములుగా ధనలాభం కలుగుతుంది. గృహనిర్మాణమునకై అధికముగా ధనం వ్యయం చేస్తారు. వివాహం జరుగుతుంది. సర్వలక్షణ సంపన్నమయిన కళత్ర లభిస్తుంది. విహారయాత్రలు చేస్తారు. ఆ తరువాత కాలంలో అనేక సుఖ భాగ్యములు పొందుతారు. భార్యకు గర్భస్రావదోషం కలుగుతుంది. లేదా అల్పజీవనం గల సంతానం కలుగును. సంతానగోపాల మంత్రమును యధావిధిగా పూజించిన, పిమ్మట హోమజప దానాదులవల్ల యధావిధిగా సంతాన సౌఖ్యం కలుగును.

25నుండి 30 సంవత్సరముల మధ్యకాలంలో అటుపిమ్మట 34 సంవత్సరం వరకు ఈ క్రింద తెలియజేయబడిన ఫలితములు తప్పక జరుగును. దీర్ఘకాలంగా ప్రభుత్వంతో జరుగుతున్న వ్యవహారములు ఒక కొలిక్కి వచ్చి కృషిమూలకముగా ధనలాభం కలుగును. సర్వసౌఖ్యములు పొందుదురు. శత్రుత్వంవల్ల మానసిక చింత ఏర్పడుతుంది. ఇతరరకములుగాకూడా విశేష ధనలాభం కలుగుతుంది. గృహమందు శుభకార్యములు జరుగుతాయి. పిమ్మట కళత్రమునకు అనారోగ్యంకలిగి ఔషధసేవ వలన శాంతిస్తుంది.

36నుండి 42 సంవత్సరముల మధ్యకాలంలో అధికమైన ధనలాభం వస్త్రభూషణాదులు, వాహన లాభం కలుగుతుంది. సంతానమునకు శుభ కార్యములు చేస్తారు. ఇదే సమయంలో విశేషమయిన పేరు పొందుతారు. ఇదే సమయంలో ఒకచిన్న కష్టం కలుగును. అయితే మంత్రజపాదులవల్ల ఈ కష్టం శాంతిస్తుంది.

43నుండి 50వ సంవత్సరములలో రాజకార్యము మీదుగా అన్యదేశ ప్రయాణం తప్పక కలుగును. అనేక నూతన ప్రదేశములందు విహరించుదురు. తీర్థయాత్రలు చేస్తారు. ధనాన్ని విశేషంగా సంపాదిస్తారు. అదే విధంగా ఖర్చుచేస్తారు. దీనివలన కీర్తి, గౌరవము కలుగును.

51నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో పుత్ర, పౌత్రాది సౌఖ్యం, జ్ఞానమార్గ సంచారం చేస్తారు. కళత్రకష్టం కలుగుతుంది. ఔషధములు, వ్రతదానములవల్ల ఈ కష్టం నివారించబడుతుంది.

61నుండి 70 సం॥ల కాలంలో అధికారములను, వ్యవహారములను సంతానమునకు విడచి తాము తప్పుకొందురు. పురాణాది కాలక్షేపములు చేస్తారు. వ్రతోపయోగ కట్టడములు నిర్ధారణచేస్తారు. ఆ తరువాతకాలంలో ఆరోగ్యకరమయిన యిబ్బందులు లేకుండా సునాయాసంగా మరణం పొందుతారు.

# 28 వ కథ

'భృగువాక్యము' అనుసరించి ఈ జాతకులు అధికమైన కోర్కెలు కలిగి వుంటారు. కుటుంబం అంటే ఎక్కువ ప్రేమ కలిగి వుంటారు. వీరి జీవితంలో అనేక సౌఖ్యాలు అనుభవిస్తారు. అయితే అంత్యమునందు కష్టం కలుగుతుంది. స్వల్ప సంతానం, ద్వికళత్రయోగం కలుగుతుంది. ధర్మమువలన సమస్త దోషములు తొలగుతాయి. గ్రహదోషములు, శత్రు భయము తొలగి జయం కలుగుతుంది. అన్ని విధములుగా ధర్మమును కాపాడవలెను. ఈవిధముగా చేయుటవలన దైవ కృపచే సర్వదుఃఖములు తొలగి సౌఖ్యం కలుగును.

ఈ జాతకులు సంగీత, నృత్యాదులయందు మంచి ప్రవేశం కలిగి వుంటారు. విలాసవంతమయిన జీవితం గడుపుతారు. ప్రభుత్వ మూలకంగా ధన సంపాదన చేయుదురు. 1 వ సంవత్సరంలో నేత్రపీడ, 2 సం॥రంలో ఉదరపీడ, 3 వ సం॥రంలో తల్లికి కొంచెం అనారోగ్యం సోదర లాభం కలుగుతుంది. తండ్రికి ధన ధాన్య వాహన లాభములు కలుగుతాయి.

4 నుండి 7 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభ కార్యములు జరుగుతాయి. విద్యారంభం చేస్తారు. తండ్రికి దేశాంతర కీర్తి, ధనలాభం కలుగుతాయి. తల్లికి అనారోగ్యం చేస్తుంది. అయితే, ఇది ఔషధ సేవవలన ఈ కష్టం తొలగుతుంది.

8 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో జాతకునకు క్రమముగా విద్యాభివృద్ధి జరుగుతుంది. తండ్రికి అనేక రకములైన లాభములు కలుగుతాయి. వివిధ విద్యలయందు విశేషమయిన నేర్పు కలుగుతుంది. నూతన వస్త్ర భూషణాది లాభం కలుగుతుంది. పాఠశాల యందు విశేష

మయిన కీర్తి కలిగి, బహుమానములు పొందుతారు. తండ్రికి అనారోగ్యం కలిగి తిరిగి లాభమును పొందుతారు.

17 నుండి 25 సంవత్సరం కాలంలో ఈ క్రింద తెలియజేయబోయే ఫలితములు ఏర్పడతాయి, విద్యాభ్యాసం పూర్తయి మంచి ఉద్యోగములో ప్రవేశిస్తారు. మంచి మిత్రులు ఏర్పడతారు. ధన సంపాదన దిన దినాభివృద్ధి చెందుతుంది. వివాహాది శుభకార్యములు జరుగుతాయి. మంచి కళత్రం సిద్ధించుటవలన రాత్రింబగళ్ళు నిమిషతుల్యంగా గడుస్తాయి. ఈ విధముగా ఈ కాలమంతయు సుఖసంతోషములతో గడుస్తుంది.

26 నుండి 32 సంవత్సరములలో ఉద్యోగ నిర్వహణలో ఇతర దేశ ప్రయాణములు తప్పక కలుగును. ఆ తరువాత వాహనాది సౌఖ్యం, ధనలాభం కలుగును. ఉద్యోగ నిర్వహణ విధులలో కొంతమందితో శత్రుత్వం ఏర్పడుటవలన భయం, విచారము కలుగును. స్వల్ప కష్టం కలుగుతాయి. అయితే తగిన హోమ జప దానములద్వారా ఈ కష్టం నివారణ అవుతుంది. ఆకస్మిక ధన లాభం కలుగుతుంది. వాహన సౌఖ్యములు పొందుతారు.

32 నుండి 40 సంవత్సరముల కాలంలో మంచిపేరు కలగజేసే పదవీలాభం పొందుతారు. గృహమందు శుభకార్యములు జరుగుతాయి. నూతన వ్యక్తుల పరిచయం, శుభకార్య మూలక ధనవ్యయం, అన్య వ్యక్తులపై ప్రీతి కలుగుతుంది. శత్రువులు మిత్రువులవుతారు. ఇదే సమయంలో మానసిక ఆందోళన కలుగుతుంది.

41 నుండి 50 సంవత్సరం కాలంలో ఉద్యోగం, వ్యాపారములవల్ల ధనలాభం కలుగుతుంది. రాజగౌరవం పొందుతారు. దినదినాభివృద్ధిగా

కీర్తి, గౌరవాలు ఏర్పడతాయి. శుభకార్యముల నిమిత్తం ధనం వ్యయం చేస్తారు.

51 నుండి 60 సంవత్సర మధ్యకాలంలో పుత్ర, పౌత్రాదుల వలన ఆనందం, ఒక ప్రాణివలన స్వల్పవిచారం కలుగుతాయి. దాన ధర్మాది కార్యములు, దైవకార్యములు, తీర్థయాత్రలు చేస్తారు. కఫవాత సంబంధ మయిన అనారోగ్యం కలిగి ఔషధసేవ వలన శాంతిస్తుంది.

61 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో సుఖ దుఃఖములు సమముగా వుంటాయి. ఈ విధముగా కాలం గడుపుతారు. 80 సంవత్స రములలో వైశాఖమాసమందు శుద్ధ ద్వాదశి గురువారం రోజున ఉత్తరా షాఢ నక్షత్రమందు చంద్రుడు ఉండగా స్వర్గలోకప్రాప్తి జరుగుతుంది.

# 29 వ క థ

ఈ జాతకుని జన్మ పత్రిక యందలి గ్రహములు శ్రేష్ఠమగు ఫలితములను చేకూర్చును. ఈ జాతకుడు రాజద్వారమునందు జయమును పొందును. కుటుంబం అంటే ఎక్కువ ప్రేమ కలిగి ఉంటారు. దేవతార్చ నల యందు ప్రీతి, దయ, మంచి పేరు కలిగి వుంటారు, ఎల్లప్పుడు నిజము చెప్పెదరు. విశాలమయిన నేత్రములు, వక్షస్థలము కలిగియుందురు. మంచి మనస్సు సర్వజన వశీకరణము కలిగి వుంటారు. జీవితమందలి ప్రథమ, ద్వితీయ, భాగములందు సౌఖ్యమును, అంత్యమునందు సాధుజన ప్రీతి, కఫాధిక్యమును కలిగి వుంటారు.

1 నుండి 8 వ సంవత్సరంలో జరుగు ఫలితములు 4వ సంవత్సరం నందు జ్వర భయం, శ్వాసకోశ సంబంధ వ్యాధులతో బాధపడతారు. 2వ సంవత్సరమందు ఉదర సంబంధమయిన పీడ, మూడవ సంవత్స

రంలో ఆసన సంబంధమయిన పీడ కలుగును. పిమ్మట సోదర/సోదరీ యోగం కలుగును. పితృప్రీతి కలుగుతుంది, తల్లికి అనారోగ్యం కలుగును 4వ సంవత్సరం నుండి పితృ లాభం కలుగును. విద్యారంభం అవుతుంది., ఆటపాటలతో గడుపుతారు. నెమ్మది నెమ్మదిగా చదువుతారు.

9 నుండి 15వ సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి గృహమందు శుభ కార్యములు జరుగుతాయి. తండ్రికి మంచి ధనలాభం కలుగుతుంది. జాతకునికి వాహనలాభం కలుగుతుంది. అయితే ఎత్తైన ప్రదేశములనుండి పడుట, వాహనములనుండి పడుటవంటి ఆకస్మిక ప్రమాదములు జరుగును. ఆట పాటలయందు మంచి నేర్పు కలిగి యుందురు.

16-25 సంవత్సరముల మధ్య కాలంలో విద్యార్జన పూర్తయి ఉద్యోగమునందు ప్రవేశిస్తారు. మొదట చిన్న చిన్న ఉద్యోగములు చేయుచు తదనంతర కాలంలో అభిష్టం అనుసరించి మంచి ఉద్యోగములో ప్రవేశిస్తారు, తండ్రికి ధనలాభం, ధనవ్యయం కూడా కలుగును. రాజ మూలక ధనలాభం కలుగుతుంది. విహారయాత్రలు చేస్తారు. ఈ కాల మందు అనేకమంది మిత్రులు పరిచయం ఏర్పడుతుంది. వివాహం జరుగుతుంది.

25 నుండి 30 సంవత్సరముల కాలంలో కళత్రప్రీతితో సంతోషంగా నుండు కాలం. ప్రథమసంతతికి నష్టము కలిగి పిమ్మట కలిగిన సంతానం సుఖముగా వుండును. కళత్రమునకు అనారోగ్య మేర్పడుట వలన మానసిక అశాంతి ఏర్పడుతుంది. కీర్తి వృద్ధియు ఉద్యోగాభి వృద్ధియు తప్పక కలుగుతాయి. మాతా పితృ సంబంధమయిన విచారం కలుగుతుంది.

34 నుండి 40 సంవత్సరంలలో దినదినాభివృద్ధిగా వుంటుంది.

ప్రభుత్వ వ్యవహారములలో నేర్పు కలిగి వుంటారు. కుటుంబమునందు వివాహాది శుభకార్యముల వల్ల తప్పక ధనవ్యయం అవుతుంది. భూలాభము, ధనవృద్ధియు జరుగును. ఎదుట మంచి వానివలె మాట్లాడుతూ పరోక్షంలో మన గురించి చెడు ప్రచారము చేయు వారి వల్ల అనేక మందితో శత్రుత్వం ఏర్పడుతుంది. మధురంగా మాట్లాడే నేర్పుగల వ్యక్తుల పరిచయం అయి, వారితోడిదే లోకంగా రేయింబవళ్ళు ధ్యానిస్తారు. ఈ కారణం చేత స్వల్ప అనారోగ్య మేర్పడుతుంది.

41 నుండి 50 సంవత్సరం కాలంలో మంచి పేరు పొందుతారు. దినదినాభివృద్ధిగా వున్ననూ ఆకస్మికముగా అసౌఖ్యము కలుగును. అయితే తగిన జపములు, శాంతులు చేయించి అన్నదానము చేయించుట ద్వారా ఈ అసౌఖ్యం తొలగును.

51 నుండి 59 సంవత్సరములలో మంచికీర్తి, లాభము, భూలాభం తప్పక కలుగును. పుత్రి పుత్రికా వర్గమునకు వివాహాది శుభ కార్యముల నిమిత్తం ధనం వ్యయం చేస్తారు. భగవంతుని కై జపతపములకై కూడా విశేషంగా ధనవ్యయం చేస్తారు. స్నేహితులతోను; బంధువుల తోను తీర్థ యాత్రలు చేయుదురు.

61 నుండి 69 సంవత్సరంలలో వాతము వలన కఫాధిక్యము వలన బాధపడుదురు. కుటుంబంలో పుత్రపౌత్రులతో కాలం గడుపుతారు. ఆ తదనంతర కాలంలో భక్తితో గడుపుతూ చైత్ర బహుళ అష్టమీ శుక్రవారం రోజున నిర్యాణం చెందుతారు.

శుక్రవచనం : ఏ దేశములో పునర్జన్మ కలుగునో చెప్పమని కోరగా భృగువచనం : మంచి ఉన్నత కుటుంబంలో 'కా' అనే పేరుగల ఊరునందు జన్మించి వివిధ భోగములతోను, భాగ్యములతోను, దాసదాసీ జనముతోను సేవింపబడుతు ధర్మవర్తనుడై శివభక్తిని కలిగి వుంటాడు.

# 30 వ కథ

శ్రీ గణేశాయనమః భృగుపు చెప్పిన దేమనగా యథాశాస్త్రి నియమానుసారముగా ఈ జాతకుని యొక్క శుభాశుభ ఫలితములు వివరింపుచున్నాను. ఈ జాతకులు భాగ్యము, పరాక్రమము, సత్సంతానము కలిగి వుంటారు. కాముకులు, అధికమయిన కోర్కెలు కలవారు. వీరి జీవితంలో ఆదియందు సంపూర్ణ సౌఖ్యమును, మధ్యవయస్సునందు మధ్యమసౌఖ్యమును, అంత్యమునందు కఫ సంబంధమయిన శరీర కష్టమును కలుగును. వీరికి వివాహేతర సంబంధాలు వుంటాయి. స్వల్ప సంతానం కలిగి వుంటారు. తగిన హోమజపాదులు చేయించుటవల్ల సంతానమూలకంగా ఏర్పడే విపత్తులు తొలిగి సర్వసుఖములు లభించును.

1వ సంవత్సరములో జ్వరభయమును, 2వ సంవత్సరమందు విషూచికాది భయమును, 3వ సంగరమందు సోదరప్రాప్తియు, 4వ సంగర మందు తల్లికి అనారోగ్యం చేస్తుంది. లేదా జాతకుడు ఉన్నత ప్రదేశముల నుండి పడుట, విద్యారంభం, తండ్రికి ధనలాభం తప్పక కలుగును. గృహమందు అనేక శుభకార్యములు జరుగును. తల్లి ప్రసూతికారోగము వలన బాధపడును. దేవీ పూజను చేయించి, దానములు చేయించుట వలన ఈ కష్టములు తొలగును.

6 నుండి 12 సంగరంల కాలంలో దినదినాభివృద్ధిగా తండ్రికి కీర్తియు, ధనలాభం కలుగును. వాహన సౌఖ్యం, వస్త్రలాభం కలుగును. చదువు దినదినాభివృద్ధిగా వుండును. ఈ సమయంలోనే తండ్రికి అనారోగ్యం కలుగును. ఆటుపోటులతో ఈ కాలం నడుస్తుంది.

12 మొదలు 25 సంవత్సరంల కాలంలో గృహమందు శుభకార్యములు జరుగును. విద్యాభివృద్ధి జరుగుతుంది. గణితశాస్త్రమందు విశేష ప్రీతికలిగి, అనేక పరీక్షలయందు కృతార్థులగుటచేత కీర్తివృద్ధి కలుగును

ఈ కాలంనందే విద్యసంపూర్ణంగా పూర్తిఅగును. ఇదే సమయంలో రెండు రకములయిన యోగములు కలుగును. ధనలాభం కలుగును. ఉద్యోగమందు ప్రవేశించెదరు. స్వకులం వారితో శత్రుత్వం ఏర్పడుతుంది. మంచిమాట, అందమైన రూపలావణ్యం కలిగిన స్త్రీ ప్రీతి కలుగును. ఎందుకు ఇటువంటి ప్రీతి కలిగినదని భృగువును కోరగా పూర్వజన్మం సందు ఈ స్త్రీ భార్యయై వుండెను. కర్మవిపాకముచేత ఇట్టి ప్రీతిని కలిగెను. ఇదే సమయంలో వివాహం జరుగును. కళత్రసౌఖ్యం పొందుదురు. ఉదరరోగమువలన కళత్రమునకు అనారోగ్యం కలుగును. పుత్రికా సంతానం కలుగును.

26 నుండి 40 సంవత్సరముల కాలంలో పుత్రలాభం, మాతృ విచారం కలుగుతాయి. ప్రభుత్వోద్యోగం చేస్తారు. భూధన లాభం వుంటుంది. సంతానం కొరకు ధనవ్యయం చేస్తారు. ఆ తరువాత కాలంలో గృహనిర్మాణమై విశేషమయిన ధనవ్యయం చేస్తారు. అనేక సుఖములు అనుభవిస్తారు. అంత్యములో గృహములో ఒక వృద్ధ మృత్యువువల్ల బంధుజన సమాగమం కలుగుతుంది.

46 నుండి 55 సంవత్సరముల కాలంలో దినదినాభివృద్ధిగా అధిక సౌఖ్యం కలుగుతుంది. గృహమందు అనేక శుభకార్యములు జరుగుతాయి. సర్వసంపదలు, అనేక విధములుగా ధనలాభం, భూషణ వస్త్రలాభం కలుగుతాయి. ఇక ఇతరమయిన పెద్ద యిబ్బందులు లేకుండా ఈ జీవితం కాలం సుఖంగా గడుస్తుంది. సంతానమునకు వివాహాది శుభకార్యములు చేస్తారు. సంఘములో విశేషమయిన కీర్తి సంపాదిస్తారు.

56 నుండి తదనంతరకాలంలో కుటుంబంతో సుఖంగా కాలం గడుస్తుంది. తీర్థయాత్రలు చేస్తూ, పురాణాది కాలక్షేపంచేస్తూ 80 సంవత్సరములు ఆయుర్దాయం గలిగి వైశాఖమాసమందు బహుళపక్షములో చతుర్థశి ఆదివారం రోజున స్వర్గలోకం పొందుతారు.

# 31 వ కథ

శ్రీ గణేశాయనమః భృగుమహర్షి ఈ జాతకునియొక్క రూపలక్షణ ఫలితములను వివరించుచున్నారు. ఈ జాతకులు ప్రజ్ఞావంతులు, ఐశ్వర్య వంతులు, వివేకజ్ఞానము కలిగినవారు, కళాభిమానులు, అందరికిప్రియులు. ధర్మకార్యములు చేయువారు. పితృభక్తికలిగి ఉంటారు. భోజనప్రియులు. సర్వకార్యములు చేయుటయందు నేర్పుకలిగి ఉంటారు. భూమూలకముగా ధనలాభము కలిగివుంటారు. వీరు కాంతానులాకార్యానుసారం నడుస్తారు.

ఒకటవ సంవత్సరమందు నేత్రసంబంధమయిన పీడ, రెండవ సంవత్సరమందు దంతపీడ, మూడవ సంవత్సరమందు దంతపీడయు సోదర సోదరీ భావము తల్లి తండ్రులకు అనారోగ్యం కలుగును. నాల్గవ సంవత్సర మందు విద్యారంభమగును. ఆ తరువాయి కాలంలో 25 సంవత్సరముల వరకు విద్యార్జనలో కాలం గడుస్తుంది.

9 నుండి 15వ సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి ధనలాభం, విద్యాభివృద్ధి కారణంగా పారితోషికములు లభించును. మూడురకముల విద్యలు నేర్చుకొంటారు. రెండువిద్యలు సంపూర్ణముగాను, ఒక విద్య మధ్యమముగాను కృషిచేస్తారు. దేశీయ విద్యలందు ప్రావీణ్యత కలిగి యుందురు.

16నుండి 22సంవత్సరముల మధ్యకాలంలో భూలాభము, ధన లాభము, కలుగుతుంది. విద్యార్జన చేస్తారు. ఈ కాలమంతయు సాధారణంగా కాలం గడుస్తుంది.

23నుండి 30 సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జన పూర్తగును ఉద్యోగప్రాప్తి అవుతుంది. రెండువిధములగు రోగములు, పత్నీప్రీతియు కలుగుతుంది. గృహమందు చిత్రవిచిత్రములగు అలంకారములు చేస్తారు

ఆకస్మికము, ధాతుక్షీణము, సంభోగశక్తి తగ్గుతుంది. ఇందువల్ల అసంతృప్తిని, సిగ్గును పొందుదురు. తగిన ఔషధసేవవలన ఈ కష్టముతీరును. పుత్రయోగము కలుగుతుంది. గర్భస్రావము కలుగుతుంది, ఉత్తమపదవీ యోగం పడుతుంది, సహాధ్యాయులు ఒకరితో శత్రుత్వం కలుగుతుంది. తదనంతరకాలంలో శత్రునాశనం లేదా శత్రువులు మిత్రులుగా మారుదురు.

31 మొదలు 40 సంవత్సరముల మధ్యకాలంలో గృహంలో శుభ కార్యములు జరుగుతాయి. దినదినాభివృద్ధిగా లాభమును, అంత్యమున గృహమున వృద్ధమృత్యువు కలిగి అధిక ధన వ్యయం వుంటుంది. 41 మొదలు 49 సంవత్సరముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా గృహమందు లాభములు జరుగును. ఒకానొక ఘనకార్యమువల్లన కీర్తి కల్గుతుంది. అయితే ఔషధసేవవలన హోమ జపాదువలన ఈ కష్టం నివారించబడుతుంది.

50 మొదలు 60 సంవత్సరముల మధ్యకాలంలో జరిగే ఫలితాంశముల యొక్క స్వరూపము తెలియజేయుచున్నాను. భూలాభక ధనలాభము వాహన సౌఖ్యములు కలుగును. ధన ఆదాయం సంతృప్తికరంగా ఉన్నాను అనేకరకములుగా ధనవ్యయం అవుతుంది.

61నుండి 70 సంవత్సరములలో ధర్మమార్గంలో సంచరిస్తూ తీర్థయాత్రలు చేస్తారు. పుత్రపౌత్రాది వర్గమువారికి వివాహములు చేస్తారు. ఆ తరువాయి కాలంలో కార్తీకమాసంలో శుక్లపక్షంలో షష్ఠమరోజున పూర్వాషాఢ నక్షత్రములో ధనురాశియందు చంద్రుడుండగా దేహత్యాగం చేస్తారు.

# 32 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతకుని యొక్క జన్మపత్రిక శ్రేష్ఠ మయిన ఫలితములు కలుగజేయును. దీని ఫలితములు ఏమనగా మంచి పేరుగలవాడు, కుటుంబప్రీతి, మంచిబుద్ధియు, లోకఖ్యాతి, శాంతము మంచిమాట కల్గియుండును. సునాయాసముగా అన్ని పనులు నేర్చుకొను వాడగును. అనేక దేశములు తిరిగి వ్యవహారములను నేర్చుకొనువాడ గును. ఎక్కువగా ప్రయాణములు చేయును. కళత్ర సౌఖ్యం చక్కగా పొందును. జాతకుడు వ్యవసాయం చేయుటయందు నేర్పుకలిగి ఉంటారు.

ఒకటవ సంవత్సరమందు తాపజ్వరమును, రెండవ సంవత్సర మందు ముఖసంబంధ వ్యాధులు, మూడవయేట గ్రహణవ్యాధియు, పిమ్మట మాతృపీడయు పొందుతారు. తండ్రికి ఆకస్మిక ధనలాభము కలు గును. నాలుగవ సంవత్సరమందు వ్రణపీడయు, విద్యారంభం కలుగు తుంది. 5-8 సంవత్సరమందు విద్యార్జన, గురుప్రీతి కలుగుతుంది. ఆ తరువాత అల్పకష్టం ఏర్పడుతుంది. మాతాపితృ సౌఖ్యం తగ్గియుంటుంది.

8-16 సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జనలో కాలం గడు స్తుంది. పరీక్షలయందు జయం కలుగుతుంది. విద్యా పారితోషికములు పొందుతారు.

17-25 సంవత్సరముల కాలంలో విద్యార్జన పూర్తయి ఉద్యోగ లాభం కలుగుతుంది. సంతోష కార్యక్రమములలో పాల్గొంటారు. రెండు రకములయిన యోగములు పొందుతారు. వివాహం జరుగుతుంది. ఉద్యోగ వ్యవహారములలో ఉన్నతాధికారుల మెప్పు పొందుతారు.

26నుండి 34 సంవత్సరముల మధ్యకాలంలో అనేక విధములసౌఖ్యములు, అనేక విధములుగా ధనలాభం కలుగుతుంది. ఒక వ్యవహారములో మానసిక చింత కలుగుతుంది. పదోన్నతి పొందుతారు. ఒకానొక కార్యము నకై రాజమూలకముగా ఏర్పడి తూర్పుదిశ ప్రయాణము చేయుదురు. దీని వలన ధనలాభము అధికార గౌరవము కలుగుతుంది.

35 నుండి 42 సంవత్సరముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా సౌఖ్యమును, గృహమందు అనేక శుభకార్యములు జరుగుతాయి. వాహన లాభము, నూత్నభూషణాది లాభములు కలుగుతాయి. అయితే ఉద్యోగ వ్యవహారములలో ఒకానొక శత్రుత్వ మేర్పడి, శత్రువు వ్యతిరేకముగా మాట్లాడుచుండును. కొంతకాలం తర్వాత పశ్చాత్తాపము కలిగి మిత్రుడగును.

43 నుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో అధికమగు కీర్తియు, భూలాభమును, గృహము వెలుదలగు వానిని, వాహన సౌఖ్యము పొందగలరు.

50 నుండి 58 సంవత్సరముల పర్యంతము ధనధాన్య లాభము కలుగుతుంది. అంత్యమున పుత్రుని ఆరోగ్యం కొంత చెడుతుంది. దీనికి నిపుణులైన వైద్యులకు చూపించెదరు. అయితే అన్యదేశ ఔషధ సేవవలన గాని, దానధర్మాది పుణ్యకార్యముల వలన శాంతించును.

59 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో సర్వసంపదలు పొందుతారు. అనేక తీర్థయాత్రలు చేస్తారు. పుణ్యకార్యములు చేస్తారు. శుద్ధపాడ్యమి సోమవారము రోజున రేవతి నక్షత్రమందు చంద్రుడు ఉండగా నిర్యాణం కలుగుతుంది.

# 33 వ కథ

శ్రీ గణేశాయనమః. ఇట్టి శుభసంపత్తిగల జాతకమునందు శుభ ఫలితములు కలుగును. వీరు వినయ విధేయతలు కలిగి ఉంటారు. భోగములు కలిగి వుందురు. వీరు బాల్యమునందు, మధ్యవయస్సులోను అల్ప కష్టములు కలుగుతాయి.

ఒకటి రెండు సంవత్సరములలో ముఖము, దంతసంబంధమయిన పీడ, ఆసన సంబంధమయిన పీడలు కలుగుతాయి. 3-4 సంవత్సరములలో సోదరయోగం, విద్యారంభం అవుతుంది. 5-7 సంవత్సరముల మధ్య కాలంలో ఎత్తైన ప్రదేశమునుండి పడుట జరుగుతుంది. తండ్రికి విశేష ధనలాభం కలుగుతుంది.

8-16 సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జనలో కాలం గడుస్తుంది. వాహన సౌఖ్యం కలుగుతుంది. క్రీడా కార్యక్రమములలో ఉత్సాహముతో పాల్గొంటారు.

17 నుండి 25 సంవత్సరముల కాలంలో విద్యార్జన పూర్తవుతుంది. సమస్త జనులతో అనుకూలత కలిగి వ్యవహారములందు జయం కలుగుతుంది. కీర్తివృద్ధి కలుగుతూ ఉచ్ఛస్థితిని పొందగలరు. వివాహం జరుగుతుంది. భూలాభంగాని గృహలాభంగాని కలుగుతుంది. పూర్వ కర్మానుసారం కొన్ని చెడు తలంపు కలుగుతుంది.

25 నుండి 35 సంవత్సరముల కాలంలో సంతానం కలుగుతుంది. ఉద్యోగమందు విశేషమయిన ఖ్యాతి లభిస్తుంది. 35 నుండి 42 సంవత్సరములలో దినదినాభివృద్ధిగా ఐశ్వర్యము, లాభములు కలుగుతాయి. కొంతమందితో శత్రుత్వం ఏర్పడుతుంది. తదనంతరకాలంలో ఈ శత్రువులు మిత్రులగుదురు.

42-52 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభకార్యములు జరుగును. మానసిక భయం ఏర్పడుతుంది. ప్రయాణమందు చోర భయంగాని, మృగముల వలన భయం ఏర్పడుతుంది. శుభకార్యముల కోసం ధనం ఖర్చుచేస్తారు.

53 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో ప్రజాపాలనం చేస్తారు. పుత్రునకు అనారోగ్యం ఏర్పడుటవలన మానసిక చింత ఏర్పడి చికిత్సార్థం ఇతర ప్రదేశములకు వెళ్ళవలసి వస్తుంది. జపదానములు, శాంతులు చేయించుటవల్ల ఔషధసేవానంతరం ఈ కష్టం నివారించబడుతుంది.

61 నుండి 70 సం॥ల మధ్యకాలంలో వాతశ్లేష్మ సంబంధమయిన అనారోగ్యముచే బాధపడుదురు. ఆ తరువాయి కాలంలో వైశాఖమాసమందు కృష్ణపక్షములో చవితి శుక్రవారంరోజున వృశ్చికరాశిలో చంద్రుడు ఉండగా నిర్యాణం కలుగుతుంది.

# 34 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జన్మ పత్రిక శుభగ్రహములతో కూడి ఉన్నది. జాతకులు విలాసవంతులు, సర్వభోగములు మంచి మాట కలవారు, పరోపకారములు చేయుటయందు ఆసక్తి కలవారు, అనేక విధమయిన సంపదలు కలవారుగా ఉంటారు. వీరు మూడు విధముల కష్టములు, బాల్య, యవ్వన మధ్య వయస్సులందు కలుగును. అంత్యావస్థయందు అధికమగు కష్టము కలుగుతుంది. ఉన్నతమయిన విద్య నభ్యసిస్తారు. గురుపూజాభక్తి కలిగి ఉండువారు, ప్రియముగా మాట్లాడువారు మంచి కీర్తిని కలిగి ఉంటారు.

1వ సంవత్సరమందు జ్వరమును, 2వ సంవత్సరమందు ఉదర

సంబంధమయిన వ్యాధులు, 3వ సంవత్సరమందు ఆసన సంబంధమయిన పీడలు, సోదరలాభము, తల్లికి అనారోగ్యం కలుగును. 4 నుండి 9 సంవత్సరంల మధ్యకాలంలో విద్యారంభం, తండ్రికి లాభము, విద్యార్జనలో ప్రతి సంవత్సరం పారితోషికములు పొందుతారు.

8 నుండి 16 సం॥లో దినదిన విద్యాభివృద్ధియు గృహమందు శుభ కార్యములు, సంపదాభివృద్ధి, వస్త్రలాభము, తల్లికి అనారోగ్యం కలుగుతుంది. ఔషధసేవ, జపదాన శాంతులవల్ల ఈ కష్టము నివారించబడుతుంది.

17 నుండి 25 సంవత్సరము మధ్యకాలంలో పితృలాభము, విద్యాభివృద్ధి, రాజద్వారము నుండి పారితోషికములు లభించును. వివాహయోగం, గృహమందు శుభకార్యములు జరుగును. శరీర దుర్బలత్వము వలన సంభోగశక్తి తగ్గును. తరువాత కాలంలో జాతకునకు అనారోగ్యము శాంతించును. ఇదే సమయంలో సంతానమునకు ఆరోగ్యము తగ్గి ఉండును. లేదా గర్భస్రావము కలుగును. సూర్యనారాయణ వ్రతము చేసినచో సర్వరోగములు తొలగి శరీరబలం కలుగును. బుద్ధిమంతులు, సుందరమగు సంతానం కలుగును.

26 నుండి 34 సంవత్సరములలో నానా సంపదలు అనేక విధములుగా సంపదలభివృద్ధి చెందుతాయి. వాహన లాభం కలుగుతుంది. గృహమందు అధిక ధనవ్యయం అవుతుంది. 35 నుండి 41 సంవత్సరముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా ఉంటుంది.

42 నుండి 50 సం॥లలో మహోత్సాహము, మహాలాభముకలుగును, అధికమయిన కీర్తి లభించును. రాజద్వారమందు శత్రుత్వ మేర్పడును. ఆ శత్రువు ప్రత్యక్షమున ఇష్టముగాను, పరోక్షమున విరోధముగాను మాట్లాడును. శత్రుసంబంధమయిన విచారమువలన శరీర అనారోగ్యము

కలుగును. ఆ తరువాయి కాలంలో కళత్ర సంబంధమయిన విచారము వలన బాధపడుదురు.

51 నుండి 60 సం॥ల కాలంలో పుత్ర పౌత్రాది సమస్త సుఖములు వివాహాది శుభకార్యములు జరుగుతాయి. 60 మొదలు 70 సంవత్సరముల కాలంలో అనేక విధములుగా లాభములు పొందుతూ సకుటుంబంతో కూడి ఉండగా దేహత్యాగము చేయుదురు.

# 35 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ పత్రిక యందలి శుభగ్రహములు, శుభ ములను, కీర్తి, గుణము, శుభకార్యాచరణులుగాను జాతకుని చేయును. ఒకానొక సమయమందు దైవనియోగమువలన చెడు స్వభావము కలుగును. అనేక విధములుగా కష్టము కలుగును. దానివలన చేసే పనులు పాడవు తాయి.

1వ సంవత్సరంలో నేత్రపీడ, 2వ సంవత్సరములో ముఖపీడయు 3వ సం॥లో జ్వరబాధయు, 4 నుండి 9 సంవత్సరముల మధ్యకాలంలో అగ్నిభయం, తండ్రికి కీర్తి కలుగుతుంది. విద్యారంభం, బంధుయోగం, తండ్రికి అనేక విధములుగా ధనలాభములు కలుగుతాయి. విద్యాభ్యాసం చక్కగా జరుగుతుంది. సోదర కష్టమువలన తల్లికి విచారమేర్పడు తుంది.

10 నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో ఎత్తైన చోట్లనుండి పడుటయు, ప్రయాణసంబంధమయిన పీడలు, అధిక ధనము, దిన దిన విద్యాభివృద్ధియు, పారితోషికములు తప్పక లభించును. వీరు అధికముగా ధన వ్యయం చేస్తారు. అనేకులతో విరోధము ఏర్పడతాయి. దుష్ట

జన సహవాసం ఏర్పడతాయి. ఇది ఏ విధముగా శాంతించును అని కోరగా మనస్సు స్థిరముగా ఉంచుకొంటే సర్వదోషములు నివారణ చెందుతాయి. విద్యార్జన పూర్తవుతుంది. వివాహం జరుగుతుంది. నానావిధ ధన లాభములు కలుగుతాయి. గృహమందు అనేక శుభ కార్యములు జరుగుతాయి.

26 నుండి 38 సంవత్సరములలో రాజద్వారమునందు జయమును దాసదాసిజన సేవయు, అనేక విధములయిన ధనలాభములు కలుగుతాయి. గౌరవ మర్యాదలు పొందుతారు. స్వల్ప అనారోగ్యము కలిగిననూ శీఘ్రముగా శాంతిస్తుంది. పుత్రోత్సాహం జరుగుతుంది.

39 నుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు అనేక శుభకార్యములు జరుగుతాయి. గృహనిర్మాణం చేస్తారు. ఉద్యోగములలో ఉన్నత స్థానం పొందుతారు.

51 నుండి 60 సం॥రంలలో అధిక ఉత్సాహం, ధన ధాన్యలాభం కలుగుతుంది. శుకార్యముల నిమిత్తం ధనవ్యయమును చేయుదురు. పుత్ర పుత్రికా వర్గమును వివాహాది శుభములు జరుగుతాయి. తీర్థయాత్రలు చేస్తారు.

61 నుండి 70 సం॥లలో వాతశ్లేష్మ సంబంధమయిన పీడలు కలుగుతాయి. గోదాన, భూదాన, అన్ని దానములు చేయుటవలన శీఘ్రముగా ఆరోగ్యం కలుగును.

71 నుండి 86 సం॥ మధ్యకాలంలో కుటుంబంతో కాలం గడుపుతూ 80 సం॥లో కైవల్యం పొందుతారు.

# 36 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహ సంపత్తి కలిగిన జాతకులు దీర్ఘాయువును కలిగి ఉంటారు. మంచి విద్య కలిగి ఉంటారు. విశాల వక్షస్థలము కలిగి సుందరముగా ఉందురు. విలువైన ఆభరణములు, వస్త్రములు ధరించుట యందు ఆసక్తి కలిగి ఉంటారు. మిత్రుల యెడ ప్రీతిని కలిగి ఉందురు.

వీరు ఒక మిత్రుని యెడల అధిక వాత్సల్యమును కలిగియుందురు. బాల్య, యవ్వన, మధ్య వయస్సులలో స్వల్పకష్టములు కలిగి ఉందురు.

1వ సం॥మందు జ్వరసంబంధమయిన పీడ, 2వ సం॥ర మందు ఉదరవ్యాధి, 3వ సంవత్సరమందు నేత్రపీడ, సోదర సోదరీలాభము కలుగుతుంది. 4 నుండి 8 సంవత్సరముల మధ్యకాలంలో విద్యారంభం, వ్రణ సంబంధమయిన పీడలు కలుగుతాయి. దినదినాభివృద్ధిగా విద్యాభ్యాసం కలుగుతుంది. గృహమందు శుభకార్యములు జరుగుతాయి. సోదర, సోదరీలాభము కలుగుతుంది.

8 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో జాతకునకు విద్యాభివృద్ధి, తండ్రికి ధనలాభము కలుగుతాయి. లాభవ్యయములు సమానముగా ఉంటాయి. వస్త్రభూషణాది లాభములు కలుగుతాయి. వ్యాయమ విద్యలందు ప్రీతిని కలిగి ఉంటారు. అనేక విధములుగా విద్యలాభం కలుగుతుంది.

17 నుండి 28 సం॥రముల మధ్యకాలంలో అనేక సౌఖ్యములు పొందుతారు. రాజద్వారమందు జయం కలుగుతుంది. విద్యార్జన పూర్తవుతుంది. ఉన్నతమయిన ఉద్యోగములో ప్రవేశిస్తారు. వివాహాది శుభకార్యములు జరుగుతాయి. అధికోత్సాహం కలుగుతుంది. కొంత మందితో శత్రుత్వం ఏర్పడుతుంది.

29 నుండి 40 సం॥రముల మధ్యకాలంలో సంతానయోగం, కళత్ర కష్టం కలుగుతాయి. ఔషదాదుల వలన ఈ కష్టము శాంతిస్తుంది. ఉద్యోగ రీత్యా ఇతర ప్రాంతములకు ప్రయాణం చేయుదురు. ఎల్లప్పుడు ప్రీతి కలిగించే మిత్రలాభము కలుగుతుంది.

40 నుండి 48 సం॥రముల మధ్యకాలంలో అనేక విధములుగా ధనలాభం కలుగుతుంది, భూమూలక ధనలాభం కలుగుతుంది. 49 నుండి 60 సం॥రముల కాలంలో అనేక విధములుగా సుఖదుఃఖములు పొందుదురు. ఆ తరువాయి కాలంలో శరీర దుర్బలత్వం కలుగుతుంది. జపదానములవల్ల ఈ కష్టం నివారించబడుతుంది.

61 నుండి 70 సం॥ముల పర్యంతము అధికమయిన కీర్తికలిగి, వాతాధిక్యము వలవ శ్వాసకాస సంబంధమయిన వ్యాధులచే బాధపడుదురు.

# 37 వ కథ

శ్రీ గణేశాయనమః ఇందలి శుభగ్రహములు యొక్క బలము వలన సమస్త సంపదలు, శుభలక్షణములను కలిగి యుందురు. కులశ్రేష్ఠులు శత్రువులను, మిత్రులను సరిసమానముగా కలిగి ఉంటారు. పరకార్యములందు ప్రీతిని కలిగియుందురు. సుందరమయిన ఆకారం కలిగి యుందురు. బాల్యయౌవన, వృద్ధాప్యములందు మూడు స్వల్పకష్టములు సంభవించును. వాతపైత్య సంబంధమయిన జ్వరబాధలు కలుగును.

1 నుండి 5 సంవత్సరముల మధ్యకాలంలో ఆననపీడ, ముఖపీడ, మాతృవిచారము కలుగును. ఉదర సంబంధ వ్యాధులు, పైత్యజ్వరము

కలిగి ఔషధ సేవ వలన నివారించబడుతుంది. తండ్రికి విశేషంగా యోగిస్తుంది. విద్యారంభం చేస్తారు.

6 నుండి 15 సంవత్సరముల మధ్యకాలంలో ఈ కాలమంతయు విద్యార్జనలో గడుస్తుంది. నీటి వలన స్వల్ప ఆరోగ్యమేర్పడుతుంది. ఔషధసేవవలన ఇది తగ్గుతుంది.

15 నుండి 25 సం॥రముల కాలంలో విద్యార్జన పూర్తవుతుంది. రాజకీయ పరీక్షలందు ఉత్తీర్ణులవుతారు. దినదినాభివృద్ధిగా ఉంటుంది. ఉద్యోగలాభం కలుగుతుంది. వివాహాది శుభకార్యములు జరుగుతాయి. జాతకునకు పుత్రయోగము కలుగును. తల్లితండ్రుల ఆరోగ్యంలో కొంత మార్పువస్తుంది.

26 నుండి 30 సంవత్సరముల కాలంలో ధనప్రాప్తి, ఉద్యోగ వ్యవహారములందు జయము. కొంతమందితో శత్రుత్వం ఏర్పడుతుంది. అనేకమయిన ఆలోచనలతో ఉంటారు.

31 నుండి 40 సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగవ్యవహారములలో ధనప్రాప్తి, గృహమందు శుభకార్యములు నిమిత్తము అధిక ధనవ్యయం చేస్తారు. దైవభక్తి పెరుగుతుంది.

41 నుండి 45 సంవత్సరములు ఆ తరువాయి 55 సంవత్సరముల వరకు, అన్ని రంగములందు విశేష అభివృద్ధి, కళత్రమూలమయిన విచారం కలుగుతుంది. సంతానం దినదినాభివృద్ధి చెందుతారు.

55 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో పుత్ర పౌత్రాదులతో ఆనందంగా కాలం గడుపుతారు. దైవారాధనలో కాలం గడుపుతారు.

68 సంవత్సరములు ఆయుర్దాయం కలిగి భాద్రపదశుద్ధ త్రయోదశీ దినమున నిర్యాణము కలుగును.

# 38వ కథ

శ్రీగణేశాయనమః ఇటువంటి గ్రహసంపత్తిగల జాతకులు శుభఫలితములను పొందుతారు. ప్రజ్ఞావంతులు కార్యాచరణమందు నేర్పుగలవారు, దేవతాసాధుజనప్రియులు. సభలయందు మాట్లాడగలిగే నేర్పుగలవారు, పరాక్రమవంతులుగా ఉందురు. సదయహృదయం కలిగి ఉందురు.

1వ సంవత్సరమందు నేత్రపీడ, 2వ సంవత్సరమందు జ్వర బాధలు, 3వ సంవత్సరమందు వ్రణపీడయు 4వ సంవత్సరమందు విద్యారంభం, 5వ సంవత్సరమందు పితృలాభము, భూమూలకముగా ధనరాబడిని కలిగియుందురు. తండ్రికి ఉద్యోగరీత్యా ఇతరదేశములకుపోయి, విశేషధనసంపాదన చేస్తారు.

6నుండి 15 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి, తరచు అనారోగ్యములతో బాధపడతారు. జపదానాదులవల్ల, ఔషధసేవవలన ఈ కష్టము శాంతించును. విద్యార్జనలో పారితోషికమును పొందుతారు. వస్త్ర, వాహన లాభములు కలుగును. గృహమందు శుభకార్యములు జరుగుతాయి.

16నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో మాతాపితృ సంబంధ విచారం కలుగుతుంది. విద్యార్జన పూర్తవుతుంది. ఉద్యోగలాభం కలుగుతుంది. కుటుంబ నిర్వహణకై అధికధనం వ్యయం చేస్తారు. వివాహాది శుభకార్యములు జరుగుతాయి, సంతాన యోగం కలుగుతుంది.

26 మొదలు 33 సంవత్సరముల మధ్యకాలంలో వ్యవహారజయం. నానావిధ సంపదలతో తులతూగుతారు. ఉద్యోగరీత్యా ప్రయాణములుచేయువారు ప్రయాణమూలకముగా ధనలాభం కలుగుతుంది. కళత్రానికి అనారోగ్యం కలుగుతుంది; ఔషధశాంతిచేస్తూ-దైవారాధనవల్ల ఈ కష్టము నివారించబడుతుంది.

34 నుండి 45 అ తరువాయి 55 సంవత్సరముల మధ్యకాలంలో అధికలాభము, అధికోత్సాహం, సభాగౌరవము, పుత్ర, పుత్రికావర్గంవారికి శుభకార్యములు చేస్తారు. ఉద్యోగరీత్యా విశేష ధనలాభం కలుగుతాయి.

56 నుండి 65 సంవత్సరముల మధ్యకాలంలో స్వకులమందు, అన్యకులమందుగాని శత్రుత్వం ఏర్పడుతుంది. అయితే త్వరతోనే ఈ కష్టము నివారించబడుతుంది.

వారు జీవితంలో ఉచ్చపదవి పొంది ఐశ్వర్యవంతులగుదురు. ఆక స్మిక ఉపద్రవమువల్ల భయచింతలు కలుగును. ఆ సమయమున ఔషధ సేవకూడా వృధా అగును.

# 39 వ కధ

శ్రీ గణేశాయనమః ఇట్టి శుభగ్రహ సంపత్తిగల జాతకులు సర్వ సంపదలతో తులతూగెదరు. దైవ గురుభక్తి కలిగియుందురు. ఉన్నత మయిన విద్యాభ్యాసము చేయుదురు. మంచికీర్తి కలిగియుందురు. బాల్య మధ్యావస్థలలో స్వల్పకష్టములు కలిగిననూ పూర్ణాయువును పొందెదరు. దైవారాధనవల్ల పీడకష్టములు నివారించబడును. ఇందువల్ల సర్వదా జయ మును పొందుదురు.

1వ సంవత్సరములో జ్వరభయమును, 2, 3 సంవత్సరములలో క్రియసంబంధ పీడలు, భాతృయోగం కలుగును. కృషిమూలకముగా తండ్రికి ధనలాభము, విద్యారంభము చేయుదురు. ఆ తరువాయి కాలంలో 23 సంవత్సరముల వరకు జరుగబోవు ఫలితములు: పిత్తాధిక్యమువలన జాతకునకు అనారోగ్యం కలుగును, దినదినాభివృద్ధిగా వాహనలాభం,

వస్త్రభూషణాదిలాభం కలుగును. గృహమందు శుభకార్యములు జరుగును. విద్యార్జన దినదినాభివృద్ధిగా ఉండగలదు. ఉన్నతమయిన విద్య నభ్యసించెదరు. చివరలో తన అభీష్టము ప్రకారము ఉన్నతమయిన ఉద్యోగలాభం కలుగును.

24నుండి 34 సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగంలో లాభం, వివాహాది శుభకార్యములు జరుగుతాయి. పుత్రసంతానం కలుగుతుంది. శత్రుభయమేర్పడుతుంది. ధనసంపాదన విశేషంగా ఉంటుంది.

33నుండి 45 సంవత్సరముల మధ్యకాలంలో అధికోత్సాహం కలుగును. వ్యవహార జయం కలుగును. శుభకార్యముల నిమిత్తం ధనవ్యయం చేయుదురు. వినోద విహారయాత్రలలో పాల్గొంటారు. అయితే పూర్వ జన్మ కర్మానుసారం తరచు అనారోగ్యంచేత బాధపడుదురు. దీనికి జప దానాదులుచేసి, ఔషధశాంతి చేయవలెను.

46నుండి 55 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రి ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. తీర్థయాత్రలు చేయుదురు. ధర్మకార్యములనిమిత్తం విశేష ధనవ్యయం చేస్తారు.

55నుండి 65 సంవత్సరముల మధ్యకాలంలో అధికలాభము, విశేష కీర్తియు కలుగును. పుత్ర పుత్రికావర్గమువారికి వివాహాది శుభకార్యములు చేస్తారు. పిమ్మట ఆదాయవ్యయములు సరిసమానముగా ఉండును.

ఒకానొక యోగి సమాగమము కలిగి ఆయనతో వేదాంతవిషయాలు చర్చించుదురు. ఆత్మవిజ్ఞాన శాస్త్రాభ్యాసం చేసెదరు.

విశేషంగా సుఖశాంతులతో జీవించి వైశాఖ శుక్ల అష్టమి ఆదివారము పుష్యమీనక్షత్రం అర్ధరాత్రి సమయంలో దేహము విడిచెదరు.

# 40 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతకమందు బలముతోకూడిన గ్రహములు కలవు. వీరు మంచి భూస్వాములుగా పేరుకలిగి ఉంటారు. అన్ని పను లందు నేర్పరులై ఉంటారు. విదేశములందు ప్రీతిని కలిగియుందురు. నానా విధ వాహన సౌఖ్యములు కలిగియుందురు. అనేకమంది మిత్రులను కలిగి యుందురు.

1వ సంవత్సరమందు జ్వరసంబంధ పీడలు, 2-3 సంవత్సరములలో మాతృపీడకలిగి ఔషధసేవ వలన శాంతించును. సోదరలాభము కలుగును గృహమందు శుభకార్యములు కలుగును. 4వ సంవత్సరంలో విద్యారంభం చేయుదురు. 5 సం॥రంలో ఎత్తైన చోటునుండి పడుట సంభవించును.

5 నుండి 12 సంవత్సరముల కాలంలో శుభఫలితములు జరుగును. తల్లికి అనారోగ్యము ఔషధసేవ వలన శాంతించును. రాజకార్యమూల కముగా తండ్రికి ప్రయాణము కలుగును.

13నుండి 20 సం॥ల పర్యంతము విద్యాభివృద్ధి, తగు పారితోషి కములు లభించును. తండ్రియొక్క ధనము శుభకార్యముల మూలకముగా వ్యయమగును.

21నుండి 25 సంవత్సరముల కాలంలో విద్యార్జన ఉద్యోగలాభం కలుగును. వివాహాది శుభకార్యములు జరుగును. తొలిసంతానం నష్టం కలు గును. ఆ తరువాయి 36 సం॥రం మధ్యకాలంలో పుత్రలాభము, మతాధి క్యము వలన అనారోగ్యములు ఔషధసేవవలన ఈ కష్టం నివారించబడు తుంది.

37నుండి 46 సంవత్సరముల మధ్యకాలంలో శుభకార్యముల

నిమిత్తం ధనవ్యయం చేస్తారు. వాహన సౌఖ్యంకలుగుతుంది. కృషిమూలక ధనలాభం కలుగుతుంది. ఇతరదేశ ప్రయాణములు చేస్తారు.

50 నుండి 60 సం॥ల పర్యంతము భూలాభము, ధనధాన్యాభివృద్ధి ప్రజాకార్యముల నిమిత్తం ధనవ్యయం చేస్తారు. ఈ కాలమంతయు సుఖముగా కాలం గడుస్తుంది.

60నుండి 70 సం॥రముల మధ్యకాలంలో సంతానమునకు వివాహాది శుభకార్యములు, దైవ, పుత్ర కార్యములతో నుందురు.

మృత్యుకాలమందు జాతకులు, శ్రేష్ఠమయిన రాజసమానమయిన భోగభాగ్యములు కలిగి ఉందురు.

# 41వ కథ

శ్రీ గణేశాయనమః సాధుజనాదరము, మంచికీర్తి, రాజమూలక ధనలాభము, మంచిమాటలు, అలవాట్లు పరకార్య నేర్పరిత్వము ఈజాతకులు కలిగి యుందురు. పెద్దవారికి సైతం కష్టం కలిగించని మనస్తత్వం కలిగి యుంటారు. కొన్ని వ్యవహారములలో అనవసరమయిన శత్రుత్వములు ఏర్పడినను దైవవశాత్తు వీరు శత్రునాశనం చేయుదురు.

ఈ జాతకులకు శాస్త్ర పరిశోధనాసక్తి ఎక్కువగా ఉంటుంది. వీరు గుప్తరోగములచే బాధ పడుదురు. 1-2 సంవత్సరములలో దంతసంబంధ జ్వరబాధలు, 35 సం॥రంలలో వ్రణసంబంధపీడలు, సోదరీ లాభము, తండ్రికి ధనలాభము కలుగును. 4-8 సంవత్సరముల మధ్యకాలంలో విద్యారంభం, బంధుప్రీతి, నానావిధ కార్యములు కలుగును.

9-16 సంవత్సరముల మధ్యకాలంలో వాహనవృద్ధి, విద్యాభివృద్ధి ఉపకారవేతనములు పొందెదరు. 16 నుండి 20 సం॥ల మధ్యకాలంలో పుత్రప్రీతియు, రాజద్వారమందు ప్రతిష్ఠ, తండ్రికి ధనలాభము కలుగును.

21 నుండి 27 సం॥రముల మధ్యకాలంలో విద్యార్జున పూర్తయి ఉద్యోగలాభము పొందెదరు. వివాహాది శుభకార్యములు జరుగుతాయి. దైవశక్తివలన ఒక మిత్రుని పరిచయము కలుగుతుంది. ఈ మిత్రునివల్ల అనేక సౌఖ్యములు కలుగును, ఒక ప్రదేశము నందు ధనలాభము కలుగును.

28-35 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభకార్యములు, నూతన గృహనిర్మాణం చేయుదురు, ఒక వివాహేతర సంబంధం వలన శత్రుబాధలు కలుగుతాయి. అయితే కొంతకాలమునకు ఈశత్రువులే మిత్రులగుదురు.

35-50 సంవత్సరముల మధ్యకాలంలో నానావిధ లాభములు కలుగును. అధికారముగల పదవీయోగం కలుగును. వాహనం నుండి పడుట తటస్థించును. నష్టము జరుగును.

51-60 సం॥రముల మధ్యకాలంలో కళత్రవిచారము, పౌత్రజననం కలుగుతాయి. తీర్థయాత్రలు చేస్తారు.

61 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో ధర్మకార్యములు చేస్తారు. సకుటుంబంతో కూడివుంటు 70 సం॥రలో వైశాఖ కృష్ణపక్షము తదియ శుక్రవారం వృశ్చికరాశిలో చంద్రుడు ఉండగా ప్రాతఃకాలంనందు నిర్యాణం చెందుతారు.

# 42 వ కథ

శ్రీ గణేశాయనమః. ఈ జాతకులు పురుషార్థము గలవారు, విజ్ఞాన వంతులు, సర్వజనులతో ప్రియముగా మాట్లాడువారు. మంచి కుటుంబము నందు జన్మించి దినదినాభివృద్ధి చెందుతారు. ఒక సమయం దుష్టసాంగత్యం వల్ల బుద్ధిమాంద్యమును కలిగియుందురు. త్వరలోనే వీరు దీనినుండి

బయటపడుదురు. స్వబుద్ధి అనుసారమే పనులు నిర్వర్తిస్తారు తప్ప ఇతరుల మాటను వినరు. అలంకరణలకై అధిక ధనవ్యయం చేస్తారు.

1 నుండి 4 సంవత్సరముల మధ్యకాలంలో జ్వర, దంత సంబంధ పీడలు, గృహమందు శుభకార్యములు జరుగుతాయి. విద్యారంభం చేస్తారు. తండ్రికి విశేష ధనలాభం కలుగుతుంది.

5-8 సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జన, గురుప్రీతి కలుగుతాయి. అగ్ని లేదా జలభయం కలుగుతాయి. 9 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో వాహనలాభం, విద్యార్జనలో కాలం గడుస్తుంది.

16 నుండి 20 ఆ తరువాయి 25వ సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జన, మిత్రలాభం కలుగుతాయి. ఉద్యోగ లాభము కలుగుతుంది. అలంకరణలకు అధిక ప్రాధాన్యమిస్తారు. 30 సం॥రముల మధ్యకాలంలో వివాహాది శుభకార్యములు జరుగుతాయి. పుత్రజననం కలుగును.

31 నుండి 40వ సంవత్సరముల మధ్యకాలంలో నూతన వ్యక్తుల పరిచయం, తద్వారా అధిక లాభము, ఉద్యోగంలో అభివృద్ధి కలుగుతుంది.

41 నుండి 50 సంవత్సరము మధ్యకాలంలో రాజద్వారమందు శత్రుభయం ఏర్పడుతుంది. దుష్టజన సాంగత్యం కలుగుతుంది. క్రమక్రమముగా శత్రునాశనం జరుగుతుంది.

51 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో అధికమయిన కష్టములు కలుగుతాయి. దైవారాధనవల్ల మానసికశాంతి, రోగనాశనం, శుభములు జరుగును.

61 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో తీర్థయాత్రలు చేయుచు దైవభక్తిని కలిగియుందురు. నూతన గృహనిర్మాణం చేస్తారు. కర్మాధిక్యముచే శ్వాసకోశవ్యాధులు కలుగుతాయి.

70 పై సంవత్సరములలో సమస్త కార్యములను వీడి దైవభక్తితో నుందురు. పుణ్యక్షేత్రమునందు దేహమును విడిచెదరు.

# 43వ కథ

శ్రీ గణేశాయనమః. ఈ జాతకులకు ప్రథమావస్థయందు సామాన్యం గాను, రెండవభాగమందు సుఖములు అనుభవించెదరు. ఈ జాతకులు బుద్ధి మంతులు. ఉదార స్వభావంకలిగి ఉంటారు. న్యాయశాస్త్ర విశారదులు ప్రతాపం కలిగివుంటారు. వాహనంనుండిగాని ఎత్తైన ప్రదేశమునుండిగాని పడుట జరుగును, వీరు ఎల్లప్పుడు మిత్రులతో కూడిఉంటారు, వీరు దైవ భక్తులు. వీరికి ఒకానొకప్పుడు మానభంగం కలుగునని భయపడుదురు.

1నుండి 4 సంవత్సరముల మధ్యకాలంలో ఉదరసంబంధ వ్యాధులు తండ్రికి ధనలాభం కలుగుతుంది. విద్యారంభం చేస్తారు. 5 నుండి 8 సంవ త్సరముల మధ్యకాలంలో శుభము, తండ్రికి ధనలాభము కలుగును. వ్రణ సంబంధ పీడలు కలిగి ఔషధసేవవలన శాంతిస్తుంది.

9 నుండి 12 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి గుప్తచింత కలుగుతుంది. జాతకునకు విద్యార్జనలో కాలం గడుస్తుంది. ఆ తరువాయి కాలంలో అంతే 20సం॥ల వరకు కాలములో విద్యాభివృద్ధి పరీక్షలలో కృతార్థులగుట జరుగుతుంది.

21నుండి 30 సం॥ల మధ్యకాలంలో వ్యవహార జయం. ఉద్యోగ లాభం కలుగుతుంది. వివాహాది శుభకార్యములు మంచి సంతానము కలుగుంది.

31నుండి 40 సం॥రముల మధ్యకాలంలో ధనలాభం, శుభకార్య ముల నిమిత్తము ధనవ్యయం చేస్తారు. వాహన సౌఖ్యము, గుప్తధన లాభము కలుగుతుంది.

41 నుండి 50 సంవత్సరముల పర్యంతము ధనధాన్యాభివృద్ధి, కీర్తి వృద్ధి స్వల్ప అనారోగ్యం కలుగును. శత్రుత్వంవల్ల మానసికచింత కలుగు

తుంది. దేవతారాధనవల్ల ఔషధశాంతివల్ల ఈ కష్టము నివారించబడు తుంది.

51నుండి 60 సం॥రముల పర్యంతము వివిధ శాస్త్రవిచారము చేయుదురు, సంతాన అభివృద్ధికొరకు వివిధ ప్రయత్నములు చేస్తారు. పరోపకారములు చేస్తారు. గృహనిర్మాణమునకై అధిక ధనవ్యయం చేస్తారు.

61నుండి 70 సం॥రముల మధ్యకాలంలో వాతాధిక్యంవలన శరీర పీడ కలుగుతుంది. నానావిధ సౌఖ్యములతో పుత్ర పౌత్రాదులతో సంతోషంగా కాలం గడుపుతారు.

చైత్రమాసములో తులారాశియందు చంద్రుడు ఉండగా బహుళ పంచమీ బుధవారం రోజున దేవలోకం పొందుతారు.

# 44 వ కథ

శ్రీ మహాగణేశాయనమః ఇట్టి గ్రహసంపత్తిగల జాతకాలు వ్యవహారజయమును, సత్యవాక్కును, కుజుని వలన కోపగ్రస్థులుగాను ఉండగలరు. కాలగమనంలో శీఘ్రముగా శాంతియుతులగుదురు. జీవితంలో మొదటి భాగం సాధారణముగాను రెండవ భాగములో మధ్యమంగాను, అంత్యమున సర్వసుఖములు పొందగలరు. చేయుపనులు జాగ్రత్తయు, కౌశల్యముతో చేయుదురు. కొంతకాలం పాపగ్రహ ప్రభావము వలన గుప్తరోగములచే బాధపడుదురు.

1 మొదలు 8 సంవత్సరముల మధ్యకాలంలో శరీరదుర్బలత్వము, వ్రణ సంబంధమయిన పీడలు, ఉదర సంబంధపీడలు కలుగును. విద్యారంభం అవుతుంది. ఆటపాటలయందు నేర్పు కలుగును.

9 నుండి 15 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి మొదట కష్టం కలిగి ఆ తరువాయి కాలంలో ధన లాభం కలుగును. ఈ కాల మంతయు విద్యార్జనలోను, ఆటపాటలలోను గడచును.

16 నుండి 30 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభ్యాసం పూర్తగును. వివాహయోగం, పుత్రలాభం కలుగును. ప్రభుత్వోద్యోగం లభించును. కొన్ని వ్యవహారములలో శత్రుత్వం ఏర్పడుతుంది.

అయితే విశేషంగా ధనలాభం కలుగుతుంది. కొంత అనారోగ్యం కలిగినను తిరిగి ఆరోగ్యం కలిగియుందురు. ఉద్యోగ వ్యవహారములలో గౌరవము, గృహమందు శుభకార్యములు చేస్తారు. శ్వాసకోశ పీడ వలన బాధపడినను ఔషధసేవ వలన శాంతించును. వాహనసుఖం కలుగుతుంది.

31 నుండి 40 సంవత్సరముల మధ్యకాలంలో అనేక విధములైన లాభములు, శుభకార్యములవల్ల ధన వ్యయం అగును. కొన్ని వ్యవహార ములలో చిక్కులు ఏర్పడినను దైవ ప్రార్థనలవల్ల ఈ కష్టములు తొల గును.

40 నుండి 50 సం॥రముల పర్యంతము భూగృహ లాభములు కలుగును. మూత్ర సంబంధమయిన వ్యాధులచే బాధ పడుదురు.

50 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో జ్ఞానమార్గచింత నము, ఇతరుల కార్యములందు ప్రీతియు కలుగును.

60 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో తీర్థయాత్రలు చేస్తారు. దైవారాధనలో కాలం గడుపుదురు. అంత్యము మాఘమాస మందు శుక్లపక్ష సప్తమి రోజున కృత్తికా నక్షత్రములో వృషభరాశి యందు చంద్రుడు ఉండగా జాతకులు దేహం విడిచెదరు.

# 45 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహ సంపత్తిగల జాతకులు వయస్సు క్రమగతముగా అభివృద్ధిగాంచెదరు. ఎల్లప్పుడు పరోపకారము చేయుదురు మంచి విద్య కలిగియుంటారు. కవిత్వమునందు ఆదరణ కలిగియుంటారు. చెంథురకములయిన విద్యలందు నేర్పరులై ఉంటారు.

1 వ సంవత్సరమందు ఆసన సంబంధమయిన బాధలు, 2వ. సం॥ రమందు ఉదర సంబంధ వ్యాధులు 3వ సంవత్సరమందు సోదరసోదరీ లాభము కలుగుతుంది. 4 నుండి 8సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభి వృద్ధి తండ్రికి ధనలాభం కలుగును.

9నుండి 15 సంవత్సరముల మధ్యకాలంలో ధనధాన్యాభివృద్ధియు, గృహమందు వివాహాది శుభవైభవములు తండ్రికి స్వల్పకష్టము కలుగును.

16 నుండి 22సంవత్సరముల మధ్యకాలంలో విద్యా సంబంధమ యిన కీర్తియు, రాజ్యద్వారమునందు జయమును లభించును. 23 నుండి 30 సంవత్సరముల మధ్య కాలంలో ఉద్యోగలాభం కలుగును. ధనాభి వృద్ధి జాతకునకు వివాహాది శుభకార్యములు జరుగుతాయి. విహార యాత్రలు చేస్తారు. సంతాన లాభము కలుగుతుంది.

31 నుండి 40 సంవత్సరముల మధ్యకాలంలో నూతన వస్త్ర వాహన లాభములు కలుగును. వాతపైత్య సంబంధమయిన బాధ వలన అనారోగ్యము కలుగును. ఔషధసేవ, దానజపాదులవల్ల ఇది నివారిస్తుంది. రాజకార్యమూలకముగా అనేక ప్రయాణములు చేస్తారు.

41 నుండి 50 సంవత్సరముల పర్యంతము ఉద్యోగాభివృద్ధి, సంతానమునకు శుభకార్యములు చేస్తారు. సభలలో పాల్గొంటారు.

51 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో అత్యుచ్చ పదవీ లాభము, దాసదాసీజన వృద్ధి, పనులందు ఆలస్యము, గృహమందు శ

కార్యముల నిమిత్తము ధనవ్యయం చేస్తారు. అంత్యమున వ్యాపారమూల కంగా ధనలాభం కలుగుతుంది.

61నుండి 70 సంవత్సరరముల మధ్యకాలంలో పుత్రపౌత్రాదివర్గము వారితోను, మిత్రాదులతోను సంతోషంగా గడుపుతారు. తీర్థయాత్రలకు పోదురు, దానధర్మములను కూడి యుందురు. కఫాధిక్యం వలన దేహ కంపం జరుగును. ఔషధసేవ వలన ఈ కష్టం శాంతించును. మిత్రకళత్ర విచారము కలుగుచు 80 సంవత్సరంలో కార్తీకమాసమందు త్రయోదశీ గురువారం రోజున అశ్విని నక్షత్రంలో చంద్రుడు ఉండగా స్వర్గలోకం పొందుదురు.

# 46వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహసంపత్తిగల జాతకులు యశోవంతు లగుదురు. అందరియెడ ఆదరము కలిగి ఉంటారు, ఓర్పును కలిగి యుందురు. మృదుభాషణము కలిగియుందురు. ఇతరులయొక్క లాభముల కొరకు ఇతరుల కార్యములందు ఆదరాభిమానములు కలిగియుందురు.

ఒకటవ సంవత్సరమునుండి 8వ సంవత్సరము మధ్యకాలంలో జ్వర సంబంధమయిన పీడయు, నేత్రపీడయు ముఖరోగమును కలుగు తాయి. తండ్రికి ధనలాభం. విద్యారంభం చేస్తారు. బంధుజనసమాగమము కలుగుచు, ధనలాభము కలుగును.

9-14 సంవత్సరము మధ్యకాలంలో జాతకునకు వాహనవస్త్ర భూషణ లాభములు కలుగును. విద్యాభివృద్ధి కలుగుచు, విద్యామూలక మయిన పారితోషికములు పొందుతారు.

15 నుండి 28 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి ధనలాభం, విద్యార్జన పూర్తవుతుంది. రెండు విధములయిన సంతోషములు పొంద గలరు, రాజమూలక ధనలాభం కలుగుతుంది. ప్రభుత్వ సంబంధ ఉద్యోగం చేస్తారు. వివాహం జరుగుతుంది. అంత్యమున స్వల్ప అనారో గ్యము కలుగును.

29 నుండి 39 సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగాభివృద్ధియు ధనవృద్ధియు, పుత్రపుత్రికా లాభమును గృహమందు శుభకార్యముల నిమిత్తం ధనవ్యయం చేస్తారు. మిత్రులే శత్రువులగుట వలన కార్యా టంకములు జరుగును. వాహనాభివృద్ధియు కలుగును. ఇతర దేశ ప్రయాణముల వల్ల ధనలాభం కలుగును. ఈ విధంగా సమస్త శుభ ములు జరుగగలవు.

40 నుండి 47 సంవత్సరంల మధ్యకాలంలో సంతానమునకు విద్యాభివృద్ధి కలుగుతుంది. స్వల్పకష్టములవల్ల కొద్దిగా ఇబ్బంది కలిగినను దైవారాధనవల్ల ఇది నివారిస్తుంది.

48 నుండి 55 సంవత్సరంల మధ్యకాలంలో గృహనిర్మాణము, పుత్రవర్గంవారికి శుభకార్యములు చేస్తారు. ఈ విధంగా ధనవ్యయం చేస్తారు. కళత్రమునకు అనారోగ్యం కలుగును.

50 నుండి 63 సంవత్సరంల మధ్యకాలంలో రాజమూలక ధన లాభం తీర్థయాత్ర ఫలితములు పొందుతారు. ధర్మమార్గంగా ధనవ్యయ మగును.

64-77 సంపత్సరంల మధ్యకాలంలో కళత్రనష్టములు కలుగును. జాతకునకు శరీర కష్టం కలుగును. 70 సంవత్సరములలో జేష్ఠమాసం నందు శుక్లపక్షము స్వాతినక్షత్రము కూడిన గురువారం రోజున సాయం కాలం నిర్యాణమగును.

# 47 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహ సంపత్తి కలిగిన జాతకులు శ్రేష్ఠ మయిన మంచిజ్ఞానము కలిగియుందురు. తాత తండ్రుల నుండి ఐశ్వర్య మును కలిగియుందురు. ధర్మకార్యములందు ప్రీతిని కలిగియుందురు. అధికమయిన బలం కలిగియుంటారు. ఇతరుల కార్యములందు నేర్పును కలిగియుంటారు. దేవ, గురు భక్తి కలిగియుంచురు. సభలలో మాట్లాడే నేర్పు కలిగియుందురు. వీరికి జీవితంలో చిన్నచిన్న కష్టములు కలిగినను దైవారాధన వల్ల ఈ కష్టములు నివారించబడతాయి.

1 నుండి 7 సంవత్సరముల మధ్యకాలంలో నేత్రపీడ, ఉదర సంబంధమయిన పీడలు, తండ్రికి ధనలాభం విద్యాభివృద్ధియు, సోదర సోదరీ లాభము కలుగును. ధనధాన్య లాభం కలుగును. అంత్యమున తల్లికి అనారోగ్యము కలుగును.

8 మొదలు 16 సంవత్సరముల మధ్యకాలంలో ప్రభుత్వం నుండి విద్యామూలక ధనలాభము, పరీక్షలలో కృతార్థులగుట, రెండురకముల విద్యలభ్యసించెదరు.

17 నుండి 20 అటు పిమ్మట 24 సంవత్సరంల పర్యంతము విద్యార్జన ప్రత్యేకించి రాజనీతిశాస్త్రమందు విశారదులగుదురు. తన్మూల కంగా కీర్తివృద్ధి కలుగును. ఉద్యోగలాభం కలుగును.

25 నుండి 35 సంవత్సరముల మధ్యకాలంలో వివాహాది శుభ కార్యములు జరుగుతాయి. నూతనవస్త్ర వస్తు, లాభములు కలుగుతాయి. ఉద్యోగంనందు విశేషవృద్ధి అల్పజీవనము గలిగినసంతానం కలుగుతుంది. దైవారాధన వల్ల సంపూర్ణాయుర్దాయం గలిగిన సంతానం కలుగుతుంది. సమస్త సౌఖ్యములు కలుగును.

36 నుండి 42 సంవత్సరంల పర్యంతము అధిక వస్త్రభూషణ లాభములు, దేశాంతర కీర్తియు కలుగును. 43 నుండి 50 సంవత్సరంల పర్యంతము రాజకార్యముల మూలకంగా అనేక ప్రయాణములు చేస్తారు. గృహమందు శుభకార్యములు చేస్తారు.

51 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో పుత్రపౌత్ర సౌఖ్యం కలుగుతుంది. ధర్మమార్గ ప్రవర్తనం కలిగియుందురు. కళత్రమునకు అనారోగ్యం కలుగును. అయితే ఔషధసేవ, జపదానాదుల వల్ల శాంతిస్తుంది.

61 నుండి 70 సంవత్సరముల కాలంలో రాజకార్యములు విడచి దైవభక్తిలో కాలం గడుపుతారు. 80 సంవత్సరంల ఆయుర్దాయం కలిగి దేవలోకమును పొందుదురు.

# 48 వ కథ

శ్రీ గణేశాయనమః. ఈ జాతకులు అధికమయిన వాత్సల్యంతో కుటుంబమును పోషింతురు. ఔదార్యసాహసాది సద్గుణములు, సత్య వాక్కును కలిగియుందురు. ధర్మమార్గములలో చరిస్తే వీరికి కష్టాలురావు. విలాసవంతులు, నృత్యగీతాది వినోదములతో కూడియుందురు. పరోపకార పరాయణులుగా ఉందురు.

1వ సంవత్సరమందు నేత్రపీడయు, 2వ సంవత్సరమందు ఉదర సంబంధమయిన పీడయు, 3వ సంవత్సరమందు మాతృకష్టము కలుగుతుంది. తండ్రికి రాజద్వారమందు జయం కలుగుతుంది, ధనవాహన లాభములు కలుగుతాయి, 4 నుండి 8 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభకార్యములు, విద్యారంభం జరుగుతుంది. దినదినాభివృద్ధిగా విద్యాభివృద్ధి జరుగుతుంది.

8 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి, వాహన వృద్ధియు కలుగుతాయి, పాఠశాలయందు గౌరవము, పారితోషికములు పొందుట జరుగును.

17 నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జన పూర్తవుతుంది. రాజద్వారమునందు జయమును పొందుటవలన ఉచ్చపదవి లభించుటయు, సన్మిత్రలాభమును తప్పక కలుగును.

26 నుండి 32 సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగ మూలకముగా నితరదేశ ప్రయాణములు తన్మూలక ధన, వాహన లాభములు కలుగుతాయి. మిత్రలాభం కలుగుతుంది. కొన్ని వ్యవహారములు అనుకోని శత్రుత్వంవలన ఆటంకములు ఏర్పడుతాయి. వివాహం జరుగుతుంది, సంతానం కలుగుతుంది.

33 నుండి 40 సం॥రముల కాలంలో పుత్రసౌఖ్యం, కీర్తియు, నూతన వస్త్ర, భూషణ అలంకారములను, విశేష ధనవృద్ధి జరుగుతుంది. శత్రువులే మిత్రులు అగుదురు. ధనసంబంధమయిన విచారము కలుగుతుంది. దైవారాధనవల్ల ఈ చిక్కులు తొలగుతాయి.

40 నుండి 50 సం॥రముల మధ్యకాలంలో ఉద్యోగంతోపాటు వ్యాపార మూలక ధనలాభం, రాజద్వారమందు గౌరవము, కళత్రమునకు అనారోగ్యం కలుగుతాయి.

51 నుండి 60 సం॥ములు ఆ తరువాయి 70 సంవత్సరముల పర్యంతము పుత్ర, పౌత్రాదులతో సుఖంగా గడుస్తుంది. ఒకరిని గురించి అధికంగా విచారం పొందుతారు. కఫాధిక్యం వలన అనారోగ్యమేర్పడుతుంది. ఆ తరువాయి కాలంలో 75 సం॥రంలో వైశాఖ శుక్లపక్షము ద్వాదశి గురువారం ఉత్తరాషాఢనక్షత్రమందు చంద్రుడు ఉండగా దేహశోకం పొందుతారు.

# 49 వ కథ

శ్రీ గణేశాయనమః. ఈ జాతకచక్రమందలి ఫలితములు ఎట్టివనగా ఈ జాతకులు మంచి పేరుగలిగి ఉందురు. సత్త్వగుణ ప్రధానులు, రూపవంతులు, బలవంతులు, యశోవంతులు, నిర్మలమయిన అంతఃకరణం కలవారు. దైవపూజాదులతో కూడియుందురు. ధర్మమార్గానుసారం చరిస్తారు.

1వ సంవత్సరమందు జ్వరభయమును, 2వ సంవత్సరమందు శ్వాస సంబంధమయిన పీడలు, 3వ సంవత్సరమందు సోదరీ లాభము, 4వ సంవత్సరము నుండి 8 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి ధన లాభము, విద్యారంభ లాభమును కలుగును.

9 నుండి 15 సంవత్సరముల మధ్యకాలంలో జాతకునకు విద్యాభివృద్ధి, తండ్రికి విశేషధనలాభం, వాహనలాభము, రాజమూలకముగా జాతకులు బహుమానములు పొందుదురు. ఆకస్మికముగా ఎత్తైనచోట్లనుండి పడుదురు.

16 నుండి 25 సంవత్సరముల మధ్యకాలమందు విద్యార్జన పూర్తగును. విహారయాత్రలు చేస్తారు. ఉద్యోగలాభం కలుగుతుంది. అలంకరణలకై ధనవ్యయం చేస్తారు. నూతన మిత్రుల పరిచయం అవుతుంది. వివాహం జరుగుతుంది.

26 నుండి 30 సంవత్సరముల మధ్యకాలంలో సంతాన లాభం రాజమూలక ధనలాభం, తండ్రికి అనారోగ్యం కలుగుతాయి.

31 నుండి 40 సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగ వ్యవహారములలో కీర్తివృద్ధి, తద్వారా ధనలాభమును, భూలాభమును తప పొందుదురు. స్వకులముందు శత్రుత్వమేర్పడుతుంది. మానసిక విచార కలుగుతుంది. తద్వారా అనారోగ్యమును కలిగియుందురు.

41 నుండి 50 సంగరముల కాలంలో దినదినాభివృద్ధిగా ఉండగలదు. అంత్యమున ఆకస్మిక నష్టం కలుగును. 51 నుండి 57 సంవత్సరముల మధ్యకాలంలో కీర్తి, ఐశ్వర్యము కలుగును. తీర్థయాత్రలు చేస్తారు. దైవ కార్యములకై ధనవ్యయం చేస్తారు.

51 నుండి 65 ఆ తరువాయి 30 సంవత్సరముల మధ్యకాలంలో సర్వసుఖములు అనుభవిస్తారు. నానావిధ దానధర్మములు చేస్తూ కాలం గడుపుతారు. సకుటుంబంతో పుత్రపౌత్రాదులతో కూడియుండగా చైత్రశుద్ధ అష్టమీ శుక్రవారం రోజున దైవలోకం పొందుదురు.

# 50వ కథ

శ్రీ గణేశాయనమః. ఈ జాతకము యొక్క శుభ పాపగ్రహముల యొక్క ఫలితము ఎట్లనగా జాతకులు పరాక్రమవంతులు, భాగ్యశీలురు, అధిక వాత్సల్యము కలిగియుందురు. వీరి జీవితంలోని అంత్యకాలంలో కష్టములు అనుభవిస్తారు.

1 నుండి 5 సంవత్సరముల మధ్యకాలంలో జ్వరభయమును, సోదరసోదరీలాభమును, స్వల్ప అనారోగ్యమును, విద్యారంభము, తండ్రికి ధనలాభం కలుగుతాయి.

6 నుండి 12 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి ధనలాభము, అధికమయిన కీర్తి, విద్యాభివృద్ధి కలుగుతాయి.

13 నుండి 23 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభ కార్యములు జరుగుతాయి. విద్యార్జన, పరీక్షలయందు కృతార్థులగుటయు, కలుగుతాయి.

24 నుండి 35 సంవత్సరముల మధ్యకాలంలో రాజద్వారమునందు జయం, ఉద్యోగలాభములు కలుగుతాయి. జాతకునకు వివాహాది శుభకార్య

ములు జరుగుతాయి. పుత్రపుత్రిక లాభము కలుగుతాయి. కొంతమందితో శత్రుత్వం కలుగుతుంది. కొన్ని వివాహేతర సంబంధాలు ఏర్పడతాయి.

36 నుండి 45 సంవత్సరముల మధ్యకాలంలో మాతాపితృ సంబంధ కష్టములు, గృహనిర్మాణాది కార్యక్రమములవల్ల అధిక ధనవ్యయం కలుగుతాయి.

45 నుండి 55 సంవత్సరముల మధ్యకాలంలో ఉద్యోగాభివృద్ధి కలుగుతుంది. దానధర్మములు చేస్తారు. పౌత్రజననం జరుగుతుంది. గృహమందు శుభకార్యములు చేస్తారు.

56 నుండి 65 సంవత్సరముల మధ్యకాలంలో అధిక ఉత్సాహము, ధర్మప్రవృత్తితోను జీవిస్తూ, తీర్థయాత్రలు చేస్తారు.

80 సంవత్సరములు సుఖంగా జీవించి వైశాఖశుద్ద చతుర్దశి ఆదివారం రోజున స్వర్గలోకం పొందుతారు.

# 51 వ కథ

శ్రీ గణేశాయనమః. ఈ జాతకచక్రమునందలి గ్రహములు జాతకునకు అధికమయిన భాగ్యమును, మంచి ఉత్సాహమును, ఉదారచిత్తమును, సత్కీర్తి సద్గుణములు యిచ్చును. ఈ జాతకులు అల్పవిద్య నభ్యసిస్తారు. అయితే ఇదే సమయంలో అధిక జ్ఞానము కలిగిఉంటారు. వాహన, భూలాభములు కలిగి ఉంటారు. అకస్మికంగా ఏర్పడే ఉపద్రవములవల్ల ధనవ్యయం చేస్తారు.

1 నుండి 12 సంవత్సరముల మధ్యకాలంలో మధ్యమధ్య అనారోగ్యం కలిగి తిరిగి ఆరోగ్యం కలుగుచుండును. విద్యారంభం చేస్తారు. నృత్యగీతాది వినోదములయందు ఆసక్తి కలిగి ఉంటారు. 2వ సంవత్సరమందు ఉదర సంబంధ పీడలు, 3వ సంవత్సరంలో దృష్టిసంబంధ పీడలు,

4వ సంవత్సరంలో విద్యారంభం చేస్తారు. 5 నుండి 7 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభకార్యములు, విద్యాభివృద్ధి కలుగును.

8 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి; పరీక్షల యందు కృతార్థులగుట, పారితోషికములు లభించుట, కీర్తివృద్ధి కలుగును.

17 నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో వివాహ లాభమును కళత్రసౌఖ్యము, పుత్రలాభము, ఉద్యోగ, మిత్రలాభములు కలుగును.

26 నుండి 32 సం॥రముల మధ్యకాలంలో ఉద్యోగరీత్యా ప్రయాణములు చేయుదురు. కొన్ని వ్యవహారములలో విరోధము, విచారము కలుగును.

33 నుండి 40 సం॥రముల మధ్యకాలంలో ధనవ్యయము, శత్రుత్వం తొలగి మంచికీర్తి కలుగును. ఆ తరువాయి 50 సంవత్సరముల మధ్యకాలంలో వ్యాపారమూలకముగా ధనలాభము, గృహమందు శుభ కార్యములు చేస్తారు.

50 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో సుఖదుఃఖములు సమానముగా ఉండును. 69 సం॥రముల పర్యంతము అతిథి జనపూజలు చేస్తారు. వైశాఖమాసమందు శుద్ధద్వాదశి గురువారం రోజున దేవలోకమును పొందుతారు.

# 52 వ కథ

శ్రీ గణేశాయనమః. ఈ జాతకుడు వ్యవహారములందు జయము పొందును. భార్యపుత్రులయందు ప్రీతిని, మంచి జ్ఞానము, ధనము, మధుర భాషణమును కలిగియుందురు. అనాయాసముగా సర్వకార్యములు చేయుదురు. తల్లితండ్రుల మూలకంగా ధనం, సౌఖ్యం పొందుతారు. తీర్థయాత్రలు, విదేశీయానం చేస్తారు. వ్యవసాయమునందు విశేషమైన నేర్పు కలిగి ఉంటారు.

1,2,3 సంవత్సరముల కాలంలో ఘుఖపీడన, సాధారణ అనా రోగ్యములు, పిత్రృలాభము, 4 నుండి 7 సంవత్సరముల మధ్యకాలంలో విద్యారంభం, గురుప్రీతి, స్వల్పకష్టము కలిగి శాంతించును.

8 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి, తండ్రికి వ్యాపారమూలకముగా లేదా భూమూలకముగా ధనలాభమును, పరీక్షలందు కృతార్థులగుటయు, గృహమందు శుభకార్యములు వస్త్రభూషణాది లాభములు కలుగును.

17 నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో నానావిధభోగములు కలుగుతాయి. విద్యార్జన పూర్తియి ఉద్యోగాన్వేషణ చేసి ఉద్యోగలాభం పొందుతారు. అనుకోని విధంగా ధనవ్యయం చేస్తారు.

26 నుండి 34 సంవత్సరముల మధ్యకాలంలో వివాహాది శుభ కార్యములు జరుగుతాయి. ఉద్యోగలాభములు, పుత్రోత్సాహమును, వార సత్వ సంబంధమయిన భూ, ధనలాభములు కలుగుతాయి.

35 నుండి 42 సంవత్సరముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా కీర్తియు, గృహమందు శుభములు, వాహన సౌఖ్యము కలుగుతాయి. ఉద్యోగ వ్యవహారములలో శత్రుత్వం ఏర్పడుతుంది.

43 నుండి 50 సంవత్సరముల కాలంలో భూగృహలాభము వంటి నానావిధ సౌఖ్యములు కలుగుతాయి.

51 నుండి 60 సంవత్సరముల కాలంలో ధనధాన్యాభివృద్ధి, గృహ మందు శుభకార్యములు, అందువల్ల ధనవ్యయం కలిగి అంత్యమున పుత్ర నకు అనారోగ్యం కలుగును.

60 నుండి 70 సంవత్సరముల కాలంలో నానావిధ దానధర్మవ చేయుచు కాలం గడుపుతారు.

చైత్రమాసములో ప్రతినత్ సోమవారము రోజున రేవతి న మందు మీనరాశిలో చంద్రుడు ఉండగా మరణం కలుగుతుంది.

# 53వ కథ

శ్రీ గణేశాయనమః. ఈ జాతకులు శుభకర్మములు చేయువారు, బుద్ధిమంతులు, ధర్మశాస్త్రమందు ఆదరము కలుగువారు, వాహన సౌఖ్యమును కలిగిఉంటారు.

1వ సంవత్సరమందు సుఖదంతపీడయు, 2 నుండి 5 సంవత్సరముల పర్యంతము సోదర సోదరీలాభమును, విద్యారంభంను కలుగుతాయి.

5 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో ఎత్తైనచోట్లనుండి పడుటయు, విద్యార్జన, తండ్రికి ధనలాభం కలుగును. నూతనవస్త్ర భూషణాది లాభములను, పితృమూలక విచారము కలుగుతాయి.

16 నుండి 30 సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జన పూర్తవుతుంది. ఉద్యోగలాభం కలుగుతుంది. కీర్తివృద్ధి కలుగుతుంది. వివాహం జరుగుతుంది. అంత్యమున ఆకస్మిక అపవాద భయము కలుగును. సంతానం కలుగుతుంది.

30 నుండి 35 సంవత్సరముల మధ్యకాలంలో సంతాన సంబంధమయిన విచారము కలుగుతుంది. ఉద్యోగమందు పదోన్నతి కలుగుతుంది.

36 నుండి 42 సంవత్సరముల మధ్యకాలంలో అధికోత్సాహం కలుగుతుంది. ఒక శత్రువు ఏర్పడి మనసుకు చికాకులు కలిగించును. అంత్యమున శత్రునాశనం కలుగును.

43 నుండి 52 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభకార్యములు ప్రయాణములు కలుగును, ప్రయాణమందు మార్గములో చోరభయం కలుగుతుంది. పిమ్మట ఉద్యోగవృద్ధి కలుగుతుంది. గృహనిర్మాణముపకై అధిక ధనవ్యయం చేయుదురు.

53 మొదలు 60 సంవత్సరముల మధ్యకాలంలో అనేకవిధములుగా

లాభం కలుగుతుంది. అనేక విహారయాత్రలు చేస్తారు. తీర్థయాత్రలు చేస్తారు.

61 నుండి 70 సం॥రముల మధ్యకాలంలో ధర్మకార్యములు చేస్తారు. ధర్మగాథలు వినుటయు చేస్తారు. వైశాఖమాసమందు కృష్ణ చతుర్దశి శుక్రవారం రోజున నిర్యాణం కలుగుతుంది.

# 54వ కథ

శ్రీ మహాగణాధిపతియేనమః. ఈ జాతకులు నానావిధ భోగములు కలిగి విలాసవంతమయిన జీవితం గడుపుతారు. వీరు పరోపకారప్రియులు. ఉన్నతమయిన విద్యనభ్యసిస్తారు. స్వజనులకు సంతోషము కలగజేస్తారు. గురుదేవతాభక్తి కలిగియుందురు.

1వ సంవత్సరమందు జ్వరభయమును, 2వ సంవత్సరమందు ఉదరవ్యాధి, 3,4 సంవత్సరములలో విద్యారంభం జరుగుతుంది. 5 నుండి 8 సంవత్సరముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా ఉంటుంది.

9 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో సంతోషమును, విద్యార్జనతో కాలం గడుపుతారు వాహన సౌఖ్యం కలుగుతుంది. గృహమందు శుభకార్యములు జరుగుతాయి.

17 నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జన పూర్తవుతుంది. రాజద్వారమందు జయం కలుగుతుంది. ఉద్యోగంలో ప్రవేశిస్తారు. శరీర అనారోగ్యము కలుగును, శ్రీసూర్యనారాయణ మంత్రం జపించిన యెడల సర్వసుఖములు కలుగును.

26 నుండి 34 సంవత్సరముల మధ్యకాలంలో వివాహాది శుభకార్యములు జరుగుతాయి. నానావిధ భోగభాగ్యములు కలుగుటయు, బహు

దాసదాసీజన సేవయు, అధికలాభము, వాహనసౌఖ్యం కలుగును. గృహమందు ధనవ్యయం జరుగుతుంది. బంధుజన సమాగమము కలుగును.

35 నుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో పుత్రాభివృద్ధి కలుగుతుంది. ఉద్యోగమందు ఉన్నతస్థితి కలుగుతుంది. మంచి పేరుగలిగి ఉంటారు. కొంతమందితో శత్రుత్వమేర్పడుతుంది.

51-60 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు శుభకార్యములు జరుగుతాయి. తీర్థయాత్రాది పర్యటనలు చేస్తారు. భూ, గృహలాభము కలుగును. అంత్యమున పుత్రునకు అనారోగ్యం కలుగుతుంది. జపదానాదులవల్ల ఈ కష్టం నివారించబడుతుంది.

60-70 సంవత్సరముల మధ్యకాలంలో నానావిధ భోగభాగ్యములు అనుభవిస్తారు. సర్వసుఖములు పొందుతారు.

# 55 వ కథ

శ్రీ మహా గణాధిపతియేనమః ఇట్టి గ్రహ సంపత్తి గల జాతకులు మంచి గుణము కలిగి ఉంటారు. ఒకానొక సమయమున దైవయోగం వలన చెడ్డ తలంపులు కలిగి ధన నాశనం జరుగును. ఆ తరువాయి కాలంలో ఈ కష్టములు తొలగి సమస్త శుభములు కలుగును.

1వ సంవత్సరమందు శరీర అనారోగ్యమును, 2-3 సంవత్సరములలో తండ్రికి ధనలాభము, 4-8 సంవత్సరముల మధ్యకాలంలో విద్యారంభం, పితృలాభం, తండ్రికి అన్యదేశ ప్రయాణము కలుగును.

9 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో ఎత్తైన చోట్లనుండి పడుటయు వ్రణములతో బాధపడతారు, విద్యాభివృద్ధి, పరీక్షలయందు జయం కలుగును.

17 నుండి 25 సంవత్సరముల పర్యంతము కఠినముగా మాట్లాడు

టయు, వృధా ధన వ్యయము, రాజద్వార మందు అపజయమును, చెడ్డ ఆలోచనలు, స్వజనులను దుర్జనులవలెను, దుర్జనులను మిత్రులవలెను చూచుచుందురు. వివాహం జరుగుతుంది. గృహమందు శుభకార్యములు జరుగుతాయి.

26 మొదలు 38 సంవత్సరముల వరకు నానావిధ లాభములు, రాజద్వారమందు జయమును- దేశదేశాంతర కీర్తియు, వస్త్రభూషణాది లాభములు కలుగును. ఉద్యోగ మూలకముగా ప్రయాణము అచట గౌరవము, స్వల్ప పీడ కలుగుతాయి.

39 నుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో పుత్రోత్సవమును, గృహమందు వివాహాది శుభవైభవములు, నూతన వ్యక్తుల పరిచయం, భూలాభము, గృహనిర్మాణాది కార్యక్రమములు జరుగుతాయి.

51-60 సంవత్సరముల మధ్యకాలంలో అధికైశ్వర్యము, అధికోత్సాహం, పుత్ర పౌత్రాది వివాహముల మూలకముగా ధనవ్యయము, సజ్జన సాంగత్యము కలుగును.

61-70 సంవత్సరముల మధ్యకాలంలో సర్వ సంపదలతో, దాన ధర్మములతో కాలం గడుపుతారు. 75 సంవత్సరములో సద్గతి పొందుతారు.

# 56 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతకులు బహు బలము కలిగిన వారు. విద్యావినయములు కలిగి ఉంటారు. సత్కార్యములు చేయుదురు. వాహన సౌఖ్యము కలిగి యుందురు. మంచిబుద్ధి, మిత్రకార్యములందు ప్రీతి, దేవతా గురుభక్తి దీర్ఘాయుర్దాయం కలిగియుందురు. ఆయాకాలములలో స్వల్పకష్టములు కలిగినను దైవారాధన వలన ఈ కష్టములు నివారించబడును.

1వ సంవత్సరమందు ఉదరపీడయు, 2,3 సం॥లలో సాధారణ అనారోగ్యములు కలుగుతాయి. తండ్రికి భాగ్యాభివృద్ధి కలుగుతుంది. 4 నుండి 7 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాలాభం కలుగుతుంది. గృహమందు శుభకార్యములు జరుగుతాయి. ఈ కాలమంతయు విద్యార్జనలో కాలం గడుస్తుంది.

8 నుండి 16 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి ధనలాభం కలుగుతుంది. తండ్రికి ఇతరప్రాంతముల ప్రయాణం వలన ధనలాభం కలుగుతాయి. విద్యాభ్యాసం జరుగుతుంది. వాహన లాభం కలుగుతుంది.

17 నుండి 27 సంవత్సరముల కాలంలో విద్యార్జన జరుగును. ప్రత్యేకించి వైద్యవిద్య నభ్యసిస్తారు. రాజ ద్వారమందు జయం, ఉద్యోగ లాభం కలుగుతుంది. వివాహాది శుభకార్యములు చేస్తారు. అనేక విధములుగా ధనలాభం కలుగుతుంది. తండ్రికి అనారోగ్యం కలుగుతుంది.

28 నుండి 38 సంవత్సరముల మధ్యకాలంలో సంతాన సౌఖ్యం. కళత్ర అనారోగ్యం కలుగుతుంది. రాజకీయముగా అన్యదేశ ప్రయాణం చేస్తారు. మంచి ప్రఖ్యాతలాభం కలుగుతుంది.

39 నుండి 48 సంవత్సరముల మధ్యకాలంలో భూమూలకముగా ధనలాభము, అధికోత్సాహం కలుగుతుంది. ఉద్యోగమందు జయం కలుగుతుంది.

48 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో కళత్రమునకు అనారోగ్యం కలుగుతుంది. ఇందువల్ల జాతకునకు ధనవ్యయం, మనోవికారం కలుగుతాయి. జపదానాదులవల్ల ఔషధసేవవలన ఈ కష్టం శాంతిస్తుంది సంతానమునకు వివాహాది శుభకార్యములు చేస్తారు. పౌత్రజననం, గృహలాభం కలుగుతాయి.

60 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో మంచికీర్తి పొందు తారు, అంత్యమున కఫ సంబంధమయిన బాధలు కలుగుతాయి. ఆ తరు వాయి కాలంలో భాద్రపదమాసంలో కృష్ణపక్షమి అష్టమి తిధిరోజున రోహిణీ నక్షత్రమునందు మరణం కలుగును.

# 57 వ కథ

శ్రీ గణాధిపతియేనమః ఈ జాతకమునందలి గ్రహములు భాగ్య మును సంతోషమును కలగజేయును. ఈ జాతకులు శత్రువులను, మిత్రు లను సమానంగా చూచుదురు, మంచి జ్ఞానము కలిగియుందురు. అనేక మంది మిత్రులను కలిగియుందురు. కళత్రద్వయం కలిగియుందురు.

1వ సం॥ర మందు బాలపీడ, 2-3 సం॥రములో సాధారణ అనా రోగ్యములు, 4-5 సం॥రముల కాలంలో తండ్రికి ధనలాభము, కీర్తివృద్ధి విద్యాభ్యాసము, గృహమందు శుభకార్యములు జరుగుతాయి.

6 నుండి 15 సంవత్సరముల కాలంలో జరిగే ఫలితములను పరిశీ లించగా విద్యార్జనలో కాలం గడుస్తుంది. వీరికి గణిత విద్యయందు నేర్పు కలిగి ఉంటారు. తల్లి ఆరోగ్యం కొంత ఆందోళన కలిగిస్తుంది, అయితే జీవితానందాలవల్ల ఈ కష్టము నివారించబడుతుంది. ఆరోగ్యం కలుగు తుంది.

15 నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో పర్యంతము, అధికో త్సాహంగా కాలం గడుస్తుంది. గణిత విద్యాభ్యాసము, అందు పరీక్షలలో కృతార్థులగుదురు. ఉద్యోగలాభం కలుగుతుంది. 25 నుండి 35 సం॥ర ముల కాలంలో ఉద్యోగలాభము, తండ్రికి అనారోగ్యం, రాజమూలక ధనలాభం కలుగుతాయి. వివాహం జరుగుతుంది యోగ్యమయిన కళత్రం వల్ల సుఖంగా కాలం గడుస్తుంది. సంతానసౌఖ్యం కలుగుతుంది.

45 నుండి 55 సం॥రముల మధ్యకాలంలో అనేక విధములుగా లాభములు పొందుతారు. గృహమందు శుభకార్యములు జరుగుతాయి. కళత్ర సౌఖ్యం కలుగుతుంది.

56 నుండి 65 ఆ తరువాయి కాలంలో పుత్ర వివాహాది శుభకార్యములు చేస్తారు. పుత్ర పౌత్రాది వర్గముతో సుఖముగా కాలం గడుపుతారు. కొంత అనారోగ్యం కలుగుతుంది. అ తరువాయి కాలంలో బాధ్రపద మాసములో కృష్ణపక్షములో నిర్యాణం కలుగును.

# 58 వ కథ

శ్రీ మహాగణాధిపతయే నమః ఇటువంటి గ్రహసంపత్తిగల జాతకులు, ధనవంతులు, గుణవంతులు, ప్రజ్ఞావంతులు, సర్వజనప్రియులు, రాజతుల్యురు, పెద్దలయెడ గౌరవం కలిగినవారు, సర్వవస్తువులు కలిగి ఉంటారు. మంచి వక్తలు, వ్యవహారముల చేయుటయందు నేర్పును, మంచి పేరును కలిగియుందురు.

1 వ సం॥ర మందు నేత్రపీడయు, 2 వ సంవత్సరమందు జ్వర భయం, 3వ సంవత్సరమందు తండ్రికి అనేక లాభములు కలుగుతాయి. 4 నుండి 15 సంవత్సరముల మధ్యకాలంలో విద్యారంభం, తండ్రికి దూర దేశ ప్రయాణముమ ధనలాభం కలుగుతాయి. అ తరువాయి కాలంలో విద్యాభివృద్ధి కలుగుతాయి. వాహన లాభం కలుగుతుంది.

16 నుండి జరుగు కాలంలో దినదినాభివృద్ధిగా విద్యార్జన జరుగుతుంది. శ్రేష్ఠమయిన విద్య నభ్యసిస్తారు. వ్యవహార జయం కలుగుతుంది. విద్యార్జన పూర్తవుతుంది. 24 నుండి 35 సం॥ముల మధ్య కాలంలో రాజమూలిక ధనలాభము, ఉద్యోగాభివృద్ధి కలుగుతుంది.

వివాహం జరుగుతుంది. వస్త్రభూషణ ధనలాభములు కలుగుతాయి. ఈ కాలమందే గృహనిర్మాణాదులవల్ల అధిక ధనవ్యయం జరుగుతుంది.

35 నుండి 45 సంవత్సరముల మధ్యకాలంలో నానావిధభోగములు, ఉద్యోగరీత్యా ప్రయాణములు, ఇందువల్ల ధనలాభమును, గౌరవాభివృద్ధి కలుగుతాయి. కళత్రమునకు అనారోగ్యం కలుగుతాయి.

46 నుండి 55 సం॥రముల మధ్యకాలంలో కీర్తివృద్ధి కలుగుతుంది. అనేక శుభకార్యములు చేస్తారు. జాతకునకు శరీర అనారోగ్యం కలుగుతుంది. ఔషధసేవవలన శాంతిస్తుంది.

56 నుండి 65 సంవత్సరముల మధ్యకాలంలో స్వజాతియందు శత్రుత్వ మేర్పడుతుంది. ఆ శత్రువు ఎదురుగా ఉన్నపుడు మిత్రుని వలెను, పరోక్షమున శత్రువుగా ఉంటాడు. ఆ తరువాయి కాలంలో శత్రునాశనం జరిగి నానావిధ భోగములు అనుభవిస్తారు. మంచి కీర్తి పొందుతారు.

# 59వ కథ

శ్రీ గణేశాయనమః. ఇట్టి శుభగ్రహదృష్టి కలిగిన జాతకులు, అందరియెడ భక్తిగౌరవములు కలిగియుందురు. దాన ధర్మములు చేయుదురు. ఉన్నతమయిన విద్య నభ్యసిస్తారు. కార్యములందు నేర్పుకలిగి యుందురు. బాల్యమునందు మధ్యవయస్సునందు రెండువిధములగు నష్టములు కలుగుతాయి.

1వ సం॥నందు జ్వరసంబంధమయిన పీడ, 2సం॥రమందు ముఖపీడయు, 3వ సం॥ర మందు వ్రణసంబంధ బాధలు కలుగుతాయి. తండ్రికి అనేక విధములయిన లాభములు కలుగుతాయి. ప్రజాదరము కలుగుతాయి. 4 నుండి 12సం॥రముల మధ్యకాలంలో జ్వరభయము, విద్యారంభంజరుగు

టుంది. తరువాయి కాలంలో సామాన్య ఫలములు, విద్యాలాభం కలుగు తాయి.

13 నుండి 24 సంవత్సరముల పర్యంతము విద్యాభివృద్ధి శత్రుత్వ ఐశ్వర్యసిద్ధి కలుగుతాయి. వాహన సౌఖ్యం కలుగుతుంది. విద్యాభ్యాస పూర్తయి ఉన్నతోద్యోగముతో ప్రవేశిస్తారు. 24 నుండి 34 సం॥రముల మధ్యకాలంలో అనేక విధములయిన యోగములు పొందుతారు. వివాహం జరుగుతుంది. సంతానం కలుగుతుంది. మాతాపితృ సంబంధమయిన విచా రము కలుగుతాయి. ఉద్యోగ వ్యవహారములలో శత్రుత్వం ఏర్పడుతుంది.

35 నుండి 45 సంవత్సరముల పర్యంతము మహోత్సాహం. శుభ కార్యముల నిమిత్తం ధనవ్యయం చేస్తారు. అనేక విధముల వాహనములు కలిగియుందురు. విద్యాధికుడయిన మంచిలక్షణములు కలిగిన మంచిమిత్రుని పరిచయం కలుగుతుంది. కళత్రంయొక్క అనారోగ్యం కొంత ఆందోళన కలిగిస్తుంది. చేయు పనులన్నీ శుభప్రదంగా చేస్తారు.

46 నుండి 55 సం॥రముల మధ్యకాలములో అనేక విధములుగా ధనార్జన చేస్తారు. గృహమందు శుభకార్యములు చేస్తారు. గృహనిర్మాణం చేస్తారు, సకుటుంబంగా తీర్థయాత్రలు చేస్తారు.

56 నుండి 65 సం॥ల మధ్యకాలంలో మంచి పేరుతెచ్చే పనులు చేస్తారు. శుభకార్యముల నిమిత్తం ధనవ్యయం చేస్తారు. లోటువ్యయములు సమానంగా ఉంటాయి. 79 సం॥లో చైత్ర బహుళమాసమందు అష్టమీ ఆదివారం రోజున సకుటుంబ బంధుమిత్రులతో కూడి ఉంటూ ముఖానక్షత్రమందు దేహ త్యాగం చేస్తారు.

# 60 వ కథ

శ్రీ గణేశాయనమః. ఇట్టి గ్రహసంపత్తిగల జాతకులు చిత్ర విచిత్రములందు ప్రీతిగలవారై ధనవంతులగుదురు. ధనధాన్యములు కలిగియుందురు. నానావిధ కళలయందు కౌశల్యం కలిగియుందురు. ఇతర ప్రాంతములందు ప్రీతిని కలిగియుందురు. మంచి వాహనములు కలిగియుందురు. ఎక్కువ కోర్కెలు కలిగియుందురు. గంభీరహృదయులు మంచిమాట, పరకార్యములందు నేర్పుకలిగియుంటారు.

పూర్వజన్మ ప్రభావమువలన అన్యస్త్రీ ప్రీతికలిగియుందురు. ఒకానొక సన్మిత్రలాభం కలుగును.

1వ సంవత్సరమందు జ్వరభయం, 2వ సంవత్సరమందు ఉదర సంబంధవ్యాధులు 3వ సంవత్సరమందు గృహమందు శుభకార్యములు, తండ్రికి విశేష ధనలాభం కలుగును.

4 నుండి 12వసం॥రముమవరకు విద్యారంభం, ఉద్యోగరీత్యాతండ్రికి విదేశప్రయాణం కలుగును. దీనివలన ధనలాభం కలుగును. 13 నుండి 20 సం॥ర పర్యంతం పరీక్షలయందు కృతార్థుడగుట గృహమందు వృద్ధ మృత్యువువల్ల తండ్రికి అధిక వ్యయం అగును. ఈ కాలమంతయు విద్యార్జనతో కాలం గడుచును.

21 నుండి 28 సం॥రముల మధ్యకాలంలో జాతకునికి విద్యార్జన పూర్తగును. వివాహాది శుభకార్యములు జరుగును. అందమైన కళత్రం లభించును, పిమ్మట పుత్రలాభం కలుగును.

28 నుండి 36 సం॥ల మధ్యకాలంలో ఉద్యోగమునందు అభివృద్ధి గృహమందు వివిధ శుభకార్యములు జరుగును. విశేషముగా ధనవ్యయం

అగును. అంత్యమున జాతకునకు శరీర అనారోగ్యం కలుగును. జప శాంతులు చేయించి ఔషధసేవ చేయుటవలన ఈ కష్టం శాంతించును.

37నుండి 49 సంవత్సరముల మధ్యకాలంలో అనేక విధములుగా లాభం కలుగును. విశేషంగా ప్రయాణములు చేయుదురు. అనేక ధర్మ కార్యములు చేయుదురు.

50 నుండి 60 సం॥రముల పర్యంతం భూలాభం, పుత్రపౌత్రాది సౌఖ్యం, పుణ్యదేశ సంచారం కీర్తివృద్ధియు కలుగును.

60 నుండి 70 సం॥ల పర్యంతం నానావిధ భోగభాగ్యములను అనుభవింతురు. మిగిలిన కార్యములను విడచి దైవకార్యములు చేయుచు కాలం గడిపెదరు.

70వ సంవత్సరమున మరణించి తిరిగి ఉత్తమ వంశమందు జన్మించెదరు.

# 61 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహసంపత్తిగల జాతకులు అందమైన వారు, మంచికీర్తి, మంచివాక్కు కలిగి ఉంటారు. కులశ్రేష్ఠులగుదురు. కొన్ని కారణాలవల్ల వీరి వ్యవహారములలో ఇతరులతో శత్రుత్వమేర్పడి మానసిక విచారం కలుగును.

ఈ జాతకులు ఎప్పుడు రాజకార్యములతో కూడి ఉంటు రాజాదరము గౌరవము పొందుదురు. వీరు ధైర్యవంతులు, అనేక విద్యలయందు నేర్పరులై ఉందురు. ఒకానొక గుప్తరోగములవలన శరీరబాధను పొందుదురు.

1-2 సం॥లలో దంత సంబంధమయిన బాధ, జ్వరభయం కలుగును. 3-5 సం॥ల మధ్యకాలంలో వ్రణబాధలు తండ్రికి ధనలాభం విద్యారంభం అగును. జాతకునకు స్వల్పముగా శరీర అనారోగ్యం కలిగి ఔషధసేవ వలన శాంతించును.

5 నుండి 8 సంవత్సరముల పర్యంతం విద్యాభివృద్ధి కలుగుతూ తండ్రికి లాభం కలుగును. 9 నుండి 16 సంవత్సరముల కాలంలో గృహ మందు శుభకార్యముల రీత్యా విశేషధనం వ్యయమగును. ఈ కాలమందు విద్యాభివృద్ధియు, వాహనసౌఖ్యం కలుగుతాయి.

16నుండి 20 సంవత్సరముల మధ్యకాలంలో ఆ తరువాత 27 సంవత్సరముల పర్యంతం రాజగౌరవం, ధనలాభం విద్యార్జన పూర్తయి మంచి ఉద్యోగం లభించును. వివాహాది శుభకార్యములు జరుగును. దైవ యోగం వలన మిత్రలాభం కలుగును. అనేక ప్రయాణములు చేయుదురు. ధనలాభం పొందుదురు.

28 నుండి 35 సం॥ల మధ్యకాలంలో నూతన గృహలాభం, గృహమందు వివాహాది శుభకార్యములు జరుగును. చిన్న చిన్న కలతలు ఏర్పడినను తదనంతర కాలంలో అవి నివారించును.

35నుండి 42 సం॥లలో వాహన లాభం; ధనలాభం, భూలాభం కలుగును. వివాహాది శుభకార్యములు చేయుదురు.

43 నుండి 50 సం॥లలో ఉద్యోగమునందు పదవీలాభం, వాహనం నుండి పడుట జరుగును. 51-60 సం॥లలో కళత్ర విచారం, జాతకునకు శరీరం అనారోగ్యం కలుగును. అంత్యమున జాతకులు విశేషంగా తీర్థ యాత్రలు చేస్తారు.

61 నుండి 65 సం॥ల మధ్యకాలంలో నానావిధ ధర్మములతో, ద్రవ్యములతో కూడి కఫ వాతముతో పీడించబడి ఔషధసేవ వలన శాంతించును.

66 నుండి 75 సం॥లలో ధర్మమార్గములను, పరోపకారంతో తీర్థయాత్రలు చేస్తారు వైశాఖమాసమందు తదియ శుక్రవారం వృశ్చిక రాశియందు చంద్రుడు ఉండగా దేవలోకం పొందుదురు.

# 62 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతక చక్రముయొక్క ఫలితములను చెప్పుచున్నాను. జాతకులు పురుషార్థము విజ్ఞానము, ధనము, మంచికుటుంబము కలిగియుండురు. ఒకానొక సమయమున దుష్టజన స్నేహమును మందబుద్ధియు, చెంచలత్వమును, పరకాంతా శక్తియు కలుగును. బుద్ధి బలముచేత సర్వకార్యములను చేయుదురు.

1వ సంవత్సరమందు జ్వరభయమును, 2వ సంవత్సరమందుదంత పీడయు, 3-8 సంవత్సరముల మధ్యకాలంలో సోదర లాభం, విద్యారంభం, గురుప్రీతి తండ్రికి ధనలాభం కలుగును.

8 నుండి 10 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి ధనలాభం, గృహమందు శుభకార్యములు జరుగును. 11 నుండి 16 సంవత్సరములు అటు పిమ్మట 20వ సంవత్సరము వరకు దినదినాభివృద్ధిగా విద్యాభివృద్ధి కలుగును. నూతన వస్త్రభూషణ, వాహన లాభాదులు కలుగును.

21 నుండి 30వ సం॥రం పర్యంతం విద్యార్జన పూర్తయి అన్య దేశములో ఉపాధికలుగును, వివాహం జరుగును. పుత్రికాలాభం కలుగును. పంచమాధిపతిని పూజించిన సకలశుభములు వంశాభివృద్ధి కలుగును.

31 నుండి 40వ సం॥రం పర్యంతం కార్యమందు విఘ్నములు, గృహమందు విశేష ధనవ్యయం శరీర అనారోగ్యం కలుగును. అన్యదేశ సంచారమువలన మిత్రలాభం, ధనలాభం కలుగును.

41నుండి 50 సం॥రముల పర్యంతము ఉద్యోగ వ్యవహారములలో శత్రుత్వం కలిగి అంత్యమున ఈ శత్రువులే మిత్రులై ఉందురు. అంత్యమున గృహ భూ లాభం కలుగును.

51నుండి 60 సంవత్సరముల పర్యంతం పుత్ర పౌత్రాభివృద్ధి దైవ కార్యచరణం దాన ధర్మములు చేయుదురు. గృహమందు విశేషంగా శుభ కార్యములు జరుగును.

61నుండి 65 సం॥ల కాలంలో అటు తరువాయి 70 సంవత్సర ముల పర్యంతం తీర్థయాత్రలు చేయుటయు దైవభక్తి, నూతన గృహ నిర్మాణం ఇటువంటి ఫలితములు కలుగును.

అంత్యమున శరీరమును అనారోగ్యము పీడించును. ఈ సమయంలో మొత్తం కార్యములు విడిచిపెట్టి ధర్మమార్గమున సంచరించురు.

# 63వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహ సంపత్తిగల జాతక ఫలితములు ఎట్టిపనగా- వీరు బాల్యావస్థ స్వల్పసౌఖ్యమును, మధ్యావస్థయందు మధ్యమ ఫలితమును, అంత్యావస్థయందు సర్వసౌఖ్యములను పొందుదురు. జాత కులు న్యాయశాస్త్ర ప్రవీణులు, ఉదారబుద్ధి, బంధుజన ప్రీతి, ఇత్యాది సద్గుణములు పొందుదురు. జలాశ్రయములు పూలతోటలు మొదలగువాని యందు ప్రీతిని కలిగి యుందురు.

చోరులవల్ల నీటివలన భయం కలుగును. అభిమానవంతులు. కొంత కాలం నాస్తికులుగా ఉండి తిరిగి ఆస్తికులుగా మారెదరు. ఒకానొక సమ యమున మానభంగం అగునని విచారము అధికముగా పొందుదురు. దైవ భక్తివలన ఈ విచారములు నశించి శుభములు కలుగును. వ్యవహారము జయం కలుగును.

1వ సంవత్సర మందు ముఖపీడనము, 2వ సం॥రంలో దంత పీడ యును, 3-4 సంవత్సరములలో సోదర సోదరీ లాభం కలుగును. విద్యా రంభమగును.

5-11 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి లాభము, శుభములు కలుగును. విద్యాభివృద్ధి, వ్రణ సంబంధమయిన పీడలు కలుగును, అయితే ఇవి ఔషధ సేవ వలన శాంతించును. తండ్రియొక్క ధనం శుభకార్యముల నిమిత్తం ఖర్చు అగును. 8వ సం॥రంలో వాత సంబంధ పీడలు కలుగును.

9-12 సంవత్సరములలో తండ్రికి మానసిక విచారము పిమ్మట ధనలాభం, కీర్తివృద్ధియు కలుగును. ఆ తరువాత 13-20 సంవత్సరాలలో విద్యాభివృద్ధి, జ్ఞానవృద్ధియు కలుగుతాయి. ఈ కాలమంతయు సుఖసంతోషాలతో గడచును.

21 నుండి 30 సంవత్సరముల పర్యంతం మాతాపితృ సంబంధ విచారము కలుగును. వివాహాది శుభకార్యములు జరుగును. రూపలక్షణ సంపన్నమయిన పుత్రపుత్రికా లాభం కలుగును. ధనలాభం, వ్యవహార జయం కలుగును. అంత్యమున ముద్రాధికారమును పొందుదురు.

31 నుండి 40 సంవత్సరముల పర్యంతం ధనధాన్యలాభం. గృహమందు శుభకార్యములు చేస్తారు. తండ్రికి అనారోగ్యం కలుగును. ఔషధ సేవ వృథా అగును. తర్పణ, హోమాదుల వల్ల సకల శుభములు కలుగును.

41 నుండి 50 సంవత్సరముల పర్యంతము దినదినాభివృద్ధిగా ఉండును. గుప్త శత్రువేర్పడును. అందువల్ల మానసిక విచారము కలుగును. ఇతరదేశ ప్రయాణములు కలుగును.

51 నుండి 60 తదనంతరం 70 సంవత్సరముల పర్యంతం ధర్మకార్యాచరణం, పుత్రాభివృద్ధి గురించి ఆలోచనలు పరోపకారము చేయుదురు. శ్లేష్మవాత సంబంధ శరీర పీడ కలుగును. అంత్యమున చైత్రకృష్ణ పంచమి బుధవారం శ్రవణా నక్షత్రంలో చంద్రుడు ఉండగా, విష్ణులోకం పొందుదురు.

# 64 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహ సంపత్తి గల జాతకులు రాజ ద్వారమునందు ప్రతిష్ఠ కలిగియుందురు. వీరు కోపిష్టులగుదురు. మొదటి కాలములో కష్టమును, మధ్య వయస్సునందు మధ్యమ సౌఖ్యమును, అంత్యావస్థయందు సర్వసౌఖ్యములను పొందుదురు. ఈ జాతకులు పరోప కారపరాయణులు, విచక్షణతో సర్వకార్యములను చేయువారగుదురు. రాజ్యాధిపతిని పూజించినచో అధికారముగల ఉద్యోగము లభించును. మంచి వస్త్రములు, భూషణములు, సుందరమగు కళత్రం లభించును.

1 నుండి 8 సంవత్సరముల పర్యంతము శరీర అనారోగ్యమును, వ్రణసంబంధమయిన పీడ, ఉదర సంబంధమయిన పీడలు, విద్యాభివృద్ధి కలుగును.

9 నుండి 15 సంవత్సరాల పర్యంతం తండ్రికి ధనలాభం, విద్యా లాభం, ఇత్యాది కలుగుతూ, గృహమున శుభకార్యములు జరుగును.

16 నుండి 22 సంవత్సరములలో పరీక్షల యందు కృతార్థులై ఉద్యోగలాభం పొందుదురు. అనేక రూపములలో ధనలాభం కలుగుతుంది. గృహమందు వృద్ధమృత్యువు కలుగును. వివాహం జరుగుతుంది.

23 నుండి 30 సంవత్సరము పర్యంతము పుత్ర, పుత్రికా లాభం. అనేక విధములుగా ధనవ్యయం, స్వల్ప శరీర అనారోగ్యం గృహ, భూ, వాహనలాభములు కలుగును.

31 నుండి 40 సంవత్సరముల పర్యంతం దినదినాభివృద్ధిగా ధన లాభము; శుభకార్యముల నిమిత్తం ధన వ్యయము అంత్యమున ఉద్యోగ ములో భయము కలుగును. దీనికై జపాదుల ఆచరించుటవల్ల ఈ కష్టం నివారింపబడుతుంది. పిమ్మట నానావిధ వాహన లాభం కలుగును.

41 నుండి 50 సంవత్సరములలో దినోదినాభివృద్ధిగాగౌరవం కీర్తియు కలుగును. భూలాభం కలుగును. అంత్యమున శరీరం అనారోగ్యం కలుగును.

51 నుండి 60 సంవత్సరములలో జ్ఞాన మార్గావరణమును పుత్ర భాగ్యాది చింత శుభకార్యముల నిమిత్తం ధన వ్యయం. కొన్ని కారణాల వల్ల శత్రుపీడ ఇత్యాది బాధలు కలుగును.

60 నుండి 70 సంవత్సరములు అటు పిమ్మట 72 సంవత్సరముల పర్యంతం శ్లేషాధికం వలన శ్వాస కోస సంబంధమయిన పీడయు సమస్త కార్యములు విడచి దేవకార్యములందు పాల్గొనుటయు కళత్ర అనారోగ్య మును కలుగుచు అంత్యమున మాఘమాసములో శుక్ల పక్షమందు సప్తమి రోజున కృత్తికా నక్షత్రమందు చంద్రుడు ఉండగా నిర్యాణం కలుగును.

# 65 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతకులు బాల్యము మొదలు క్రమాభి వృద్ధిని కలిగియుందురు. పరోపకారము చేయుదురు. మధుర భాషణములు చేయగలవారు. విద్యావంతులు, మంత్రశాస్త్ర ప్రియులగుదురు. రెండు విద్యలను బాగుగా నభ్యసింతురు. ఇహపర సౌఖ్యములు అనుభవించు వారగుదురు.

1వ సంవత్సరమందు ఆసన సంబంధమయిన పీడయు, రెండవ సంవత్సరమందు ఉదరపీడయు, 3 నుండి 9 సంవత్సరంల పర్యంతము తండ్రికి ధనలాభం, సోదర సోదరీయోగం, విద్యారంభం, గృహమున శుభ కార్యములు జరుగును. అటుపిమ్మట సామాన్యముగా గడచును.

9 నుండి 12 సంవత్సరముల పర్యంతము అటుపిమ్మట 16 సం॥ల పర్యంతము వస్త్రభూషణ లాభం, భూలాభం, ధనలాభం కలుగును. తండ్రికి స్వల్ప అనారోగ్యం కలుగును.

16 నుండి 22 సంవత్సరముల పర్యంతము ఉద్యోగ లాభం, కళత్రలాభం కలుగును. వివాహాది కార్యక్రమములు జరుగును. సంతాన సౌఖ్యం కలుగును. మాతృ విచారము పొందుదురు. దుష్టగ్రహములను పూజించుచు ఔషధసేవ చేయుటవలన సకల శుభములు కలుగును. రాజ కార్యముల మూలకముగా అన్యగ్రామ సంచారము చేయుదురు. తండ్రి యొక్క ధనం, శుభకార్యముల మూలకముగా వ్యయమగును.

31 నుండి 40 సంవత్సరముల పర్యంతం నూతన వాహన వస్త్ర లాభం, రాజ్యకార్యములందు అభివృద్ధియు, దినదినాభివృద్ధిగా ధనలాభం కలుగును. వాతపిత్త సంబంధమయిన శరీర అనారోగ్యం కలుగును. ఔషధసేవ చేయుటవలన ఈ కష్టం నివారించబడును.

41 నుండి 50 సంవత్సరముల పర్యంతం పుత్రి, పుత్రికా వర్గం వారికి శుభవైభవములు కలుగును. ఒకానొక పెద్ద కార్యాచరణము వలన మానసికోత్సాహం కలుగును. గృహమందు అనేక కారణాలవల్ల అధిక ధనవ్యయం కలుగును. అంత్యమున జాతకునకు శరీర అనారోగ్యం కలుగును.

51 నుండి 60 సంవత్సరముల పర్యంతము ఉచ్ఛపదవి లభించుటయు, అప్రయత్నముగా ధనలాభము కలుగును. అంత్యమున అధిక ధనవ్యయం చేయుదురు.

60 నుండి 70 సంవత్సరముల పర్యంతం దాసదాసీజనుల యొక్క, పుత్ర పౌత్ర వర్గంవారియొక్క సుఖము, తీర్థయాత్రాఫలితము మొదలగునవి లభించును. ఆ తరువాయి కాలంలో కార్తీకమాసమందు త్రయోదశి గురువారం రోజున అశ్వినీ నక్షత్రమందు మేషరాశిలో చంద్రుడు ఉండగా నదీతీరమందు నిర్యాణం కలుగును.

# 66 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహసంపత్తిగల జాతకులు అద్వితీయైశ్వ ర్యమును, ఉత్తమ గుణములను కలిగియుందురు. పరోపకారము చేయుచు దేశవిఖ్యాతకీర్తి నార్జింతురు. సర్వదా మంచి కార్యములు, విద్యా వినయం కలిగియుందురు. వీరి జీవితంలో మొదటి భాగం రాజవృత్తితోను, రెండవ భాగం సాత్విక వృత్తుల నవలంబింతురు. తోటలు, పుష్పవాటికలు మొదలగువానియందు ప్రీతి కలిగి యుందురు. ఉద్యోగరీత్యా ఒకసారి శత్రుత్వ మేర్పడును. అంత్యమున శత్రునాశనం పొందుచు జయమును పొందుదురు, బాల్యమునందు అల్పకష్టములు కలిగినను కొన్ని దానముల వల్ల సర్వశుభములు కలుగును.

1వ సంవత్సరమందు విరోచన సంబంధమయిన బాధలు, రెండులో దంత పీడలు, 3-8 సంవత్సరముల మధ్యకాలములో సోదర లాభం, తండ్రికి ఉద్యోగమునందు అభివృద్ధి, విద్యారంభం, తండ్రికి ధనలాభం కలుగును.

9-14 సంవత్సరముల కాలంలో గృహమందు శుభకార్యములు, నానావిధ భోగభాగ్యములు, సంతోషోత్సాహమును విద్యయందు పారితోషికములను పొందుదురు.

15-23 సంవత్సరములలో తండ్రికి ధనలాభం, జాతకునకు విద్యా ప్రాప్తియు కలుగును, ఉద్యోగలాభము, ధనలాభము, కీర్తి, ఇత్యాదులు కలుగును. మేనమామలకు ధనలాభం, సంతోషం, ఉద్యోగలాభం కలుగును. అంత్యమున శరీర అనారోగ్యము కలుగును. 24 నుండి 32 మధ్యలో ఉద్యోగాభివృద్ధియు, ధనలాభము కలుగును. వివాహాది శుభ కార్యములు పుత్రి కన్యాలాభములను, గృహమందు యితర శుభకార్య ములు జరుగును.

32-39 సం॥రముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా గృహవాహన లాభము, ఇతర దేశములు, దూరప్రాంతముల ప్రయాణములవల్ల, ధన లాభము గృహమందు అనేక విధములుగా ధనవ్యయం అగును. నూతన గృహనిర్మాణం చేయుదురు.

40-47 సంవత్సరములలో సంతానాభివృద్ధి కరమయిన కార్యములు చేయుదురు. అంత్యమున సంతాన వర్గంవార్కి అనారోగ్యం కలుగును.

48-55 సం॥రముల కాలంలో ధర్మమార్గంలో ధనం వ్యయం చేస్తారు. కీర్తి కలుగును. కళత్రమునకు అనారోగ్యం కలుగును. తిరిగి ఆరోగ్యం కలుగును. రాజద్వారమందు జయం కలుగుతుంది. 56-63 సంవత్సరముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా ఉండును.

64-72 సంవత్సరముల మధ్యకాలంలో అధిక ప్రతిష్ఠకలిగి అంత్యమున అధిక అనారోగ్యం కలుగును. కళత్రనష్టము జరుగును. ఆతరువాయి కాలంలో జేష్టశుద్ధ త్రయోదశి గురువారం స్వాతీనక్షత్రయుక్త తులారాశి యందు దేహత్యాగం చేయుదురు.

# 67 వ కథ

శ్రీ గణాధిపతయేనమః ఇట్టి గ్రహసంపత్తి కలిగిన జాతకులు ఉత్తమ వంశమందు జన్మించెదరు, అధికమయిన జ్ఞానముకలవారు, మంచివారని పేరుగాంచినవారు, ఇహలోక సౌఖ్యమనుభవించెదరు [illegible] ధనాఢ్యులు, కృషికర్మలయందు తేర్పులు, అల్పశిరోజములు కలిగియుందురు. పరోపకార్యములందు నేర్పుగలవారు, [illegible] చమత్కారంగా మాట్లాడుదురు. బాల్యావస్థయందు అనారోగ్యము కలుగును.

1 నుండి 5 సంవత్సరముల పర్యంతము, నేత్రసంబంధమయిన బాధలు, జ్వరబాధలు [illegible] దినదినాభివృద్ధిగా [illegible]

ధనలాభం కలుగును. విద్యాభివృద్ధి కలుగును. 5వ సంవత్సరమందు తండ్రికి అనారోగ్యము కలుగును.

7 నుండి 16 సంవత్సరములలో విద్యాభివృద్ధి. విద్యామూలకంగా ధనం కలుగును. మూడు విధములుగా విద్యలనభ్యసించెదరు. కాలానుగుణమయిన దేశీయవిద్యలందు ప్రవీణత కలిగియుందురు. వస్త్ర వస్తుభూషణ లాభం కలుగును.

17నుండి 20 అటుపిమ్మట 24 సంవత్సరములు పర్యంతరం విద్యాభ్యాసం పూర్తవుతుంది. ఉద్యోగలాభం కలుగుతుంది. స్త్రీ పుత్రసౌఖ్యము, గృహభూలాభం కలుగుతాయి. మొదటి సంతానం అల్పజీవం కలిగి ఉంటుంది.

25 నుండి 35 సం॥ల మధ్యకాలంలో ప్రభుత్వ ఉద్యోగాభివృద్ధియు ధనలాభము, సర్వకార్యములందు నేర్పును గలిగియుందురు. వ్యాపార మూలకముగా, ఉద్యోగమూలకముగాని ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. గృహమందు అనేకశుభకార్యములు జరుగుతాయి,

36 మొదలు 40 అటుపిమ్మట 50 సంవత్సరములు పర్యంతము అనేక శుభకార్యములు అనేకవిధమయిన లాభములు కలుగుతాయి. దేశదేశాంతరకీర్తి కలుగును. ఉద్యోగరీత్యా అన్యదేశ ప్రాంతములు/దేశములు ప్రయాణములను చేయుదురు. అచ్చటకీర్తిపేరుప్రతిష్ఠలు మొదలగువాటిని సంపాదిస్తారు.

51నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో అనేక సౌఖ్యములు కలుగుతాయి. జ్ఞానమార్గ సమాచారము కళత్రపీడయు కలుగుతాయి.

61 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో కుమారునికై కార్యభారము విడచి సర్వకార్యములనుండి విముఖులగుదురు. ప్రజోపయోగ నిర్మాణములు చేసి అచ్చట నివాసము చేయుచు భగవద్భక్తితో నుందురు. 80 సం॥రం ఆయువు గలిగి అంత్యమున దేవలోకమును పొందుదురు.

# 68 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహసంపత్తిగల జాతకులు కుటుంబం నందు అధిక అనురాగమును కలిగి ఉంటారు. విలాసవంతులు, నృత్యగీత వాయిద్యాది వినోదములకు అధికముగా ధనం ఖర్చు చేయువారగుదురు. ఇతరులకు సహాయం చేయుటకు ఉత్సాహం చూపుతారు. వ్యవహారములు చేయుటయందు నేర్పుగలిగి వుందురు. వాహనసౌఖ్యమును గలిగి ఉందురు.

ఒకటవ సంవత్సరమందు దృష్టి సంబంధమయిన బాధలు, ఉదర సంబంధమయిన పీడలు కలుగుతాయి. మూడవ సంవత్సరమందు మాతృ కష్టమును, అంత్యమును తండ్రికి ధనలాభమును, రాజద్వారమందు భయ మును, వాహన సౌఖ్యం కలుగును. 4, 5, 6, సం॥లలో గృహమందు శుభకార్యములును, విద్యాభివృద్ధియు, తండ్రికి కీర్తి కలుగుతాయి.

8-16 సం॥ల మధ్యకాలంలో విద్యాభివృద్ధియు, వస్త్ర భూషణ, వాహన లాభములను, పాఠశాలయందు పారితోషికములను పొందుట యును, అంత్యమున తండ్రికి అనారోగ్యం కలుగుతాయి. దీనికై ఔషధ సేవ, దాన ధర్మములను చేయుటవలన తండ్రికి ఆరోగ్యం కలిగి ధనవృద్ధి కలుగుతుంది.

19నుండి 25 సం॥ల మధ్యకాలంలో విద్యాభ్యాసం పూర్తగును. ఉద్యోగలాభం కలుగును. అనేక విహారయాత్రలు చేయుదురు సౌఖ్య ముల కొరకు ధనం విశేషంగా ఖర్చుచేయుదురు. వివాహం జరుగుతుంది. యోగ్యమయిన కళత్రం లభిస్తుంది. సంతోషంతో పగలు రాత్రి అనే భేదం లేకుండా సంతోషంగా కాలం గడుపుతారు. పిమ్మట సంతాన సూచనలు కలుగుతాయి, అంత్యమందు మితభాషియగు మిత్రలాభం కలుగును.

26-32 సం॥ల మధ్యకాలంలో ఉద్యోగరీత్యా దూరప్రాంతములలో

ఉండుట, ధనలాభం, ఉద్యోగాభివృద్ధియు ధనధాన్యలాభం కలుగును, పిమ్మట ఉద్యోగస్తులతో ఏర్పడిన శత్రుత్వమువలన భయవిచారములు కలుగును. జపదానములు చేయుటవలన ఈ కష్టం శాంతించును.

33-40 సం॥ల మధ్యకాలంలో ఉద్యోగాభివృద్ధియు గృహమందు నానా విధములయిన శుభకార్యములు నూతనవస్త్ర, భూషణ లాభములు స్వల్పభయమును శత్రువులే మిత్రులగుట, పుత్రజన్మం కలుగును. అంత్య మున గృహమందు వృద్ధమృత్యువు గలిగి ధననాశనం కలుగును.

40-45 సం॥ల కాలంలో ఉద్యోగంనందు అధిక అభివృద్ధి, అన్ని రంగాల జయం, వంశాభివృద్ధి కీర్తి వృద్ధి, 51-60 సం॥రల మధ్యకాలంలో కుటుంబంతో సంతోషంగా గడుపుటయు, అంత్యమున కఫవాతముచే శరీర అనారోగ్యం కలిగి ఔషధ సేవ వలన దినదినాభివృద్ధిగా ఉండగలరు.

61-69 సం॥ల మధ్యకాలంలో సుఖదుఃఖములు సమానముగా ఉండును. ఈ సంవత్సరములో వైశాఖ ద్వాదశి గురువారం ఉత్తరాషాఢ నక్షత్రంనుంచి చంద్రుడు ఉండగా దేవలోకం పొందుతారు.

## 69 వ కథ

శ్రీ గణేశాయనమః శ్రేష్ఠమయిన గ్రహసంపత్తిగల జాతకచక్రోయి యొక్క ఫలితములు ఎల్లశగా జాతకులు మంచి పేరు గలిగి ఉంటారు. ఎల్లప్పుడు స్వాతికంగా [illegible]. కుటుంబమునందు అధిక వాత్సల్యము కలిగి ఉంటారు. [illegible], [illegible] మంచి మనస్సు కలిగి ఉందురు. జీవితంలో మొదటి భాగమునందు అధిక సౌఖ్యమును, రెండవ భాగములో మధ్యమ సౌఖ్యమును, అంత్యమునందు కఫాధిక్యముచేత శరీర అనారోగ్యమును [illegible] ప్రమాదములు లేదా ఎత్తయిన ప్రదేశముల నుండి [illegible]

1-4వ సంవత్సరముల మధ్యకాలంలో శ్వాసకాసాది రోగములవల్ల భయము, మూడవ సంవత్సరమందు సోదరీలాభము, తల్లికి అనారోగ్యం కలుగును. విద్యారంభం అగును.

4-8 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి అధిక ధనలాభమును, దేవతాగురుదర్శనము, విద్యార్జన కలుగును.

9-15 సంవత్సరముల మధ్యకాలంలో ధనలాభము, విద్యాభివృద్ధి, గృహమందు వివాహాది శుభకార్యములు జరుగుతాయి. తండ్రికి అన్ని వ్యవహారములందు జయము, నూతన వస్త్రభూషణ లాభములు, పాఠశాల యందు పారితోషికములు లభించును.

16-25 సంవత్సరముల మధ్యకాలంలో సంతోషముగా కూడి ఉందురు. విద్యార్జన పూర్తవుతుంది. కొంతకాలం విహారయాత్రలతో సంతోషముగా కాలం గడుపుదురు. ఉద్యోగప్రాప్తి అవుతుంది. ప్రథమంలో చిన్న చిన్న ఉద్యోగాలు చేయుదురు. తదనంతరకాలములో స్థిరమయిన 25-30 సంవత్సరముల కాలంలో ఉద్యోగాభివృద్ధి, వివాహం జరుగుతుంది, జాతకునకు తొలిగర్భం నసిస్తుంది. కళత్రమునకు అనారోగ్యం కలుగుతుంది. పిమ్మట తండ్రికి ధనలాభం కలుగుతుంది. మాతృ పితృ విచారము కలుగుతుంది.

31-40 సంవత్సరముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా ఉంటుంది గృహమందు అనేక శుభకార్యములు జరుగుతాయి. స్వకులము లేదా అన్య కులము వారితో శత్రుత్వమేర్పడుతుంది, అనేక నూతన పరిచయములు కలుగుతాయి. ఒకస్త్రీతో ఏర్పడిన పరిచయం అనురాగముగా మారుతుంది. దీనివల్ల మానసిక అశాంతి తద్వార శరీర అనారోగ్యం కలుగుతాయి.

41-50 సంవత్సరముల మధ్యకాలంలో ఆర్థికమగు కీర్తియు, దినదిన భాగ్యాభివృద్ధి కలుగుతాయి. 51-60 సంవత్సరముల మధ్యకాలంలో

నానావిధ సౌఖ్యములు అనుభవిస్తారు. పుత్ర, పౌత్రాదులకు వివాహాది శుభ కార్యములు చేస్తారు. 61-70 సంవత్సరముల మధ్యకాలంలో కఫ సంబంధ మయిన అనారోగ్యముల బారిన పడుదురు. అయితే ఔషధసేవ, దాన ప్రసాదాలవల్ల కొంత ఫలితం కలుగుతుంది. 75 సం॥రముల వయస్సులో స్వకుటుంబంతో ఉంటూ దేహత్యాగం చేస్తారు.

# 70వ కథ

భృగు మహర్షి ఈ జాతకుని జాతక కధను ఈ విధంగా తెలియ జేస్తున్నారు. శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహ సంపత్తి గల జాతకులు అధికమగు ఐశ్వర్యమును ఎల్లప్పుడు సంతోషమును, మంచి సంతానమును కలిగి యుందురు. జాతకులు కీర్తివంతులు, గుణవంతులు, కులశ్రేష్టులు, విశేషమయిన విద్యార్జన లేకపోయినప్పటికి మంచి జ్ఞానవంతులై ఉందురు. వీరెల్లప్పుడు మానసికముగా బాధపడుతూ ఉంటారు. వీరికి విశేషంగా వాహన సౌఖ్యం, భూలాభం పొందుతారు. ఆకస్మిక ఉపద్రవములవలన అధిక ధనలాభం కలుగును. ఒకటి రెండు సంవత్సరములలోను, 8-12 సంవత్సరములలోను శరీరఅనారోగ్యం, విద్యాలాభం కలుగును. జాతకులు ఎల్లప్పుడు నృత్య గీతాదులతో కూడి ఉండి విలాసం కొరకు ధనవ్యయం చేయుదురు. ఇతరులకు సహాయంచేయు స్వభావం గలవారు. ప్రభుత్వ వ్యవహారములందు గౌరవమును పొందుదురు.

1-2 సంవత్సరములలో ఉదర సంబంధమయిన వ్యాధులను, మూడవ సంవత్సరమందు ధనలాభం కలుగును.

4-7 సంవత్సరముల కాలంలో విద్యాభివృద్ధి, మాతృపీడ కలుగును.

8-16 సంవత్సరముల కాలంలో విద్యాభివృద్ధి, పితృలాభం, ధన లాభం కలుగును. మరియు గృహమందు శుభకార్యములు జరుగును. స్త్రీల ద్వారా ఉత్సాహమును పొందుదురు.

17-25 సంవత్సరముల కాలంలో సంతోషములతో రాత్రింబవళ్ళు కాలమును గడుపుదురు. విద్యార్జన పూర్తయి ఉద్యోగాభివృద్ధి కలుగును.

26-32 సంవత్సరముల ఉద్యోగ వ్యవహారములలో ఇతరదేశ ప్రయాణములు, తన్మూలక ధనలాభం, సౌఖ్యము కలుగుతాయి. అచట శత్రుభయం వల్ల నానావిధ విచారములు కలుగుతాయి. అయితే భగవత్ ప్రార్థనల వల్ల శాంతి జప, హోమాదుల వల్ల ఈ కష్టములు తొలగి సర్వసౌఖ్యములు కలుగుతాయి, ఆకస్మిక ధనలాభం కలుగును.

33-40 సంవత్సరముల మధ్యకాలంలో గృహమందు అనేక శుభ కార్యములు జరుగుతాయి. నూతన వ్యక్తుల పరిచయం అవుతుంది. కొంత మంది మిత్రులతో శత్రుత్వం ఏర్పడుతుంది. తద్వార శత్రుభయం కలుగు తుంది, శత్రువులు మిత్రులు అవ్వడం తర్వాత కాలంలో సర్వకార్యము లందు జయం కలుగుతుంది.

40 నుండి 50 సంవత్సరముల పర్యంతము ఉద్యోగములందుఉత్తమ లాభం పదవీ గౌరవం, ఉద్యోగ వ్యవహారములలో గౌరవం, శుభకార్య ముల నిమిత్తం ధన వ్యయం తప్పక కలుగును, అంత్యమున పుత్ర, కళత్ర వర్గం వారికి అనారోగ్యములు ఏర్పడి ధన వ్యయమగును. తిరిగి ధన ధాన్య లాభం కలుగును.

51-60 సంవత్సరము మధ్యకాలంలో సంతానమునకు వివాహాది శుభకార్యములు, జరుగుతాయి. పౌత్రాదుల జననం వల్ల వారితోటి దాస దాసీజనంతోను కూడి ఉందురు. అటు తరువాత ధర్మకార్యములు చేయుట, తీర్థయాత్రాది ఫలితములు జరుగును. అంత్యమున శరీర అనారోగ్యం కలిగి, ఔషధసేవ వలన శాంతించును. 65వ సంవత్సరం వరకు సర్వకార్య ములు చేసి ఆ తరువాత ఈ బాధ్యతలనుండి తప్పించుకొని ప్రశాంతమైన జీవితం గడుపుతూ 70 సంవత్సరాలలో ఉత్తమ లోకమును పొందుదురు.

16)

# 71 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహసంపత్తిగల జాతకులు లోకములో అధికమయిన భాగ్యమును కలిగి ఉందురు. ఉదారస్వభావులు, గుణవంతులు సత్కీర్తి కలవారు, సాధారణ విద్యకలిగినవారు, అనేక వ్యవహారము లందు నేర్పరులు. వాహనాది సౌఖ్యం, భూలాభం, ఆకస్మిక ధనలాభం పొందుదురు. అనుకోని అవాంతరములవల్ల అధిక ధనవ్యయం చేయు దురు. ఈ జాతకునకు ప్రతి సంవత్సరం క్రమముగా అభివృద్ధి కలుగును. అంత్యమున వ్రణ సంబంధమయిన పీడలు కలుగును.

ఈ జాతకులు డాంబికముగా విలాసం కొరకు ధనవ్యయం చేస్తారు. పరోపకారమందు ప్రీతి, నానావిధ ధనలాభం, వాహన లాభమును కలిగి యుందురు.

1వ సంవత్సరమందు ముఖసంబంధమయిన పీడలు, రెండవ సంవ త్సరమందు దంతపీడ, 3వ సంవత్సరమందు సోదర సోదరీలాభం, 4వ సంవత్సరమందు తండ్రికి ధనలాభం కలుగును. విద్యారంభం అగును.

5 నుండి 8 సంవత్సరములలో గృహమందు శుభకార్యములను, విద్యాభివృద్ధియు తండ్రికి ధనలాభం కలుగును.

8-16 సంవత్సరములలో విద్యాభివృద్ధి విద్యామూలక- పారితోషిక ములు పొందుట తండ్రికి ఐశ్వర్యాభివృద్ధి, నూతన వస్తు వస్త్రభూషణాది లాభమును గృహమందు శుభకార్యములు కలుగును. పాఠశాలలో ఆట పాటలందు, విద్యయందు విశేషమయిన కృషి చేయుదురు. అనేక విధమైన సౌఖ్యములు అనుభవింతురు.

17 నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభ్యాసం పూర్తయి ఉద్యోగాభివృద్ధి సన్మిత్రలాభం కలుగును. అనేక విహార యాత్రలు చేస్తారు.

26 నుండి 32 సంవత్సరములలో ధన ధాన్యలాభం, వాహన సౌఖ్యం ఉద్యోగమూలక ధనలాభం కలుగును. వివాహం జరుగుతుంది. కళత్ర సౌఖ్యం వలన దివారాత్రములు నిమిషతుల్యముగా గడుస్తాయి. ఉద్యోగము నందు ఒక శత్రువు ఏర్పడును. స్వల్పకష్టము కలుగును. ఆకస్మికముగా ధనవస్త్ర భూషణాది లాభములు కలుగును. అన్యదేశ సంచారము వలన ధనలాభం కలుగును.

33 నుండి 40 సంవత్సరముల వరకు పుత్రాభివృద్ధి, సౌఖ్యం, కీర్తి ఉద్యోగాభివృద్ధి వినోద విహారాది కార్యక్రమములలో పాల్గొందురు. నూతన వ్యక్తుల పరిచయం, అనుకోని విధంగా ధనవ్యయం జరుగుతాయి.

40-50 సంవత్సరముల మధ్యకాలంలో వ్యాపారమూలక ధన లాభం, ఉద్యోగంలో మంచి పేరు గలిగియుందురు. వివాహాది శుభకార్యముల మూలకముగా ధనవ్యయం కలుగును.

51 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో పుత్రపౌత్రాదులతో ఆనందముగా కాలం గడుపుతారు. ఒకానొక ప్రాణివలన స్వల్పవిచారం కలుగుతుంది. తీర్థయాత్రలు చేయుదురు. కఫాధిక్యము వలన శరీర అనారోగ్యం కలుగును,

61 నుండి 69 సంవత్సరముల కాలంలో సుఖ దుఃఖములతోను, కుటుంబముతోను సత్కాలక్షేపం చేస్తూ వైశాఖ బహుళ మందు గురువారం ఉత్తరాషాఢ నక్షత్రమందు ముక్తి కలుగును,

# 72 వ కథ

ఇట్టి గ్రహసంపత్తిగల జాతకులు సర్వప్రాణులందు దయ కలిగి ఉంటారు. వ్యవహారము పరిష్కరించుటయందు నేర్పు కలిగి ఉంటారు. కుటుంబమంటే వాత్సల్యం కలిగి ఉంటారు, వీరు తరచు ప్రయాణములు చేస్తుంటారు, ఏఏ కాలంలలో అనుభవించవలసినవి ఆయా కాలములలో అనుభవిస్తారు. వీరు ధనము, బుద్ధియు, ఖ్యాతి శాంతి కలిగియుందురు.

1 నుండి 5వ సంవత్సరములలో జరుగు ఫలితములు పరిశీలించగా 1వ సంవత్సరమందు సంపద, 2వ సంవత్సరమందు ముఖపీడయు, 3వ సంవత్సరంలో విరోచన సంబంధమయిన బాధలు, తల్లికి అనారోగ్యం కలుగును. తండ్రికి ఆకస్మిక ధనలాభం కలుగును. 4వ సంవత్సరంలో విద్యారంభం, వ్రణసంబంధమయిన బాధలు కలుగును. 5వ సంవత్సర మందు అంత్యమున తండ్రికి అనారోగ్యం కలుగును. 6, 7వ సంవత్సర ములలో ఆటపాటలతో కాలమంతయు గడచును.

8వ సంవత్సరముల నుండి 16 సంవత్సరములలో తండ్రికి వ్యవ హారమూలకముగా ధనలాభం, భూలాభం కలుగును. దినదినాభివృద్ధిగా విద్యాలాభం కలుగును.

17 నుండి 25వ సంవత్సరముల మధ్యకాలంలో విద్యాభ్యాసము పూర్తగును. ఉద్యోగలాభం కలుగుతుంది. వివాహం జరుగుతుంది. ఈ కాలమంతయు కళత్రప్రీతి వంటి సుఖములు కలుగును. గృహమందు అనుకోని కారణాలవల్ల ధనవ్యయం జరుగుతుంది.

26 నుండి 34 సంవత్సరముల మధ్యకాలంలో నానావిధసౌఖ్యములు నానావిధ ద్రవ్యలాభములు కలుగుతాయి. పుత్రలాభం కలుగుతుంది. వివాహేతర సంబంధాలు ఏర్పడతాయి. గృహమందు వివాహాది శుభకా ర్యములు, ప్రభుత్వ వ్యవహారములందు జయంజరుగుతుంది, ధనలాభం కలుగుతుంది.

35 నుండి 42 సంవత్సరముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా ఉంటుంది. కీర్తియు, ధనలాభం కలుగుతుంది. నూతన వస్త్ర వస్తు భూషణలాభం కలుగుతుంది. కొన్ని వ్యవహారములందు ముఖ్యులతో శత్రుత్వం ఏర్పడుతుంది. అయితే అంత్యములో శత్రువులే మిత్రువు లవుదురు.

43 నుండి 50 సంవత్సరముల కాలంలో భూలాభమును, నూతన గృహనిర్మాణము, వాహన లాభం కలుగును. వివిధ ధార్మిక సంస్థలలో పాల్గొని ప్రజోపయోగ నిర్మాణములు చేపట్టెదరు. ఫలపుష్పాదులయందు ప్రీతిని కలిగి ఉందురు.

50 నుండి 58 సంవత్సరములలో ధన ధాన్యాభివృద్ధియు సర్వ సౌఖ్యములను కలగజేయును. పుత్ర పౌత్రికులకు వివాహాది శుభవ్యవ హారములు జరుగును. పౌత్రజననం జరుగును. శుభకార్యముల వలన ధనవ్యయం జరుగుతుంది.

59 నుండి 70 సంవత్సరముల కాలంలో వాహనసౌఖ్యములు, ధన దానధర్మాది కార్యక్రమములు అమలు జరుపుతారు. అంత్యమున చైత్ర మాసంలో రేవతీ నక్షత్రముతో కూడిన సోమవారంనాడు మోక్షం పొందు తారు.

## 73 వ కథ

శ్రీగణేశాయనమః ఈ జాతక చక్రమువందలి గ్రహములన్ని శుభస్థితిలో నుండుట చేత జాతకులు ఎల్లప్పుడు శుభచింతనలతోను, శుభకార్యములతోను, వినయ వివేకములతోను సంచరింతురు. మరియు ఈ జాతకులు మంచిగా మాటాడువారు, భోగభాగ్యములు పొందువారగు దురు. అనేక సుఖములు అనుభవించుదురు. అయితే పూర్వజన్మలో చేసిన పాపకృత్యం వల్ల సంతాన సుఖం ఉండదు.

1-2 సంవత్సరములలో ఉదర సంబంధమయిన పీడలు, ముఖ పీడయు, ఆసన సంబంధమయిన పీడలు కలుగును. 3-4 సంవత్సరములలో తల్లికి కొంత అనారోగ్యం చేయును. 5-8 సంవత్సరముల కాలంలో విద్యారంభం, క్రీడలలో గాయాలు తగులుట, తండ్రికి ఆకస్మిక ధనలాభం కలుగును.

9నుండి 16 సంవత్సరములకాలంలో వాహన లాభం కలుగును. నూతన వస్త్ర భూషణ లాభం కలుగును. ఈ కాలమంతయు విద్యాభ్యా సంతో కాలం గడచును.

17 నుండి 25 సంవత్సరముల కాలంలో ఉద్యోగలాభం తప్పక పొందుదురు. కీర్తి వృద్ధి కలుగుతుంది. వివాహాది శుభ కార్యములు జరుగును.

26 నుండి 33 సంవత్సరములకాలంలో అల్పజీవనం కలిగిన సంతానం కలుగుతుంది. ఈ దోష నివారణకై పంచమాధిపతిని శాస్త్రోను సారం పూజించిన లాభం కలుగును. ఈ కాలంలో ఉద్యోగనందు మంచి అభివృద్ధిని పొందుతారు. ధనలాభం కలుగుతుంది.

34 నుండి 42 సంవత్సరముల మధ్యకాలంలో స్వజాతియందు శత్రుత్వ మేర్పడి మానసిక చింత ఏర్పడును. 43 నుండి 54 సంవత్స రములకాలంలో గృహమందు అనేక శుభకార్యములు జరుగును. గృహ నిర్మాణం చేయుదురు. అనేక విధములుగా ధన సంపాదన చేస్తారు.

53 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో భూలాభం, పుత్ర కష్టం వలన విచారం కలుగును. ఇతర ప్రదేశమునందు ఔషధసేవచేయుట వలన పుత్రునకు ఆరోగ్యం కలుగును.

61 నుండి 70 సంవత్సరంల కాలంలో సంతానంతో, ధర్మమార్గంలో చరిస్తూ తీర్థయాత్రలు చేస్తారు. 75 సంవత్సరంలో కృష్ణపక్షమియందు చతుర్దశి శుక్రవారం రోజున బంధుజనుల సమక్షంలో నిర్యాణం కలుగును.

# 74వ కథ

ఈ జాతక చక్రమందలి గ్రహములు ఈ జాతకునకు విలాసవంత మయిన జీవితం, మధురమయిన వాక్కు, పరోపకారత్వం, మంచి సంపద కలగజేసినవి. బాల్యమధ్యావస్థలయందు అల్పమగు కష్టములు పొందుదురు. శాస్త్రవిద్య బాగా అభ్యసిస్తారు. స్వజనులకు సంతోషం కలుగజేయుదురు. గురుదేవతా భక్తిని కలిగియుంటురు.

1 వ సంవత్సరంలో జ్వరభయం, 2వ సంవత్సరంలో ఉదర సంబంధమయిన పీడ, సోదర సోదరీ లాభంను 4-8 సంవత్సరముల మధ్యకాలంలో విద్యాలాభం, తండ్రికి ధనలాభం. గురువుల ప్రీతితో విద్యా భ్యాసం చేయుదురు. అనేక పురస్కారములు ధనరూపమగు పారితోషి కములు పొందుదురు.

8 నుండి 16 సంవత్సరకాలంలో దినదినాభివృద్ధిగా విద్యాలాభం కలుగును. వస్త్రభూషణాది లాభములు కలుగును. ఆటపాటలతో ఈ కాల మంతయు గడచును.

17నుండి 25 సంవత్సరములలో తండ్రికి విశేష ధనలాభం కలు గును. జాతకునకు విద్యాభివృద్ధి కలుగుతుంది. ఉద్యోగములో చేరుతారు. వస్త్రభూషణాది లాభములు కలుగుతాయి. ఇదే సమయంలో తల్లితండ్రులకు అనారోగ్యం కలుగుతుంది.

26 నుండి 34 సంవత్సరముల మధ్యకాలంలో నానావిధ సంపదలు కలుగుతాయి. బహుదానదాసీజనసేవయు స్వల్ప విచారమును, గృహ మందు అధిక ధనవ్యయం అవుతుంది, స్త్రీ మూలక ధనలాభం కలుగును.

35 నుండి 41 సంవత్సరముల మధ్యకాలంలో నూతన గృహ నిర్మాణం వంటి కార్యక్రమములు చేపడతారు. ఉద్యోగమందు ఉన్నత పదవులు పొందుతారు.

42 నుండి 50 సంవత్సరముల మధ్యకాలంలో మంచి కీర్తి పొందు తాడు కొన్ని వ్యవహారములతో కొందరితో శత్రుత్వం ఏర్పడుతుంది. అయితే తదనంతర కాలంలో ఈ కష్టములు తొలగి సుఖశాంతులు పొందుదురు.

51 నుండి 60 సంవత్సరముల కాలంలో పుత్ర, పౌత్రాది సుఖము, వివాహాది శుభకార్యములు చేస్తారు. తీర్థయాత్రలు చేస్తారు. వాహన సుఖం కలుగుతుంది.

61 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో అనేక సుఖ భోగములు అనుభవిస్తూ బంధుజనులతో కూడి ఉంటూ దేవలోకమును పొందుతాడు.

# 75 వ కథ

శ్రీగణేశాయనమః ఇట్టి గ్రహ సంపత్తి గల జాతకులు దీర్ఘకాల సుఖములను, శుభములను, కీర్తి, ధనము, సద్గుణములు కలిగియుందురు. అయితే ఒకానొక సమయమందు దైవయోగం వలన చెడుతలంపులు ధనవ్యయం కలుగును. పదభ్రష్టత్వము కలుగును. ఈ కష్టములు ఏ విధముగా కలిగిననూ అనుష్ఠానం చేస్తున్నపుడు వివస్త్ర అయిన స్త్రీని చూచుట వలన ఈ కష్టము కలిగినది. తగిన పూజాదులు, శాంతులు చేసి అన్నదానం చేయుట వలన ఈ కష్టములు తొలగును.

1వ సంవత్సరమందు నేత్ర సంబంధ పీడలు, 2వ సంవత్సరంలో ముఖ, దంత పీడలు, జ్వర భయము 3వ సం॥లో సోదరీలాభం, 4వ సంవత్సరమందు విద్యారంభం, తండ్రికి ఆకస్మిక ధనలాభం, కుటుంబంతో కలసి తీర్థయాత్రలు చేయుదురు.

9 నుండి 16 సం॥రంలలో వ్రణ సంబంధమయిన పీడలు కలు

గును. గృహమందు శుభకార్యములు జరుగును. విద్యాభివృద్ధి, విద్యా మూలక ధనలాభం, నూతన వస్త్ర వస్తు భూషణ లాభములు కలుగును.

17 నుండి 25 సంవత్సరంలో కుమతత్వము కలుగుచు ధననాశనం అవుతుంది. సిగ్గును విడచి కఠినంగా మాట్లాడుదుదు. దుష్టమిత్ర సహ వాసం, ముఖ్యమైనవారితో విరోధమును పొందుతారు. అంత్యమున స్థిర మయిన మనస్సు కలిగి సర్వకష్టములు తొలగును.

26 నుండి 38 సంవత్సరముల మధ్యకాలంలో వివాహం జరుగును వ్యవహారజయం, దినదినాభివృద్ధిగా సంపదలు కలుగును. అన్యదేశ సంచారం కలుగును. అంత్యమున శరీర అనారోగ్యం కలుగును.

39 నుండి 50 సం॥ల పర్యంతం గృహమందు నానావిధ శుభ కార్యములు భూలాభం, ధనలాభం, కలుగును. ఉద్యోగమందు పదోన్నతి కలుగును.

51 నుండి 60 సంవత్సరములలో మహైశ్వర్యము,మహోత్సాహం శుభకార్యముల మూలకముగా ధనవ్యయం, పుణ్యకార్యములు చేయుదురు సాధు, భాగవత జనులతో కూడి ఉందురు.

61 నుండి 70 సంవత్సరముల కాలంలో రాజకీయముగా ఇతర దేశ ప్రయాణములు, శరీర అనారోగ్యం కలుగును. భగవంతుని ప్రార్థిం చుట వలన (శ్రీ విష్ణు సహస్రనామం) సకల శుభములు కలిగి ఆరోగ్యం కలుగుతుంది. 80 సంవత్సరముల వయస్సులో విష్ణులోకం పొందుతారు.

# 76 వ కథ

ఇట్టి గ్రహసంపత్తిగల జాతకులు పూర్ణాయువును, విద్యావినయాది గుణములను కలిగియుందురు. శ్రేష్టమయిన వంశమందు జన్మించి ఐశ్వ ర్యముతో కూడి ఉంటారు. ఇతరుల కార్యములందు ప్రీతినికలిగి ఉంటారు

విశాల వక్షస్థలమును నేత్రములను కలిగి ఉందురు. విలువగల వస్త్రములు భూషణములు ధరించెదరు. మంచి స్నేహధర్మం కలిగియుందురు. దైవ భక్తి, గురుభక్తి కలిగి ఉందురు.

1వ సం॥రమందు జ్వరభయమును, 2 వసం॥రమందు ఉదరపీడను, 3 వ సంవత్సరంలో నేత్రపీడను, సోదరసోదరీ లాభమునుకలిగి ఉందురు. 4 నుండి 7 సంవత్సర కాలంలో విద్యాభివృద్ధి, వ్రణసంబంధ పీడలు; గృహమందు శుభకార్యములు నూతన వస్త్రభూషణ లాభమును కలిగి యుందురు,

8 నుండి 16 సం॥రంల కాలంలో తండ్రికి ఆకస్మిక ధనలాభం, ధనధాన్యాభివృద్ధి, పశువృద్ధి, వాహనసౌఖ్యం ఇత్యాది లాభములు కలుగును. పరీక్షలయందు జయం, అంత్యమున శరీర అనారోగ్యం కలుగును.

17 నుండి 27 సం॥రంల కాలంలో దానధర్మాదులు చేయుదురు. భూలాభం కలుగును, విద్యాభ్యాసం పూర్తయి, ఉన్నత విద్యలు చేయుదురు. ఉద్యోగలాభం కలుగును. ఉద్యోగమందు గౌరవం పొందుదురు. వివాహం జరుగుతుంది. సంతాన సూచనలు, అధికసౌఖ్యం, అధిక లాభం తప్పక పొందుదురు.

28 నుండి 38 సంవత్సరంల కాలంలో సంతానయోగం, కళత్రానికి అనారోగ్యం ఏర్పడును. ఔషధసేవ వలన ఈ కష్టం శాంతించును. ఈ కాలమంతయు ప్రశాంతంగా గడచును.

39 నుండి 47 సంవత్సరముల కాలంలో భూమూలక ధనలాభం, గృహలాభం, సంతానమునకు శుభకార్యములు చేయుదురు. అనేక విధములయిన లాభములు కలుగుతాయి. దినదినాభివృద్ధిగా గృహమందు సకల అభివృద్ధిగా ఉండును.

48 నుండి 60-సంవత్సరముల మధ్యకాలంలో కళత్రనష్టము వలన విచారం కలుగును. శరీరఅనారోగ్యం పితృనష్టం వంటివి కలుగును.

చిన్నచిన్న కష్టములు ఏర్పడినను జపదాన, శాంతుల వలన సకల శుభ ములు ఆరోగ్యం కలుగును.

61 నుండి 69 సంవత్సరముల మధ్యకాలంలో మంచిపేరు, అధిక ఉత్సాహం, అనేక సౌఖ్యములు కలుగును. సత్కార్యములు చేయుదురు. అన్నదానం విరివిగా చేయుదురు. పుత్ర పౌత్రాదులు, బంధువులు, స్నేహితులు మొదలగు వారితో కూడియుండి దేవలోకమును పొందుదురు.

# 77వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతక చక్రమందలి శుభగ్రహములు జాతకునికి మంచిలక్షణములు, భాగ్యమును కలుగజేయుదురు. శత్రు మిత్రులను సమముగా చూచెదరు, మంచి విజ్ఞానము కలిగియుందురు. అనేక మిత్రులను ఇద్దరు భార్యలు, పుత్రికా, పుత్రులు కలిగియుందురు. వీరి జీవితంలో 3 కష్టములు సంభవించును. దీనికైనానా విధ ధర్మములు చేసిన శాంతించును.

1వ సంవత్సరమందు ఆసన సంబంధమయిన పీడయు, 2వసం॥ర మందు ఆసన సంబంధ పీడయు, ముఖ పీడను, 3సం॥రంలో వ్రణముల తోను బాధపడుదురు. 4 సం॥రంలో విద్యారంభం తండ్రికి ధనలాభం కలుగును. గృహమందు అనేక శుభకార్యములు జరుగును.

6 నుండి 14 సంవత్సరంల కాలంలో గణితశాస్త్రాభ్యాసం, దిన దినాభివృద్ధిగా విద్యాలాభం, గృహమందు శుభములు, స్వల్పంగా అనారో గ్యములు కలుగును, అదే విధంగా తల్లితండ్రులకు అనారోగ్యం కలుగును. దేవీ పూజ చేయుట వలన ఈ కష్టముల శాంతించును.

15 నుండి 23 సం॥రంల కాలంలో పరీక్షలయందు జయం, గణిత శాస్త్రాభ్యాసం, ఉన్నత విద్య నభ్యసింతురు. 24 నుండి 35 సంవత్సరంల మధ్యకాలంలో అధికోత్సాహం, అధికలాభం, విద్యాభ్యాసం పూర్తయి

మంచి ఉద్యోగంలో చేరుతారు. వివాహాది శుభయోగములు, మంచి సంతానం కలుగును. వ్యవహారములలో విజయం కలుగును. స్వకుల మందు లేదా అన్యకులమందు శత్రుత్వం ఏర్పడును. తద్వారా మానసిక విచారం కలుగును. ఇదే కాలమందు నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడుతుంది.

36 నుండి 45 సంవత్సరాల కాలంలో మాతృ విచారం కలుగును. భూలాభం ధనలాభం, కలుగును, విశేషంగా ధనవ్యయం జరుగును. గృహ మందు బంధుజన సమాగమం చెందుతారు. గృహ నిర్మాణం చేస్తారు.

45 నుండి 55 సం॥ల కాలంలో ఉద్యోగంలో ప్రతిష్ఠ, అధికో త్సాహం, ధనధాన్య సమృద్ధి కలుగుతాయి. అంత్యమున కళత్ర విచారం కలుగుతుంది.

56 నుండి 75 సంవత్సర కాలంలో సుఖముగ నుందురు. అంత్యమున శ్వాసకోప రోగముల వలన బాధలు కలుగును. 76 సం॥ రంలో ఈ లోకంను విడిచిపెట్టెదరు.

# 78 వ కధ

శ్రీగణేశాయనమః ఈ జాతకులు గుణవంతులు, ధనవంతులు, ప్రజ్ఞావంతులు, దేవుని యెడల, సాధువుల యెడల, ప్రీతిని కలిగియుందురు సమస్త వస్తు సంపదను కలిగియుందురు. సభలయందు మాట్లాడు నేర్పు కలిగియుందురు. విచక్షణ కలిగియుందురు. రాజద్వారమందు ఖ్యాతియు, రాజమూలక ధనలాభం కలిగియుందురు.

1వ సం॥రమందు నేత్రసంబంధమయిన పీడయు, 2వ సంవత్స రంలో జ్వరపీడయు, 3వ సం॥రంలో వ్రణ సంబంధపీడయు, సోదర లాభముసు కలుగును. ఇదే సమయంలో తండ్రికి విశేష ధనలాభం కలుగుతాయి, 4వ సం॥రమందు విద్యారంభం, రాజకార్యమూలకంగా

తండ్రికి ఇతర దేశ ప్రయాణమును గృహమందు శుభ కార్యములు జరుగును.

6 నుండి 15 సం॥రంల కాలంలో విద్యాభివృద్ధి, అధిక కష్టములు కలుగును. స్వల్పంగా తండ్రికి కష్టం కలుగును. అయితే తరువాత కాలంలో తండ్రికి ధనలాభం, దినదినాభివృద్ధిగా విద్యాలాభం గలుగును. విద్యామూలక పారితోషికములు లభించును. వాహనలాభం, రత్నలాభం కలుగును.

16 నుండి 25 సంవత్సరంల కాలంలో అధికసౌఖ్యం రాజమూలక ధనలాభం కలుగును, విద్యాభ్యాసం పూర్తయి ఉద్యోగలాభం కలుగును.

26 నుండి 34 సం॥రంల కాలంలో ప్రభుత్వ ఉద్యోగంలో ప్రవేశింతురు. అధికలాభం, అన్యస్త్రీ ప్రీతియును, ఈ ప్రీతి వలన అధిక ధన వ్యయం కలుగును. అంత్యంలో వివాహాది శుభకార్యములు జరుగును. వీరు ఈ కాలమందే నూతన గృహ నిర్మాణం చేయుదురు.

35 నుండి 45 సంవత్సరంల కాలంలో అనేక భోగభాగ్యములు అనుభవిస్తారు. అధికంగా ధనవ్యయం చేస్తారు. వాహనలాభం, ధనలాభం కలుగును. కళత్రమునకు అనారోగ్యం కలుగును. ఔషధాదుల, జపశాంతులు ఆచరించుట వలన ఈ కష్టములు నివారణ అగును.

46-నుండి 55 సంవత్సరంల కాలంలో ఐశ్వర్యము, మానకీర్తియు, మహాలాభం కలుగును. ఉద్యోగం నిర్వహణలో అనేక దూర ప్రయాణములు చేయుదురు. కుటుంబంలో వివాహాది శుభకార్యముల వల్ల అధిక ధనవ్యయం అగును. పూర్వకర్మానుసారంగా అనారోగ్యం కలుగును. కాని ఔషధసేవ వలన శాంతించును.

56 నుండి 65 సంవత్సరంల కాలంలో అనేక సుఖములు అనుభవిస్తారు. సాధారణంగా జీవిస్తూ 74 సంవత్సరములలో దేవలోకమును పొందుదురు.

# 79 వ కథ

ఈ జాతకమునందుగల గ్రహములు శుభగ్రహ దృష్టిని కలిగి ఉండుటచే తప్పక ఐశ్వర్యవంతులగుదురు. మంచి దైవభక్తి కలిగి ఉందురు. రాజవిద్యాభ్యాసమును చేయుదురు. మంచి పేరు కలిగి ఉందురు. విలాసముల అనుభవించుటయందు ఆసక్తి కలిగి యుందురు. సమస్త కార్యములందును నేర్పును కలిగియుందురు. మంచి బుద్ధియు జ్ఞానమును కలిగియుందురు. మంచి పూర్ణాయువు కలిగియుందురు.

1వ సం॥రమందు జ్వరభయమును, 2వ సం॥రంలో ముఖపీడయు, 3వ సంవత్సరంలో ప్రాణసంబంధమయిన పీడను, తండ్రికి ధనలాభం కలుగును తల్లికి అనారోగ్యం కలుగును. పువ్వులు దానమిచ్చుటవలన శాంతించును.

4 నుండి 12వ సంవత్సరములలో విద్యాలాభం, తండ్రికి ధన లాభం కలుగును.

13 నుండి 23సం॥రంలో విద్యాలాభం, పరీక్షలయందు జయం కలుగును. తండ్రికి దినదినాభివృద్ధిగా ఉండును. గృహమందు శుభకార్యములు జరుగును. ఉన్నతవిద్య నభ్యసిస్తారు.

24 మొదలు 34 సం॥రంలలో విద్యార్జన పూర్తయి ఉద్యోగలాభం కలుగును. వివాహం జరుగుతుంది. యోగ్యమైన కళత్రం వస్తుంది. పెద్ద వ్యాపారములు చేస్తారు. సంతానయోగం కలుగును. వివిధ సుఖములు అనుభవిస్తారు. అంత్యమున శరీరమునకు అనారోగ్యములు కలుగును.

35 మొదలు 45 సం॥రంల పర్యంతరం శుభకార్యములు మూలకంగా ధనవ్యయం జరుగును. ఇతర దేశముల నుండిగాని ఇతర దేశ ప్రయాణములవలన ధనలాభం కలుగును. మంచి మిత్రుల పరిచయం కలుగుతుంది. అంత్యమున కళత్రమునకు అనారోగ్యములు కలిగి శాంతించును.

46 మొదలు 55 సంవత్సరములలో తండ్రికి కష్టాధిక్యం [illegible]

శరీర కష్టం కలుగును. జాతకునకు దినదినాభివృద్ధిగా కీర్తి, ధనము కలుగును. సకుటుంబ సమేతంగా తీర్థయాత్రలు, విహారయాత్రలు చేయుదురు.

56 నుండి 65 సం॥రములలో జగద్విఖ్యాతి కీర్తియు, అధికోత్సాహము గృహమందు శుభకార్యములు జరుగును. ప్రజోపయోగ కార్యక్రమాలవల్ల అధిక ధనవ్యయం చేయుదురు. అంత్యమున మిత్రులే శత్రువులై స్వల్ప నష్టం కలగ జేయుదురు, ఈ విధంగా చిరకాలం జీవించి 75 వ సంవత్సరములో సద్గతి పొందుతారు.

# 80 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతక చక్రమందలి గ్రహములు, బలిష్ఠముగా నుండుటచే జాతకులు మంచి సంపాదనపరు లగుదురు. నానావిధ కళలయందు నేర్పరులగుదురు, ఇతరదేశములందు ప్రీతిని కలిగియుందురు. మంచి మాట, పరోపకారత్వం ఉంటాయి. వీరికి అక్రమ సంబంధాలుంటాయి.

1వ సం॥ర మందు జ్వరభయమును, 2వ సం॥రంలో సాధారణ అనారోగ్యములు, 3 వ సంవత్సరమందు వ్రణసంబంధమయిన పీడలు కలుగుతాయి. విద్యారంభం కలుగుతాయి, 5 నుండి 10 సం॥రములో విద్యార్జన, తండ్రికి రాజమూలక ప్రయాణమును, ధనలాభం కలుగును. గృహమందు శుభకార్యములు జరుగుతాయి.

13 నుండి 20 సం॥రంలో విద్యామూలక పారితోషికములు పొందుతారు. తండ్రికి అనారోగ్యములు కలుగును. అయితే శీఘ్రముగా అరోగ్యము కలుగును. అంత్యమున శుభకార్యములు మూలకముగా ధనవ్యయము భూలాభం తప్పక జరుగును.

21 నుండి 27 వ సంవత్సరములలో వివాహమును, విద్యార్జనలు

పూర్తయి ఉద్యోగలాభం పొందగలరు. సంతాన లాభం కలుగును. నానా విధ సౌఖ్యములు, భోగములు పొందుదురు.

28 నుండి 36 సంవత్సరముల మధ్యకాలంలో సంతాన లాభము గృహమందు శుభకార్యములు, స్వల్ప శరీర అనారోగ్యం కలుగుతాయి. రాజద్వారమందు జయం, నానావిధ శుభములు తప్పక కలుగును.

37 నుండి 49 సంవత్సరముల పర్యంతము గృహంలో శుభకార్యముల వలన అధిక ధనవ్యయం కలుగును. దాసదాసీజన సేవయు, వాహన లాభం, భూషణలాభం కలుగును.

50 నుండి 60 సంవత్సరములలో ధనధాన్య లాభం, భూ లాభం, గృహలాభం, రత్న భూషణ లాభము ఇత్యాదివి కలుగును.

60 నుండి 70 సం॥రల పర్యంతము నానావిధ సౌఖ్యములు, పొందుతూ పూర్వపుణ్యానుసారం దేవలోకం పొందుతారు.

# 81 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతకుని యొక్క జన్మ పత్రిక యందలి గ్రహముల స్థితివలన సౌందర్యముగా ఉందురు. మంచి కీర్తి పొందుదురు. భూ మూలకముగా ధనలాభం పొందుదురు. దుర్జనులతో స్నేహితము కఠినంగా మాట్లాడుదురు. రాజద్వారం నందేర్పడిన శత్రుత్వము వలన మానసిక చింత కలుగును, జాతకులు అధిక ధైర్యము కలిగియుందురు. ఉన్నత విద్యను అభ్యసిస్తారు. అనేక విషయములందు ప్రీతిని కలిగి యుందురు. వీరు తరచు అనారోగ్యం మానసికచింత ఎక్కువ అవుతాయి.

1-2 సం॥రంలలో దంత సంబంధమయిన పీడ, జ్వర భయము కలుగును. 3వ సంవత్సరమందు సోదర, సోదరీ లాభం, ఈ జాతకునకు వ్రణసంబంధమయిన పీడ కలుగును. 4 వ సంవత్సరమందు విద్యారంభం జరుగుతుంది.

5-8 సం॥రంలలో తండ్రికి అకస్మిక ధనలాభం, విద్యావృద్ధియును కలుగును.

9-15 సం॥రల పర్యంతము గృహమందు అనేక శుభకార్యములు జరుగును. గీతా వాయిద్యాది వినోద ఘోషయును, విద్యాభివృద్ధియు, పరీక్షలయందు కృతార్థులగుటయు ఇత్యాదివి కలుగును.

16 నుండి 20 సంవత్సరముల పర్యంతము రాజద్వారమందు తండ్రికి జయం, విద్యార్జన సాధారణంగా ఉంటుంది. ఇదే సమయంలో ఒక మంచి మిత్రలాభం కలుగును. రాజమూలకంగా ధనలాభం కలుగుతాయి.

21 నుండి 27 సం॥రముల కాలంలో విద్యార్జన పూర్తయి వివాహం జరుగుతుంది. ప్రథమ సంతానం అల్పాయువు కలిగియుండును. కళత్రం అనారోగ్యం కలిగి ఉంటుంది. ఔషధసేవ చేయుటవలన ఇది శాంతిస్తుంది.

28 నుండి 35 సం॥రంల మధ్యకాలంలో నూతన గృహనిర్మాణం స్త్రీ మూలక ధనలాభం, నానావిధ సౌఖ్యములు కలుగును. 35 నుండి 42 సంవత్సరముల పర్యంతరము నానావిధ వాహన, భూసౌఖ్య, భూ లాభములను, వాటిచే ధనవ్యయం జరుగుతాయి.

43 నుండి 50 సం॥రం మధ్యకాలంలో రాజద్వారమందు ఉచ్చపదవి కలుగును. ఈ సంబంధంచే నానావిధమయిన లాభములు, సౌఖ్యమును కలుగుతాయి. 51 నుండి 60 సం॥ల పర్యంతరం పౌత్రజననం, కళత్ర విచారం కలుగుతాయి. దినదినాభివృద్ధిగా లాభమును కలుగును. పుత్ర పౌత్రాది వర్గముతో ఆనందముగా కాలం గడుపుతారు.

61 నుండి 65 సం॥రల పర్యంతరం నానావిధ సౌఖ్యములు ధర్మ కార్యములతోను కూడియుండురు. 66 నుండి 75 సం॥ల మధ్యకాలంలో తీర్థయాత్రల ఫలితమున, దేశాటన కలుగును. ఆ తరువాయి కాలంలో వైశాఖమాసమందు కృష్ణపక్షములో తదియ శుక్రవారం రోజున వృశ్చిక రాశి యందు చంద్రుడు ఉండగా ప్రాతఃకాలమందు నిర్యాణం కలుగును.

# 82 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతక చక్రఫలమును, శ్రద్ధాభక్తులతో వినుడు. ఇందలి గ్రహములు బలిష్టముగా ఉన్నవి. ఈ జాతకుడు సర్వజనులతో ఇష్టంగా మాట్లాడువాడు, విజ్ఞానవంతుడు, ఒకనొక సమయంలో మందబుద్ధి కలిగియుండురు. శ్రేష్టమయిన కాలమందు మందబుద్ధిపోయి జ్ఞానము ప్రతిష్ఠ కలుగును. జాతకులు సుఖములు, వస్త్ర భూషణ, వాహనాదులకై ఎక్కువగా ధనం ఖర్చు చేస్తారు. కుటుంబ వ్యవహారములందు అధికమయిన ఆసక్తి చూపిస్తారు.

1వ సంIIరమందు జ్వరభయమును, 2వ సంIIరమందు దంతపీడ, గృహమందు శుభకార్యములు, 4వ సంIIర మందు విద్యారంభం 5 మొదలు 7 సంIIరాల కాలంలో జలభయం గురుభక్తి కలుగుతాయి. తండ్రికి విశేష లాభం కలుగును. దైవకార్యముల నిమిత్తం ధనవ్యయం చేస్తారు.

7 నుండి 16 సంIIర పర్యంతం విద్యాభ్యాసం చక్కగా జరుగుతుంది. గాన విద్యాకౌశల్యం కలుగును. 17 నుండి 20 సంవత్సరాల కాలంలో దినదినాభివృద్ధి, విద్యావ్యాసాంగములతో గడుస్తుంది. 21 నుండి 25 సంIIరాల కాలంలో విద్యాభ్యాసం పూర్తగును. నూతన ఆప్తమిత్ర లాభం కలుగును. పితృవిచారము కలుగును. ఇతర దేశములలో ఉపాధి ఏర్పడుటవలన అనేక కష్టములు నివారించబడును. 26 నుండి 30 సంవత్సరాల మధ్యకాలంలో వివాహం జరిగి సంతానలాభం కలుగును.

31 నుండి 35 సంవత్సరాలు ఆ తరువాత 40 సంవత్సరాల పర్యంతము స్వల్పశరీర అనారోగ్యం, గృహమందు వృద్ధమరణంవల్ల మానసిక చింత కలుగును, ధనాదాయం బాగుంటుంది.

41 నుండి 50 సంIIరాల మధ్యకాలంలో కొన్ని ముఖ్యవ్యవహారములలో శత్రుబాధ కలుగుతుంది. అంత్యమున శత్రుబాధ తొలగి గృహ-భూలాభములు కలుగును.

50 నుండి 60 సంIIరాల మధ్యకాలంలో ధనాభివృద్ధి, గృహమందు

శుభకార్యములు, పుత్రపౌత్రాది సుఖం, తీర్థయాత్రలు దైవభక్తి కలిగి ఉందురు.

వాతాధిక్యం వలన శ్వాసకోస సంబంధమయిన పీడ కలుగుతుంది.

70-80 సం॥రాల మధ్యకాలంలో సమస్త కర్మలను విడచి ధర్మ కార్యములు చేయుచు ప్రాణమును విడిచెదరు.

# 83 వ కథ

శ్రీ గణేశాయనమః ఇటువంటి గ్రహసంపత్తిగల బాలికలు బాల్యమునందు సామాన్య సౌఖ్యమును, పిమ్మట మధ్య వయస్సునందు అధిక సౌఖ్యం పొందుదురు. జాతకులు ఉదారచిత్తం, న్యాయశాస్త్రాభ్యా సమును, ధనధాన్యములతో కూడి ఉందురు. ఈ జాతకులకు చోరభయం, జలభయం కలుగును. వీరు అధిక దైవభక్తి కలిగియుందురు. పూర్వ కర్మానుసారం వీరు ఒక అపవాదం ఎదుర్కొంటారు. తదనంతర కాలంలో దైవానుగ్రహంవల్ల ఈ చింతలు తొలగి శుభములు కలుగును. రాజద్వారమందు శుభములు కలుగును.

1-2 సం॥రమందు ముఖపీడయు, 3-4 సం॥రల మందు సోదర, సోదరీ జననం, తండ్రికి ఆకస్మిక ధనలాభం కలుగుతుంది.

5-8 సం॥రముల మధ్యకాలంలో విద్యార్జనలో కాలం గడుస్తుంది. 8వ సంవత్సరంలో అనారోగ్యం కలిగి దాన, జపాదులవల్ల పూర్ణాయువు కలుగును.

9-12 సం॥రముల మధ్యకాలంలో అ తరువాయి 20 సం॥రముల పర్యంతము పరీక్షలయందు కృతార్థులగుట రాజద్వారమందు పారితోషిక ములు మూలకంగా ధనలాభం కలుగుతుంది. ఈ కాలమంతయు విద్యార్జ నతో గడుస్తుంది.

21 నుండి 25 సం॥రముల కాలంలో 30 సం॥రముల పర్యంతము మాతాపుత్రు సంబంధమయిన విచారం, ఉద్యోగలాభం, రాజగౌరవం

కలుగుతాయి. వివాహం జరుగుతుంది. పుత్రికాలాభం, ధనలాభం కలుగుతాయి.

31 నుండి 35, ఆ తరువాత 40 సంవత్సరముల మధ్యకాలంలో ధన ధాన్యాభివృద్ధి, సోదర సోదరీ వారికి వివాహాది శుభకార్యములు చేయుటవలన ధనవ్యయం అవుతాయి. తండ్రికి శరీరపీడ కలుగును. గృహవాహన లాభములు, కీర్తి కలుగును, 41 నుండి 50 సం॥రముల మధ్యకాలంలో ధనధాన్యాభివృద్ధి స్వల్పవిచారం, దారద్వారం నుండి శత్రు భయం కలుగుతాయి.

51 నుండి 60 సం॥రముల మధ్యకాలంలో శృతి స్మృతి మొదలగు జ్ఞాన వృద్ధియు, పుత్రాభివృద్ధియు పరకార్యాచరణం తీర్థయాత్ర ఫలితం చేకూరును.

61 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో శ్లేష్మ వాతముల వలన శరీర పీడ కలిగి దేహత్యాగం చేయుదురు.

అంత్యమున దైవభక్తి కలిగి పుత్ర, పౌత్రాది వర్గంతో కూడి శ్రావణమాసం పంచమి బుధవారం చిత్తానక్షత్రం తులారాశినందు చంద్రుడు వుండగా దేహత్యాగం చేస్తారు.

# 84వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతకులు సుందరులు, మంచి నేత్రములు, విశాలమయిన ఫాలభాగం కలిగియుందురు, వ్యవహారము చేయుటయందు నేర్పరులై ఉందురు. కోపిష్టివారై ఉంటారు. వీరు గోపాల సహస్రనామ స్తోత్రమును పఠించిన యెడల శాంతయుక్తులగుదురు. మొదటి అవస్థ యందు కష్టమును, రెండవ అవస్థయందు మధ్యమ ఫలితమును, అంత్యమున సర్వసౌఖ్యములు అనుభవింతురు.

వీరెప్పుడు చేసే పనియందు విష్టను, పరోపకారమును చేయుదురు. ప్రభుత్వోద్యోగము చేయుదురు. వీరు అందరితో సౌమ్యంగాను, సంతోషముతోను మాట్లాడుదురు, దుష్టగ్రహ ప్రభావం వలన శరీరబలం తగ్గును. శాంతి, జప ధానాదులవల్ల ఈ కష్టములు తొలగును.

1-8 సం॥రంల మధ్యకాలంలో తండ్రికి ధనలాభం, జాతకునకు వ్రణసంబంధమయిన పీడలు, ఉదరరోగం, సోదర సోదరీయోగం విద్యారంభం, ఆటపాటలయందు నేర్పు కలిగి ఉంటారు. మిత్రలాభముంటుంది.

9-15 సం॥రముల కాలంలో స్వల్పకష్టం పితృలాభం కలుగును. విద్యార్జనలో కాలం గడచును. 16-22 సం॥రముల కాలంలో విద్యార్జన పూర్తగును. కృషిమూలకముగా ధనలాభం కలుగును. ఈ కాలమంతయు సాధారణంగా గడుస్తుంది.

23-30 సం॥రముల పర్యంతము వివాహలాభం, పుత్ర, పుత్రిక లాభమును, జాతకునకు స్వల్ప శరీర అనారోగ్యమును, వాహన భూషణాది లాభమును కలుగును.

31-40 సం॥రముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా లాభం, దానధర్మఫలసంగ్రహం, రాజద్వారమునుండి భయం కలుగుతుంది. ఆ తరువాయి కాలంలో అంటే రెండవ భాగంలో వాహన లాభం, గృహ లాభం కలుగును.

41-50 సం॥రముల మధ్యకాలంలో కీర్తియు, భూలాభం కలుగుతాయి. కొంత అనారోగ్యం బారిన పడుదురు. ఔషధసేవ వలన ఇది శాంతించును. 51-60 సం॥రముల మధ్యకాలంలో పుత్రాభివృద్ధి, పర కార్య ప్రీతియు, శుభకార్యముల మూలకంగా ధనవ్యయం, సత్కీర్తి కలుగుతాయి.

60-70 సం॥రాల కాలంలో సర్వకార్యములనుండి తప్పుకొని దైవ భక్తితో ఉందురు. కళత్రి వివాదం కలుగును. అంత్యమున శ్వాసకాన వలన మాఘమాసమందు శుక్లసప్తమి రోజున వృషభ రాశియందు చంద్రుడుండగా దేహత్యాగం చేయుదురు.

## 85 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహ సంపత్తి గల జాతకులు బాల్యం నుండియు అభివృద్ధిని కలిగియుందురు. ఈ జాతకులు దేవతాగురుభక్తిని కలిగి యుందురు, ఈ జాతకులు విద్యావంతులు మంత్ర, తంత్రములందు

ప్రీతిని కలిగి ఉంటారు. ఈ జాతకులు ఇహ పరలోక సౌఖ్యములను పొందుదురు. జాతకులు సర్వ ధర్మములు చక్కగా పాటించెదరు వీరు ఇతరులను గౌరవించుచు తాము గౌరవించబడెదరు.

మొదటి సంవత్సరము ఆసన సంబంధమయిన పీడను, మాతృ కష్టము (అనారోగ్యం) కలుగును, 2, 3, 4వ సంవత్సరములలో సోదర సోదరీ లాభమును, విద్యారంభమును, తండ్రికి అధిక ధనలాభమును, జాతకునకు శరీర అనారోగ్యం కలుగును.

9 మొదలు 12 సంవత్సరములలో ధనధన్యాభివృద్ధి, గృహమందు శుభకార్యములు, వాహనలాభం, విద్యాలాభం కలుగును. 12 నుండి 22 సం॥ల పర్యంతము విద్యామూలకముగా కీర్తివృద్ధి కలుగును. విద్యార్జన పూర్తవుతుంది. వ్యవహారములు సమర్థవంతంగా చేయు నేర్పు కలిగి ఉంటారు. ధనలాభం కలిగి ఉంటారు.

23 నుండి 30 సం॥ల మధ్యకాలంలో ఉద్యోగరీత్యా దూరప్రాంతాలలో ఉండుట, వివాహం జరుగును. కళత్రమూలకంగా ధనలాభం కలుగుతుంది. సంతానం కలుగుతుంది. అలంకరణలకై విశేషంగా ధనం ఖర్చు చేయుదురు. సంతానం యొక్క ఆరోగ్యం కొంత ఆందోళన కలిగిస్తుంది.

31 నుండి 40 సం॥రంల పర్యంతము నూతన వస్త్ర వాహన భూషణలాభం, రాజకార్యములందు జయం, దినదినాభివృద్ధిగా ధనలాభం, వాతపిత్త సంబంధమయిన శరీరపీడ కలుగును. జప దానములు చేయుట ద్వారా ఈ కష్టం నివారించబడును. చివరలో కీర్తి, ధనలాభం కలుగును.

41 నుండి 60 సం॥రల పర్యంతము వీరి జీవితంలో ఉన్నతమయిన కాలం అనయాసముగా ధన సంపాదన చేయుదురు, ఇదే విధముగా అనేక శుభములు కలుగును. ఇదే సమయంలో జ్వరభయం కలుగుతుంది. శుభ కార్యముల నిమిత్తం ధన వ్యయం చేస్తారు.

61 నుండి 70 సం॥రల పర్యంతము పుత్రపౌత్రిక సౌఖ్యమును, దాసదాసీజనవృద్ధియు, తీర్థయాత్ర ఫల సంగ్రహం కలుగును. అంత్యమున నదీ తీరమందు కార్తీకమాసంలో శుక్లపక్షమున త్రయోదశి గురువారం అశ్వని నక్షత్రమందు మరణం కలుగును.

# 87 వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతకులు కుశలులు - మంచి జ్ఞానం కల వారు, మంచి దైవభక్తి కలవారుగా ఉంటారు. ఇహ సౌఖ్యమును పొందు దురు. యుద్ధ కార్యములందు నిపుణత్వం కలిగి ఉంటారు. వీరు స్త్రీవచ నానుసారం సంచరింతురు. అధికమయిన బలం, స్వల్పశిరోజములు కలిగి యుందురు. సభలలో నుపన్యసించు శక్తిని కలిగియుందురు. బాల్యం నందు అనారోగ్యముచే పీడించబడుదురు.

1 మొదలు 7వ సంవత్సరం పర్యంతం నేత్రపీడయు, పిత్రులాభం, విద్యాలాభం, తల్లికి శరీర అనారోగ్యం, గృహమందు శుభకార్యముల మూలకముగా ధనలాభం కలుగును.

8 నుండి 16 సం॥రంలలో విద్యామూలకంగా ధనలాభం, మూడు రకముల విద్య నభ్యశించుటయు, రాజనీతి మొదలగు వానిని నభ్యసిం తురు. నూతన వస్త్రలాభములు కలుగును. మంచి క్రీడాకారులుగా పేరు పొందుతారు.

17 నుండి 20 సం॥రంల వరకు ఆ తరువాత 24 సంవత్సరముల వరకు విద్యార్జన పూర్తయి ఉద్యోగ లాభం కలుగును. వివాహం జరుగు తుంది. సంతానం కలుగుతుంది.

25 నుండి 35 సం॥రముల మధ్యకాలంలో ప్రభుత్వ వ్యవహారము లలో ధనలాభం కలుగుతుంది. దీర్ఘకార్య చరణం, స్వల్ప విచారము, వ్యవహారమూలకముగా భూ ధన లాభములను కళత్రపీడయు కలుగును.

36 నుండి 42 సంవత్సరముల మధ్యకాలంలో వాహన సౌఖ్యం, దేశాంతర కీర్తియు కలుగును.

43 నుండి 50 సంవత్సరములలో రాజకార్య మూలకంగా ఇతర దేశ ప్రయాణములను, తీర్థయాత్ర సేవయు దానివలన మనస్సంతోషం, తృప్తి కలుగును.

51 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో పుత్ర పౌత్రాది సౌఖ్యం, జ్ఞానమార్గ సంచారం, మంత్ర శుద్ధియు, నానావిధ ఫలసంగ్ర హము కలుగును. పిమ్మట నానావిధ భోగభాగ్యములు అనుభవించుచు విష్ణులోకం పొందుదురు.

# 88వ కథ

శ్రీ గణేశాయనమః ఈ జాతకులు కుటుంబమును అధికవాత్సల్య ముతో పోషించెదరు. జీవితంలో మొదటి భాగమునందు అధిక సౌఖ్య మును, మధ్యమమునందు మధ్యమ సౌఖ్యమును, అంత్యమున దుఃఖ మును పొందెదరు. ఇద్దరు భార్యలు, స్వల్పసంతానమును కలిగియుందురు. వీరు చండిపూజ చేసిన యెడల సర్వసౌఖ్యములు కలుగును. ఈ జాత కులు విలాసవంతులు. నృత్య, గీత, వాయిద్యాది వినోదములందు ప్రీతి కలిగి యుందురు. పరోపకార కుశలత, నానావిధ వాహన సౌఖ్యములు పొందుదురు.

1వ సంవత్సరమందు నేత్రసంబంధమయిన పీడ, 2వ సంవత్సర మందు ఉదరరోగమును, 3వ సంవత్సరమందు తల్లికి అనారోగ్యమును 4వసంవత్సరమందు తండ్రికి ధనలాభం, వాహన లాభం కలుగును. విద్యా రంభం చేయుదురు. 4మొదలు 7సం॥రంల మధ్యకాలంలో గృహమందు శుభకార్యములు విద్యార్జన, ఆటపాటలతో కాలమంతయు గడచును.

8 నుండి 16 సం॥రముల మధ్యకాలంలో విద్యాభివృద్ధి, పాఠ శాలయందు పారితోషికములు లభించును. 17 నుండి 25 సంవత్సరముల మధ్యకాలంలో అంతా సంతోషమయినకాలం, వివాహం జరుగుతుంది. ఉద్యోగలాభం, సంతాన లాభం, మిత్రలాభం కలుగుతుంది.

26 నుండి 32 సంవత్సరముల మధ్యకాలంలో రాజకీయముగా ఇతర దేశ ప్రయాణములు, ఇందువల్ల ఉద్యోగ పరంగా విశేషంగా ఉద్యోగాభివృద్ధియు, ధనధాన్య లాభం కలుగును. కొన్ని కార్యక్రమము లలో కొంతమందితో విరోధం వల్ల స్వల్ప నష్టము, విచారము కలుగును. చివరలో ఆకస్మిక ధనలాభం కలుగును.

33 నుండి 40 సంవత్సరముల కాలంలో పుత్రసౌఖ్యం, సంగీత

సాహిత్యాది వినోదకార్యక్రమములు, శుభకార్యముల మూలకంగా ధన వ్యయం జరుగుతుంది. 41 నుండి 55 సం॥రంలలో వ్యాపారమూలకంగా గాని, ఉద్యోగమూలకంగా కాని ధనలాభం కలుగుతుంది. మంచికీర్తి కలుగుతుంది.

55 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో పుత్రపౌత్రాదులతో సంతోషంగా నుండుదురు. ఒక ప్రాణిని గురించి విచారము, దానధర్మాలు చేస్తారు. అంత్యమున కఫాధిక్యం కలుగును.

61 నుండి 69 సంవత్సరముల కాలంలో సుఖదుఃఖములు పొందుతు వైశాఖశుద్ధ ద్వాదశి గురువారం రోజున పరలోకం పొందుతారు.

# 89 వ కథ

శ్రీ గణేశాయనమః ఇట్టి గ్రహ సంపత్తి గలిగిన జాతకులు దయ సత్యము, ప్రసిద్ధి, వ్యవహారములలో జయం పొందుతారు. నిర్మలమయిన అంతఃకరుణను ఎల్లపుడు ఆనందంగా ఉండుటయు వీరియొక్క లక్షణ ములు.

1 వ సంవత్సర మందు శ్వానకోన సంబంధమయిన పీడ, 2,3,4 సం॥రంలలో సోదరసోదరీ లాభం, పితృసౌఖ్యం, విద్యారంభమగును.

5 మొదలు 8 సంవత్సరముల మధ్యకాలంలో తండ్రికి ధనలాభం, విద్యాభివృద్ధి, ఆటపాటలతో కాలం గడుస్తుంది.

9 నుండి 16 సంవత్సరం ఆ తరువాయి 25 సంవత్సరముల పర్యంతం దినదినాభివృద్ధిగా ఉంటుంది. వాహన ప్రమాదంగాని, ఎత్తైన చోట్లనుండి అకస్మికంగా పడుటయు సంభవిస్తాయి. విద్యార్జన పూర్తయి పదవీలాభం కలుగును. వివాహం జరుగుతుంది. ఈ కాలమంతయు సంతోషంగా కాలం గడుస్తుంది.

25 నుండి 30 సంవత్సరముల మధ్యకాలంలో పుత్రలాభం, రాజ

మూలక ధనలాభం కలుగుతుంది. అంత్యమున మాతాపిత్ర విచారం కలుగుతుంది. విశేషంగా ధనం సంపాదిస్తారు.

31 నుండి 40 సంవత్సరముల మధ్యకాలంలో దినదినాభివృద్ధిగా కీర్తియు, వివాహముల మూలకంగా విశేషంగా ధనవ్యయం చేస్తారు. భూలాభం, గృహలాభం కలుగుతుంది. స్వకులమందుగాని, పరకులమందుగాని శత్రుత్వ మేర్పడుతుంది, అనేక వ్యవహారములలో జయం కలుగుతుంది.

41 నుండి 50 సంవత్సరముల మధ్య కాలంలో అధికమయిన కీర్తి, ఐశ్వర్యాభివృద్ధియు, కలుగును. జాతకులకు ఆకస్మికంగా అనారోగ్యము కల్గును. ఔషధసేవ, దాన, జప, శాంతులవల్ల ఈ అనారోగ్యం తగ్గుతుంది.

51 నుండి 60 సంవత్సరముల మధ్యకాలంలో భూవృద్ధియు, పుత్ర, పుత్రికావర్గం వారికి వివాహాదుల వల్ల ధనవ్యయం అవుతుంది.

61 నుండి 70 సంవత్సరముల మధ్యకాలంలో సుఖంగా కాలం గడుపుతారు. అయితే తరచుగా అనారోగ్యం బారిన పడతారు, విరివిగా ధార్మిక కార్యక్రమములలో పాల్గొంటారు. అంత్యమున కృష్ణ పక్షంలో అష్టమి శుక్రవారం దేహత్యాగం చేయుదురు.

# 90 వ కథ

శ్రీగణేశాయనమః ఈ జాతకుని యొక్క శుభాశుభ ఫలితములు శాస్త్రనియమానుసారం ఈ విధంగా తెలియజేస్తున్నారు. ఈ జాతకమందు శుభగ్రహములు శుభస్థానములలోను, పాప గ్రహములు పాపాస్థానముల లోను వుండుటచే వీరు పరాక్రమశాలురు, ధనవంతులు, కీర్తికలవారుగా ఉంటారు. అంత్యకాలములో అనారోగ్యంచే బాధపడుతారు. మంచి జ్ఞానం కలిగి ఉంటారు.

1వ సంవత్సరమందు జ్వరభయమును, రెండవసంవత్సరమందు నాసిక సంబంధ వ్యాధులు, 3వసంవత్సరములో తల్లికి అనారోగ్యం 4వ

సంవత్సరం విద్యారంభం. తండ్రికి ధనలాభం కలుగును. 5వసం॥రంలో వాహనం నుండి పడుట జరుగుతుంది. గృహమందు వివాహాది శుభ యోగములు కలుగుతాయి. తల్లి అనారోగ్యముచే బాధపడుతుంది.

6 నుండి 12 సంవత్సరముల కాలంలో తండ్రికి విశేషమయిన లాభం కలుగుతుంది. కీర్తివృద్ధియు, సౌఖ్యవృద్ధి వాహన లాభములు కలుగుతాయి, విద్యార్జన సులభంగా పంటపడుతుంది, అంత్యమున తండ్రికి అనారోగ్యం కలుగుతుంది.

13 నుండి 23 సంవత్సరముల మధ్యకాలంలో విద్యార్జన పూర్తవు తుంది. శాస్త్రవిద్యాభివృద్ధి కలుగుతుంది. మంచి ప్రభుత్వోద్యోగం దొరుకు తుంది. 23 నుంచి 30 సంవత్సరముల మధ్యకాలంలో వివాహాది శుభ కార్యములు జరుగుతాయి, సంతాన లాభం కలుగుతుంది. ఇదే సమయంలో విశేషంగా ధన సంపాదన చేస్తారు.

31 నుండి 40 సంవత్సరముల మధ్యకాలంలో విశేషంగా భూ వాహనాది లాభములు కలుగుతాయి. గృహమందు వృద్ధ మృత్యువు వల్ల విశేషంగ ధనవ్యయం అవుతుంది.

41 నుండి 50 సంవత్సరం మధ్యకాలంలో భూగృహ లాభాలు కలుగుతాయి. సంతానానికి విశేషంగా ధనం వ్యయం చేస్తారు. ఉద్యోగ ఇతర దేశాల ప్రయాణం చేస్తారు. అంత్యములో కొంతమంది మిత్రు లతో శత్రుత్వం ఏర్పడుతుంది. అయితే అంత్యమున ధనలాభం కలుగు తుంది.

51 నుండి 60 తదనంతరం 70 సం॥రం వరకు సంతానమునకు వివాహాది శుభకార్యములు చేస్తారు. పుత్రపౌత్రాదులతో సుఖంగా కాలం గడుపుతు అంత్యమున శ్వాసకోస రోగములతో బాధపడి మరణిస్తారు.

—)o(—

# భృగు సంహిత

## షష్ఠి సంవత్సర ఫలము

### ప్రభవ

ప్రభవ సంవత్సరమునందు పుట్టినవారు సర్వ వస్తుసంపదలు, సుఖ భోగభాగ్యములు, దీర్ఘాయువు కలవారగుదురు. ఎల్లప్పుడు దారపుత్రాదులతో సుఖింతురు.

### విభవ

విభవ సంవత్సరమునందు జన్మించిన, మంచి రూపసంపద ప్రియమగు సంభాషణ, మంచి గుణములు, బుద్ధిసూక్ష్మత, కళలను నేర్చినవాడు, మంచి శీలము, వర్చస్సు కలిగి ప్రేమనుగొలుపు చూపుగలవాడగును.

### శుక్ల

శుక్ల సంవత్సరమున జన్మించిన పురుషుడు, ఎల్లప్పుడు సంతోషము, ఉత్సాహము కలిగియుండును. ఉదారచిత్తము కలవాడు, సత్పుత్రవంతుడు, విద్య, వినయము, గుణసంపదలు కల్గియుండును.

### ప్రమోదూత

ప్రమోదూత సంవత్సరమునందు జన్మగల పురుషుడు, సత్యమును పలుకును. పుత్రపుత్రీయుతుడు, పరమార్థతత్పరుడు, జ్ఞానియునగును.

### ప్రజోత్పత్తి

ప్రజోత్పత్తి సంవత్సరమున జన్మగలపురుషుడు, దారపుత్రాదులయందు దయగలవాడు, అనుదినము దేవతలయందును భక్తి కలిగి యుండురు. అభిమాన వంతుడు, గౌరవము కలవాడు నగును.

### ఆంగీరస

ఆంగీరస సంవత్సరమునందు జన్మించిన పురుషుడు, సుఖీ, భోగి, మిలుకునుగొలుపు మాటనేర్పు, సద్బుద్ధి, మంచి రూపము, దీర్ఘాయువు కలిగియుండును.

## శ్రీముఖ

శ్రీముఖ యందు జన్మించిన, ఐశ్వర్యవంతుడు, సౌఖ్యము, మంచి కీర్తి, వాహన సుఖములను పొందును. అత్యంతము ప్రేమను గొలుపు వాడు, శాస్త్రముల నెరింగిన పండితుడు నగును.

## భావ

భావ సంవత్సరమున జన్మించిన, గుణవంతుడు, కీర్తివంతుడు, కులశ్రేష్ఠుడు, ఎల్లప్పుడు సంతోషము కలవాడు.

## యువ

యువ సంవత్సరమునందు జన్మించినవాడు శాంతికలవాడు. ఓర్పు, ఇంద్రియనిగ్రహము, బ్రహచర్యవ్రతాది తపఃక్లేశమును సహించుట, మొదలగు గుణములు కలుగును. చిర జీవనము కల్గును. సద్బుద్ధి, చేసిన మేలు మరువడు. వీని ముఖము నిర్మలముగా నుండి, ఎల్లప్పుడు దయా సంతోషములను, తృప్తిని వెలిబుచ్చుచుండును.

## ధాత

ధాతృ సంవత్సరమునందు జన్మించినవాడు, గురుభక్తి, శిల్పశాస్త్ర నైపుణ్యము, మంచిశీలము, గౌరవర్ణముకల దేహసౌందర్యము కలవాడ గును.

## ఈశ్వర

ఈశ్వర సంవత్సరజాతుడు అధిక సంతోషము, అతిశయించిన గుణ ములు, అధికమగు కోపము కలిగి యుండును. విద్యావంతుడు, సర్వ కార్యములందును మిక్కిలి నేర్పరితనము గలిగిన కార్యకరణ సమర్థుడు, సాధువర్తనము గలవాడునుయగును.

## బహుధాన్య

బహుధాన్య వర్షమున జన్మించిన, వ్యాపారమునందు చురుకైన బుద్ధికుశలత, మంచి ఆలోచన, దానశీలము, అభిమానము, ధనధాన్య సంపదలు కలుగును.

## ప్రమాది

ప్రమాది సంవత్సరమున జన్మించిన, ఏనుగులు, గుఱ్ఱములు, రథములు మొదలగు అనేక వాహనములు కలవాడగును. రాజమంత్రిత్వ మును పొందదగినవాడని దెలియ దగియుండును.

## విక్రమ

విక్రమ సంవత్సరమున జన్మించిన వానికి, పరాక్రమము మెండు. కృతజ్ఞుడు. మిక్కిలి ఉగ్రకార్యములను అభ్యసించి సాధించు స్వభావము, ఎల్లప్పుడు శిల్పకార్యములందభిరుచియు నుండును.

## వృష

వృష సంవత్సరమున పుట్టినవాడు, పనులు చేయుటయందు ఉదుకు దనము గలవాడు, తనస్వబుద్ధిబల విక్రమమువల్ల సాధించబడిన పనుల యందు ప్రతిష్ఠగలవాడు, ఆశ, లోభము గలవాడు, పరకర్మలనాచరించు వాడు, ఇతరుల పనులను నెరవేర్చువాడు, ఇతరులను నిందించువాడు, దుఃఖశీలము గలవాడు నగును.

## చిత్రభాను

చిత్రభాను సంవత్సరమునందు జన్మించిన వారికి నానావర్ణములుగల మనోహరములగు వస్త్రములందుప్రీతి, నిరంతరము పూలమాలలను ధరిం చుటయందభిలాషమెండు. సంపెంగ మొగలిపుష్పములన్న వీరికి ఆశ మెండు.

## స్వభాను

స్వభాను సంవత్సరమున పుట్టినవాడు, తీర్చిన మంచి తలవెంద్రు కల సౌందర్యము, కాంతివంతమగురూపు, మంచిఒప్పిదము, దయ, సంతో షము, తృప్తిని జూపు ముఖము కల్గియుండును. ఇరుగుపొరుగున పగ బూనిన శత్రువులనుగల్గియు, శత్రు సహాయమును పొందువాడున్ను అగును.

## తారణ

తారణ యందు జన్మించిన నరుడు, అతిక్రమించిన విద్యలను పొందినవాడగును. కాని కఠినపరుషవాక్కు, నిలకడలేని జీవితము, నింద్యకర్మాచరణాసక్తి, రణసాహసము కలిగి జూదరి మోసకాడును యగును.

## పార్థివ

పార్థివ యందు బుట్టినవాడు, తనవిధులను తాను నేరవేర్చువాడు, ఆరుశాస్త్రములను సాంగోపాంగముగా దెలిసినవాడు. శుచి, కలాకుశలుడు, కలానమూహము అలంకరణములుగా కలవాడు. స్త్రీలశృంగారచేష్టా విశేషంబుల నెరింగినవాడు. క్రీడాసక్తుడు, అందమైనవాడు నగును.

## వ్యయ

వ్యయ సంవత్సరమున బుట్టినవాడు అతిక్రమించిన సౌఖ్యము కలవాడు, నిష్ఫలప్రయత్నములతో కూడిన ప్రయప్రదములగు పనులను చేయువాడు, స్థిరమగు చిత్తవృత్తికలవాడును యగును.

## సర్వజిత్

సర్వజిత్ సంవత్సరమునందు జన్మించిన పురుషుడు, రాజగౌరవము, అధికయుత్సాహము గలిగి నిరంతరము శుచిగానుండును. శత్రువులను జయించును.

## సర్వధారి

సర్వధారియందు బుట్టినవాడు అనేక భోగములనుభవించును. దేహ సౌందర్యము గలవాడు. మధురమగు భోజన సౌఖ్యము తియ్యని పదార్థములయందభిరుచి ఎల్ల వేళల యందు సర్వకార్యములందు ధైర్యము, గలవాడుగా దెలియబడగి యుండును.

## విరోధి

విరోధిసంవత్సరమునందు పుట్టినవాడు దేశదేశాంతరములందు సంచరించును. కుటుంబమునందు సౌఖ్యమును పొందును. జూదగాండ్రు మోసకాండ్రును అగుమిత్రులతో కూడియుండు వాడున్ను యగును.

## వికృతి

వికృతి వత్సరమున జన్మించిన పురుషుడు, ప్రతిదినము కలహ కారణమును కలిగియుండును. చెడుయాలోచన గలవాడు. ధనరహితుడు, బుద్ధిహీనులగు మిత్రులతో గూడియుండు వాడునగును.

## ఖర

ఖర సంవత్సరమునందు జన్మించిన పురుషులు కఠినము, క్రూరమునగు చిత్తవృత్తి, దీర్ఘస్వరము, చక్కనిమాట, కల్గియుందురుగాని వీరికి లజ్జయుండదు. ఇతరులకు క్లేశమును కలిగించు పనులను గూడాచేయుదురు.

## నందన

నందన సంవత్సర జాతుడు, ఇండ్లు, బావులు, చెరువులు, తోటలు మొదలగు వానిని నిర్మించుట యందభిలాష కలిగియుండును. ఎల్లప్పుడు సంతోషము కల్గియుండును. ఉద్యానవనములు తోటప్రదేశములయందు ఆనందమును బొందును.

## విజయ

విజయ సంవత్సరమునందు బుట్టిన మనుజుడు, యుద్ధమునందు నేర్పు, ధైర్యము కలిగి శత్రుసంహారము చేయును. మంచి బుద్ధి, శీలము కలిగి, భూమినిపాలించు అధికారమును బొందును.

## జయ

జయ సంవత్సరమున జన్మించినవాడు సహృదయము, ధైర్యము కలిగియుండును. శాస్త్రములజదివి తెలిసికొనినవాడగును. వాదోపవాదములందభిలాష గల్గిన నేర్పరి. జయమే ఇతనికి జీవితప్రయోజనము, జయమును కోరుచుండును.

## మన్మథ

మన్మథ సంవత్సరమున జన్మించిన, నృత్తగీతవాద్యాది వినోద

ముల ననుభవించును, విషయనిరూపణయందు అనేకరీతుల మాటలాడ గల నేర్పరితనముండును. ఉదారచిత్తము, సుఖభోగభాగ్యములను అను భవించును.

## దుర్ముఖి

దుర్ముఖి సంవత్సరమునందు జన్మించిన జనుడు ఇతరులను నిందించువాడు, క్రూరుడు, ప్రతికూలవాదనను చేయువాడు, నిరంతరము ఆశ, నింద, లోభము మొదలగువానిని ఆరంభముగాను ఆధారముగాను కలిగి మాటలాడువాడు. నింద, లోభము ఆశయను వానిని ఎప్పుడును ప్రకటీకరించు ముఖము కలవాడు నగును.

## హేవిళంబి

హేవిళంబివర్షమున బుట్టినవాడు కుటిలబుద్ధి అనగా వక్రబుద్ధి, మోసము చేయు స్వభావము, లుబ్ధత్వము, ధనమునందు ప్రీతియు కలిగి యుండును. ఏ విషయము నందైనను ప్రారబ్ధ కర్మను గురించి మాట్లాడు చుండును.

## విలంబి

విలంబి సంవత్సరమున జన్మించినవాడు ధనధాన్యములతోను గజాశ్వాదివాహనములతోను కూడియుండును. దారపుత్రాదులతో సౌఖ్యము లనందును.

## వికారి

వికారి సంవత్సరమునందు జన్మించిన అసత్యములను చెప్పుట, దురాచారము, ఏ పనియందును గూడ నేర్పరితనము లేక యుండుట, జూదము-మోసము, అమితముగా మాటలాడుట మొదలగు గుణములు కలవాడగును.

## శార్వరి

శార్వరి సంవత్సరమున పుట్టిన, వర్తకమునందు నైపుణ్యముకల వాడగును. అనేక విద్యలను నేర్చినవాడగును. ఎల్లప్పుడు అనేకవ్యాపారములను చేయును.

## ప్లవ

ప్లవ సంవత్సరమునందు జన్మించినవారు గంభీరహృదయులు, ప్రతాపవంతులు, కామాధికులు, ధనధాన్యములు కలవారునై యుందురు.

## శుభకృత్

శుభకృత్ సంవత్సరమునందు జన్మించినట్లయిన, విద్యావినయాది సద్గుణములు కలవారు, ధనధాన్యయుతులు,పుణ్యాత్ములు, దీర్ఘఆయురారోగ్యము కలవారు, చంచలస్వభావులు, శూరులు, చతురులు నగుదురు.

## శోభకృత్

శోభకృతు సంవత్సరమునందు జన్మించిన వారు ప్రజ్ఞగలవారు. సత్కర్మాచరణులు, సర్వప్రాణులయందు దయాస్వభావులు, నగుదురు.

## క్రోధి

క్రోధి సంవత్సరమునందు జన్మించినవారు అధికమగు కోపము కలిగియుందురు. ఎల్లప్పుడు ఇతరుల పనులను చేయుచుందురు, క్రూర మగు భయంకరమైన స్వభావగుణశీలాదులను కలిగియుందురు.

## విశ్వావసు

విశ్వావసు సంవత్సరమునందు జన్మించినవారు సత్పుత్రులను సత్కళత్రమును కలిగియుందురు. సద్గుణ ధనధాన్యసంపదలు గల్గి ఇష్టవస్తువుల ననుభవింతురు.

## పరాభవ

పరాభవ సంవత్సరమున జననము కల పురుషుడు, నిష్ఠురము గా మాటలాడును. ధనధాన్యసంచయములను నష్టబరుచువాడగును. ఆచార హీనుడు, కుత్సితుడు, మోసకాడు యగును.

## ప్లవంగ

ప్లవంగ సంవత్సరమున జన్మించిన చిత్తచాంచల్యము, మోస ప్రవృత్తి, కలవాడగును. ఆచారములను పాటించక దురాచారపరుడగును,

## కీలక

కీలక సంవత్సరమునందు జన్మించిన పురుషుడు నమ్మర్థమగు రూపము, యౌవనము, సంపద, దయ, ప్రియముగొలుపు మాటనేర్పు పొడవైన మెడ, దృఢమగు శరీరావయవములు కలిగియుండును. చిర కాలముండు ఐశ్వర్యమును పొందును.

## సౌమ్య

సౌమ్య సంవత్సరమున జన్మించిన వారు, సత్యగుణము, దేవతా భక్తి, విద్య వినయము కలిగియుందురు. అతిధిపూజా తత్పరులగుదురు. కృశించిన శరీరావయవములు కలిగియుందురు.

## సాధారణ

సాధారణ సంవత్సరమునందు జన్మించిన మనుజుడు, వ్రాతపను లందు కడునేర్పరియు, వివేకముగలవాడు, క్రోధముగలవాడు, ఆముష్మిక మార్గమునందిచ్ఛగలవాడునుయగును.

## విరోధికృత్

విరోధికృత్ సంవత్సరమున జన్మించినవారు, ఎల్లప్పుడు విరో ధములు కలవారు, శూరులు, ధనవంతులు, మంత్రయంత్ర శక్తితోకూడి యుండు వారున్ను నగుదురు.

## పరీధావి

పరీధావి సంవత్సరము నందు జన్మించినవారు విద్యాన్వితులు గుణవంతులు, వ్యాపారవృత్తియందు ధనమార్జించువారు, గొప్పపేరు ప్రతిష్ఠను పొందువారున్ను నగుదురు.

## ప్రమాదీచ

ప్రమాదీచ సంవత్సరమునందు జన్మించినవారు, గొప్పఅభిమా నము గల్గియుందురు. దురాచారులు, దుష్టస్వభావులు, పరులకు కష్టములను కలిగించువారును యగుదురు,

## ఆనంద

ఆనంద సంవత్సరమునందు జన్మించినవారు, అతి ఉదారచిత్తులు, కృతజ్ఞులు, ప్రజ్ఞగలవారు ఎల్లప్పుడు సంతోషముతోనుండు వారునగుదురు.

## రాక్షస

రాక్షస సంవత్సర జనితులు దయలేనివారు, విచారమును కలిగించు వారు, అసత్యప్రియులు, కుటిలస్వభావులు, సదాచారులును యగుదురు.

## పింగళ

పింగళ సంవత్సరమునందు జన్మించినవారు కుటిల కర్మపరులు, చంచలస్వభావులు. అధికముగా మాటాడుదురు.

## కాళయుక్తి

కాళయుక్తి సంవత్సరమునందు జన్మించిన వారు అధికముగ మాట్లాడువారును దుష్టబుద్ధి కలవారు, తొందర గలవారు, కలహ ప్రియులగుదురు.

## సిద్ధార్థి

సిద్ధార్థి సంవత్సరమునందు జన్మించినవారు చతురత గలవారు సౌమ్యస్వభావము-ఉదారచిత్తము కలిగి యుందురు. పరాక్రమవంతులు ప్రతాపవంతులు-రాజమంత్రులగుదురు.

## రౌద్రి

రౌద్రి సంవత్సరమునందు జన్మించిన వారు భయంకరముగ నుందురు. పశుసంపదను కలిగియుందురు. రౌద్రస్వభావముతో నుందురు.

## దుర్మతి

దుర్మతి సంవత్సరమునందు జన్మించినవారు చెడు స్వభావము ఆడిన మాట నిలబెట్టుకొందురు- ఎల్లప్పుడు విశ్రాంతిని కోరుదురు. అధికమగు కోర్కెలు కలిగియుందురు.

## దుందుభి

ధుంధుభి సంవత్సరమునందు జన్మించినవారు రథ-గజ-అశ్వాది

వాహన సంపదయు, బంగారము రత్నము మొదలగునవియు కలిగి యుందురు, రాజసభలందు కీర్తిని పొందుదురు.

## రుధిరోద్గారి

రుధిరోద్గారి సంవత్సరమునందు జన్మించినవారు ఎఱ్ఱనినేత్రములును అధికకోపమును దురాచారమును కలిగి యుందురు.

## రక్తాక్షి

రక్తాక్షి సంవత్సరమునందు జన్మించినవారు సదాచార సంపన్నులు అధికమైన కీర్తిగలవారు, తరుచు నేత్రసంబంధమైన బాధలు పొందుచుందురు.

## క్రోధన

క్రోధన సంవత్సరమునందు జన్మించివారు ఇతరుల యెడల క్రోధము-ఇతరుల వాక్యములను మరచువారును పరాపవాద భయమును పొందుదురు.

## అక్షయ

అక్షయ సంవత్సరమునందు జన్మించినవారు ఇతరుల కార్యములతో కూడియుందురు. నిష్ఠురోక్తులు పలికెడి స్వభావమును కలిగియుందురు.

షష్ఠిసంవత్సర ఫలం సమాప్తం

— o —

# ఋతుఫలం

## వసంత ఋతుఫలం

వసంత ఋతువునందు జన్మించినవారు విద్యావంతులు, గుణవంతులు నీతిపరులు- ఐశ్వర్యవంతులు గీతవాయిద్యములందు ప్రీతిగలవారగుదురు.

## గ్రీష్మ ఋతుఫలం

గ్రీష్మ ఋతువునందు జన్మించినవారు శ్రీమంతులు- ధనవంతులు- పొడవగు వంకరతిరిగిన శిరోజములు కలిగియుందురు.

## వర్షఋతుఫలం

వర్షఋతువునందు జన్మించినవారు ఉష్ణము లేక శ్లేష్మ ప్రకోపము గలవారు స్త్రీలకు సంతోషము కలిగించువారు అశ్వాది వాహనములందు ప్రీతి కలిగియుందురు.

## శరదృతుఫలం

శరదృతువునందు జన్మించినవారు యుద్ధప్రియులు- వాహన సౌఖ్యములు గలవారు ధర్మాత్ములు వాతప్రకృతి గలవారు నగుదురు- వీరు మనసునందు క్రోధమును కలిగి యుందురని దెలియనగును.

## హేమంత ఋతుఫలం

హేమంత ఋతువునందు జన్మించినవారు రాజమంత్రులగుదురు. ఉదార స్వభావమును కలిగి యుందురు. శ్రేష్ఠమగు పనులు చేయుదురు. మంచిశీలము కలిగియుందురు.

## శిశిర ఋతుఫలం

శిశిర ఋతువునందు జన్మించినవారు మధురపదార్థ ప్రియులు-అతి రోషము- అమితమైన యాకలిగలవారు తాంబూలము సేవించుటయందు ప్రీతికలిగి యుందురు.

ఋతుఫలం సమాప్తం

—)o(—

# మాసఫలం

## చైత్రమాసఫలం

చైత్రమాసము నందు జన్మించినవారు సత్కర్మలు చేయువారును వినయము గలవారును భోగభాగ్యములు గల వారగుదురు. మరియు రాజులుగాని రాజమంత్రులుగాని యగుదురు. మధుర పదార్థములందు ప్రీతిని కలిగియుందురు.

## వైశాఖమాసఫలం

వైశాఖమాసమునందు జన్మించినవారు శుభ లక్షణములను కలిగి

యుందురు. గుణవంతులు బలవంతులు చతురులు అధికమైన కోర్కెలు గలవారు, దేవబ్రాహ్మణులందు భక్తికలవారు, మంచిపనులు చేయువారు నగుదురు.

## జ్యేష్ఠమాసఫలం

జ్యేష్ఠమాసమందు జన్మించినవారు చంచలస్వభావులు, అధికమగు ఓప్పు కలవారు, ఎక్కువగా నితర దేశములందు నివసించు వారగుదురు.

## అషాఢమాసఫలం

అషాఢమాసమునందు జన్మించినవారు విలాసముకొరకు అధికముగ ధనము ఖర్చుచేయుదురు. శుభకర్మలు చేయుదురు. కృతజ్ఞులు నగుదురు. గురుభక్తి కలిగియుందురు.

## శ్రావణమాస ఫలం

శ్రావణ మాసమునందు జన్మించిన వారు పుత్రులతోను పౌత్రుల తోను స్నేహితులతోను కూడియుందురు. వాత శ్లేష్మ తత్వము గలవారై యుందురు.

## భాద్రపదమాస ఫలం

భాద్రపద మాసమునందు జన్మించినవారు సుఖదుఃఖములను సమాన ముగ పొందుదురు. దారాపుత్రాదులను కూడియుందురు. శ్లేష్మాధిక్యముచేత కృశించినదేహము కలవారగుదురు.

## ఆశ్వయుజమాస ఫలం

ఆశ్వయుజ మాసమునందు జన్మించినవారు రాజమూలక ధన లాభములను కలిగియుందురు. విద్వాంసులు, ధనము గలవారు, దాతలు, ఋణము కలవారు నగుదురు.

## కార్తీకమాస ఫలం

కార్తీక మాసమునందు జన్మించినవారు సత్కార్యములు చేయు వారును. అభిమానవంతులును, విశాల హృదయులును, క్రయవిక్రయము లందు నేర్పుగలవారగుదురు.

### మార్గశిరమాస ఫలం

మార్గశిరమునందు జన్మించినవారు మంచి నడవడికయు, నేర్పు ప్రజ్ఞ యిత్యాది కలిగియుందురు. పరోపకారము తీర్థయాత్రలు చేయువారగుదురు.

### పుష్యమాస ఫలం

పితృధనము లేనివారగుదురు. అధిక రోషమును రహస్య విచారమును కలిగియుందురు. మంత్రయంత్రాది విషయముల దెలిసిన వారగుదురు.

### మాఘమాస ఫలం

మాఘమాసమునందు జన్మించినవారు కాలానుసారమైనట్టి విద్య నభ్యసింతురు. యంత్రములందును ఔషధములందును ప్రీతిని కలిగియుందురు. తీక్షణమైన బుద్ధిగలవారు. శతృవులను జయింతురు.

### ఫాల్గుణమాస ఫలం

ఫాల్గుణ మాసమందు జన్మించినవారు నృత్యగీతాది వినోదములందు ప్రీతి కలిగియుందురు. విలాసవంతులు, ధనవంతులు, కుశలులు నగుదురు.

— ౦ —

## పక్షఫలం

### కృష్ణపక్ష ఫలం

కృష్ణపక్షమునందు జన్మించినవారు ఎల్లప్పుడు సంతోషముతో నుందురు, దారాపుత్రులను మంచిశీలమును కలిగియుందురు.

### శుక్లపక్ష ఫలం

శుక్లపక్షమునందు జన్మించినవారు అధికముగ మాట్లాడువారు, శీలము గలవారు, జ్ఞానవంతులు కవులయందు ప్రీతిగలవారు, సుందరులు చపలులు కీర్తికలవారు నగుదురు.

# అ ధ తి థి ఫ ల ం

## పాడ్యమి ఫలితం

ప్రతిపత్తు అనగా పాడ్యమినందు జన్మించినవారు విద్వాంసులు మంచివాక్కుగలవారు, మంచిరూపము భూషణములు గుణములు ఐశ్వర్యము రాజమూలక ధనలాభము ఇత్యాది కలిగి యుందురు.

## ద్వితీయ ఫలం

విదియ యందు జన్మించినవారు ప్రసన్నమైన ముఖముగలవారు గీతావాద్యాది వినోదములతో నుండువారు దయగలవారు మంచివిషయ పరిశ్రమ చేయువారును యగుదురు.

## తృతీయ ఫలం

తృతీయ యందు జన్మించినవారు రాజమూలక ధనలాభము కలిగి యుందురు. కామాధికులు బలవంతులు మంచిహృదయము ధైర్యము ఇత్యాది కలిగియుందురు.

## చతుర్థి ఫలం

చతుర్థియందు జన్మించినవారు వాదమునందునేర్పరులు. కుత్సితుడు, లోభి, ఋణవంతులు, సాహసము గలవారు అధిక విజ్ఞానవంతులు నగుదురు.

## పంచమీ ఫలం

పంచమియందు జన్మించివారు రాజ ద్వారమునందు కీర్తి కలిగి యుందురు. కుటుంబయుక్తుడు, దయగలవారు, ఆజ్ఞాపించు నట్టివారు అనగా అధికారవంతులునగుదురు. పితికి సంతాన నష్టమును చెప్పవలెను.

## షష్ఠి ఫలం

షష్ఠియందు జన్మించినవారు శరీరమందు వ్రణ చిహ్నముమ పొందుదురు. కీర్తి- నేర్పు కలిగియుందురు. పొడవైన జానువులను (మోకాలు) కలిగియుందురు.

## సప్తమీ ఫలం

సప్తమియందు జన్మించినవారు జ్ఞానవంతులు గుణవంతులు ధ్యానము- దేవతార్చనలయందు ప్రీతిగలవారు విశాల నేత్రములును మంచి పాత్రతను కలిగియుందురు.

### అష్టమీఫలం.

అష్టమియందు జన్మించినవారు రాజమూలక ధనలాభము కలిగి యుందురు. దయాళువు, మంచిపేరు ప్రతిష్ఠలు గలవారు దారాపుత్రాదుల యందధికమైన ప్రీతి కలిగియుందురు.

### నవమీఫలం.

నవమియందు జన్మించినవారు కఠినముగ మాట్లాడుదురు. బంధుజన విరోధములు కలిగియుందురు. కోపములేనివారు ఆదరముగల వారగుదురు.

### దశమీఫలం

దశమియందు జన్మించినవారు ఉదారచిత్తము గలవారు నీతిపరులు దానధర్మకర్మముల చేయుదురు. దేవతాపూజలయందు నిమగ్నులగుదురు.

### ఏకాదశీఫలం.

ఏకాదశియందు జన్మించినవారు ఎల్లప్పుడు దానధర్మములతోను వ్రతములతోను కూడియుందురు. నిర్మలమగు మనస్సును స్వల్పరోషము గలవారు నగుదురు.

### ద్వాదశీఫలం

ద్వాదశియందు జన్మించినవారు జన్మ భూమియందు నివసింతురు. అన్నదానమునం దధికప్రీతిని కలిగియుందురు- రాజులవల్ల సౌఖ్యమును పొందుదురు.

### త్రయోదశీఫలం

త్రయోదశియందు జన్మించినవారు సత్యగుణ-ప్రధానులు పొడవైన కాళ్లు చేతులుగలవారు, రూపవంతులు బలవంతులగుదురు.

### చతుర్దశీఫలం

చతుర్దశియందు జన్మించినవారు సాహసముగలవారు క్రూరులు శౌర్యవంతులు, అధికముగ మాట్లాడువారు దుఃఖవంతులు సమయమునకు దగినట్లాడగలవారు నగుదురు.

### పౌర్ణమీఫలం

పౌర్ణమియందు జన్మించిన ఎల్లప్పుడు ధర్మప్రవృత్తి సంతోషము కలుగును. సౌందర్యవంతుడు, మృదువైన మాటలు గలవాడు.

### అమావాస్యఫలం

అమావాస్యయందు జన్మించినవారు మాతా పితృల యెడల భక్తి కలిగియుందురు. ప్రకాశవంతులు, కష్టముమీద ధనము నార్జింతురు.

## వారఫలం

### ఆదివార ఫలం

ఆదివారమునందు జన్మించినవారు పైత్యప్రకోపము గలవారు. శౌర్యవంతులై, వీరత్వము పరాక్రమము గలవారు, యుద్ధమునందు వెనుకకు జంకనివారగుదురు.

### సోమవార ఫలం

సోమవారమునందు జన్మించినవారు కఫాధిక్యమును, శాంత స్వభావము కలవారు, వాగ్విచక్షణమును సుఖదుఃఖములు రెండును సమముగా గలవారగుదురు.

### మంగళవార ఫలం

మంగళవారమునందు జన్మించినవారు భూమి, ధనము ఇత్యాది కలిగియుందురు. సాహసులు కలహ ప్రియులు క్షీణించిన దేహము గలవారగుదురు.

### బుధవారఫలం

బుధవారమునందు జన్మించినవారు సుందరులు, మృదువాక్కుగలవారు ధనము, వినయము, విద్య యిత్యాది కలిగియుందురు. వ్యాపారము వలన ధనము లభించును.

### గురువార ఫలం

గురువారమునందు జన్మించినవారు విద్వాంసులు సమస్త సద్గుణములును ధనమును కలిగియుందురు. స్వల్పముగకోర్కెలుండును. ధర్మాచార సంపన్నులగుదురు.

### శుక్రవారఫలం

శుక్రవారమునందు జన్మించినవారికి నీలవర్ణపు తలవెంట్రుకలును ప్రసన్నమగు ముఖము తెల్లని వస్త్రములందు ప్రీతియుండును.

### శనివారఫలం

శనివారమునందు జన్మించినవారు దుర్బల శరీరులు తమోగుణము కలవారు అకాలములో వృద్ధులవలె నగుపింతురు.

## నక్షత్ర ఫలం

### అశ్వని

అశ్వినీ నక్షత్రమందు జన్మించినవారు సత్యవంతులు నీతిపరులు సమస్త సంపదలు కలిగియుందురు. రథములు గుర్రములు మొదలగు వాహనములను కలిగియుందురు.

### భరణి

భరణీనక్షత్రమందు జన్మించినవారు ఆటపాటలయందు నేర్పరులు అపవాద భయము గలవారు. తొందర గలవారు అపకీర్తివలన దుఃఖమును పొందువారు నగుదురు.

### కృత్తికా

కృత్తికా నక్షత్రమందు జన్మించినవారు మేలు మరచువారు యదార్థము లేనివారు ఆకలి దాహము అధికముగా గల వారు వృథాప్రయాణము చేయువారగుదురు.

### రోహిణి

రోహిణీ నక్షత్రమందు జన్మించినవారు దానధర్మాది సత్కార్యములతో కూడియుందురు. సర్వకార్యములందు నిపుణులు, అనేక శాస్త్రములు తెలిసినవారగుదురు.

### మృగశిర

మృగశిరయందు జన్మించినవారు ధనుర్విద్యయందునేర్పరులు, నీతిపరులు, గుణవంతులు, రాజప్రీతివి కలిగియుండువారునగుదురు.

### ఆర్ద్ర

ఆర్ద్రయందు జన్మించినవారు కోపయుక్తులు కృతజ్ఞతలేనివారు దేహకాంతిలేనివారు అధికమగు ఆకలియు దాహమును కలిగియుందురు.

### పునర్వసు

పునర్వసుయందు జన్మించినవారు కృతజ్ఞులు ధనవంతులు బంగా

రము రత్న అలంకారములు గలవారు ప్రతాపవంతులు ఎల్లప్పుడు సౌఖ్యముతో నుందురు.

## పుష్యమి

పుష్యమి నక్షత్రమందు జన్మించినవారు మంచి కంఠస్వరమును పూర్వపుణ్యకర్మచేనేర్పడిన శరీరసౌందర్యమును ప్రసన్నమైన ముఖమును కలిగియుందురు. ఎల్లప్పుడును తమ ధర్మమును చేయువారగుదురు. మాతృపితృసేవ చేయువారగుదురు.

## ఆశ్లేష

ఆశ్లేషయందు జన్మించినవారు కష్టజీవులు వృథాగా దేశము తిరుగువారు కామాధిక్యము వలన బాధపడువారు నగుదురు.

## మఖ

మఖానక్షత్రమందు జన్మించినవారు కఠినస్వభావముకలిగియుందురు. పితృభక్తి కలవారు విఘ్నములు కలవారునగుదురు.

## పూర్వఫల్గుని

పూర్వఫల్గుని నక్షత్రమందు జన్మించినవారు సాహసులు, చౌరవ గర్వము కలవారు కామాధిక్యముచేత పీడింపబడుదురు. త్యాగశీలురు శౌర్యవంతులు నగుదురు.

## ఉత్తరఫల్గుని.

ఉత్తరఫల్గుణీ నక్షత్రమునందు జన్మించినవారు విశాలమగు కీర్తిగాంతురు-అధికమగు దయగలవారు శీలవంతులు రాజద్వారమునఅధికారము కలిగియుందురు.

## హస్త

హస్తానక్షత్రమునందు జన్మించినవారు దైవారాధనతత్పరులు కృతజ్ఞులు కుశలులు సమస్తసంపదలను కలిగియుందురు.

## చిత్తానక్షత్రం

చిత్తానక్షత్రమునందు జన్మించినవారు శాస్త్రములందు విచిత్రపరిజ్ఞానము కలిగియుందురు. చతురభాషులు, ప్రతాపవంతులు శత్రునాశనము చేయుదురు,

## స్వాతి

స్వాతియందు జన్మించినవారు రూపసౌందర్యమున మన్మధసమా నులు. కాంతాపుత్రులయం దధికప్రీతియు, రాజమూలక ధనలాభము కలిగి యుందురు.

## విశాఖ

విశాఖా నక్షత్రమునందు జన్మించినవారు తల్లిదండ్రుల యెడలను దేవుని యెడలను భక్తి కలిగియుందురు. యజ్ఞ హోమ జపతపాదుల యందు నిమగ్నులగుదురు. శాంతము కలవారగుదురు.

## అనూరాధ

అనూరాధయందు జన్మించినవారు మంచి దేహకాంతియు సంతో షముతో నుందురు. సమస్తసంపదలను కలిగియుందురు.

## జ్యేష్ఠ

జేష్ఠయందు జన్మించినవారు అధికమైన ప్రతాపము బుద్ధిగలవారు సత్కీర్తి మంచి తేజస్సు ఐశ్వర్యము కలిగియుందురు.

## మూల

మూలయందు జన్మించినవారు ధనవంతులు బలవంతులు సౌఖ్యము గలవారు వాహనములును మంచికీర్తియును ప్రతాపమును కలిగియుందురు

## పూర్వాషాఢ

పూర్వాషాఢయందు జన్మించినవారు చంచల స్వభావులు వాగ్విలా సముగలవారు, మంచిశీలము మధురమగు సంభాషణము, నానావిధ సంప దలు కలిగియుందురు.

## ఉత్తరాషాఢ

ఉత్తరాషాఢయందు జన్మించినవారు సత్కర్మలు చేయువారును, తపరులు దారాపుత్రాదులతో కూడియుందురు. జయమును పొందువారు, •తలు, ప్రభుత్వాధికారము పొందే వారునగుదురు.

## అభిజిత్

అభిజిత్ యందు జన్మించినవారు సుందరమైనవారు, చారుశీలురు,

దేవతలను బ్రాహ్మణులను పూజించువారు శ్రేష్ఠమగు శిక్షణమునిచ్చువారు నగుదురు.

## శ్రవణ

శ్రవణమునందు జన్మించినవారు శత్రునాశనము చేయువారును సన్మిత్రులు ధనముగలవారగుదురు. పుత్రులధికముగ గలవారగుదురు-సత్పాత్రత కలిగియుందురు.

## ధనిష్ఠ

ధనిష్ఠయందు జన్మించినవారు మంచినడవడిక-సదాచారము దయయు ధనమును అధికమగు ప్రతిష్ఠయు కలిగియుందురు.

## శతభిష

శతభిషమునందు జన్మించినవారు సాహసవంతులు, యదార్థ భాషణ ములుగలవారు, మంచిశీలము చపలచిత్తముగలవారు శత్రువులను జయించు వారు దాతలు నగుదురు.

## పూర్వాభాద్ర

పూర్వాభాద్ర నక్షత్రమునందు జన్మించినవారు శత్రువులకు అపకార మును మిత్రులకు యుపకారమును చేయుదురు-ఇంద్రియ నిగ్రహమును మంచిహృదయము గలవారగుదురు.

## ఉత్తరాభాద్ర

ఉత్తరాభాద్రయందు జన్మించినవారు స్వకులమందు భూషణము వంటివారు మంచి మూర్తివంతమును కలిగి యుందురు. సత్కార్యములు చేయువారగుదురు.

## రేవతి

రేవతియందు జన్మించినవారు ఇంద్రియములను జయించువారు సత్య వాదులు, హర్షశీలముగలవారు మంచివారిని సన్మానించు వారుగుదురు విశాలమగు హృదయము దృష్టికలవారు నగుదురు.

నక్షత్రఫలం సమాప్తం

—)o(—

# యోగ ఫలితం

## అథవిష్కంభ

అధవిష్కంభయోగమునందు జన్మించిన పురుషుడు శ్రేష్ఠులైన అను కూలురగు, దారాపుత్రాదులను, మిత్రులను కలిగియుందురు.

## ప్రీతియోగ

ప్రీతియోగమునందు జన్మించినవారు ఎల్లప్పుడు సంతోషముతోనుం దురు. మంచి స్నేహితులను కలిగియుందురు. మిత్రులయెడల అధికమైన ప్రీతి కలిగియుందురు.

## ఆయుష్మానోగ

ఆయుష్మానోగమునందు జన్మించినవారు దీర్ఘాయుష్మంతులు సాహ సులు, ధర్మకార్యములు చేయువారు, సత్యము, దయ ఇత్యాది కలిగియుం దురు.

## సౌభాగ్య

సౌభాగ్య యోగమునందు జన్మించినవారు, జ్ఞానులు, మహాభిమా నులు- ధనవంతులు, సత్యపరాయణులు, సదాచారము- వివేకము గల వారగుదురు.

## శోభన

శోభనయోగము నందు జన్మించినవారు సత్వగుణము గలవారు. చాతుర్యము గలవారు, గౌరవర్ణముగ నుందురు. ఎల్లప్పుడు శుభములతో నాడియుందురు.

## అతి గండ

అతి గండయోగమునందు జన్మించినవారు తొందర గలవారు దీర్ఘ ంగు పదములు, హస్తములు గలవారు, సర్వాంగముల యందు రోమములు లవారు నైయుందురు, కపటియు బూటకము చేయువాడును అగును.

## సుకర్మ

సుకర్మ యోగమునందు జన్మించినవారు, పుష్టియగు శరీరమును

పరోపకారబుద్ధి కలిగియుందురు. సర్వకాలములందును ప్రవీణులుగ నుందురు.

## ధృతియోగ

ధృతియోగమునందు జన్మించినవారు చపలచిత్తులు-సభలలో ప్రకాశింప జేయువారు, మితభాషణము- మంచిశీలము- వినయము ఇత్యాది సద్గుణములు కలిగియుందురు. ప్రియమగు మాట నేర్పరులగుదురు.

## శూలయోగ

శూలయోగమునందు జన్మించినవార్కి విద్యావినయాదులు ధనము ఇత్యాది తగ్గియుండును. వ్యతిరేక స్వభావులవలె నగుపింతురు.

## గండయోగ

గండయోగమునందు జన్మించినవారు విరోధములను విచారములను పొందుదురు. అధికమగు కోపము కలిగి యుందురు.

## వృద్ధి

వృద్ధి యోగమునందు జన్మించినవారు వాణిజ్యమునందు నేర్పరులు-ప్రేమస్వరూపులు, దయగలవారు సమస్త వస్తు సంగ్రహమును కలిగియుందురు.

## ధృవయోగ

ధృవయోగమువందు జన్మించినవారు సత్యవాదులు ప్రతాపవంతులు వేగముగా మాట్లాడువారు శ్రీమంతులు శ్రేష్ఠమైన కీర్తికలవారగుదురు.

## వ్యాఘాత

వ్యాఘాత యోగమునందు జన్మించినవారు క్రియాశూన్యులు దురాచారులు అవశ్య వచనములను వృథావాదము చేయువారగుదురు.

## హర్షయోగ

హర్షణ యోగమునందు జన్మించినవారు మంచి స్వరమును సద్వస్త్రములను సువర్ణ రత్నాద్యలంకారము లను కలిగి యుందురు. శత్రునాశనము చేయుదురు.

## వజ్రయోగ

వజ్రయోగము నందు జన్మించినవారు బంధువర్గముతో కూడియుం

దురు. గుణవంతులు, రత్న పరీక్షయందు నేర్పరులు మంచిబుద్ధియు సత్యవాక్కును గలవారగుదురు.

## సిద్ధియోగ

సిద్ధియోగమునందు జన్మించినవారు మంచిశీలము ఉదారబుద్ధి దిన దిన భాగ్యాభివృద్ధి కలిగి యుందురు. శాస్త్రసారమును గ్రహింతురు.

## వ్యతీపాతయోగ

వ్యతీపాతయోగమునందు జన్మించినవారు నిష్ఠురముగ మాట్లాడు దురు. చెడుస్వభావము, ఇతరుల కార్యములను చెడగొట్టువారగుదురు.

## వరీయాన

వరీయాన యోగమునందు జన్మించినవారు స్వల్ప లాభమును పొందుదురు. వ్యయమును చేయుదురు. తాము బాగా అనుభవించు స్వభావ మును గలిగి యుందురు, మంచి కార్యములకు ధనమును దానముచేయు దురు.

## పరిఘ

పరిఘయోగమునందు జన్మించిన మానవుడు, అబద్ధపు సాక్ష్యములు పలుకును. ప్రతాపవంతుడు, ఓర్పులేనివాడు స్వల్పముగా భుజించును, బంధుమిత్రవర్జితుడు, శత్రువులవల్ల దుఃఖమును పొందును.

## శివయోగ

శివయోగమునందు జన్మించినవారు, దేహపుష్టి ఇంద్రియ నిగ్ర హము, యంత్ర తంత్ర మంత్ర రహస్యములను దెలిసిన వారు అగు దురు.

## సిద్ధయోగ

సిద్ధయోగమునందు బుట్టినవారు సత్యమును బలుకువారు, మనో బలమును కలిగియుందురు. సత్కార్యములను నిర్వహించుట యందు సమర్థులు.

## సాధ్యయోగ

సాధ్యయోగమునందు జన్మించిన నరుడు, సాహసము, ప్రతాపము,

కలిగియుండును, కార్య చతురుడు, గుణవంతుడు నీతిని దెలిసినవాడు శత్రుఫలము నహరించువాడు నగును.

## శుభయోగ

శుభయోగమునందు బుట్టినజనుడు, మంచి పనులను చేయువాడు, మంచి ఆచారములు కలవాడు, వాగ్విలాసము, శుభలక్షణములు కలవాడు, మంచి ఆజ్ఞలను చేయువాడునుయగును.

## శుక్ల యోగ

శుక్లయోగమునందు జన్మించినవారు ఇంద్రియములను జయింతురు. సత్యవాదులు యుద్ధమునందు జయమును పొందువారు, తెల్ల పుష్పమాలలను వస్త్రములను ధరించువారు నగుదురు.

## బ్రహ్మయోగ

బ్రహ్మయోగమునందు జన్మించినవారు మంచియలవాట్లను, సత్కీర్తి శాంత స్వభావము ప్రతాపము ఇత్యాది కలిగియుందురు.

## ఇంద్రయోగ

ఇంద్రయోగమునందు జన్మించినవారు బలవంతులు, ఐశ్వర్యవంతులు మంచిగాత్ర మాధుర్యమును చంద్రునిబోలు ముఖమును కలిగియుందురు.

## వైధృతియోగ

వైధృతియోగమునందు జన్మించినవారు, భక్తిలేనివారు చంచలత్వముతో కూడిన చెడుస్వభావము గలవారు అసాధువులు విద్యలేనివారగుదురు.

—: యోగఫలం సమాప్తం :—

## కరణ ఫలం

### బవ ఫలం

బవకరణమునందు జన్మించినవారు మంచిశీలము, బలము, దయ, విచక్షణ ఇత్యాదిగుణములు కలిగియుందురు. స్వల్పకాలములోనే యైశ్వర్య వంతులగుదురు.

### బాలవఫలం

బాలవ కరణమునందు జన్మించినవారు బలవంతులు విలాసవంతులు, సమస్త కార్యములందు కౌశల్యము గలవారు, బుద్ధిమంతులు, మంచిశీలము గలవారు నగుదురు.

### కౌలవ ఫలం

కౌలవ కరణమునందు జన్మించినవారు వాగ్విలాసము, అభిమానము గలవారు, సత్కర్మలు చేయుదురు, బలాధికులు శ్రేష్టమైన వంశమునందు జన్మ పొందుదురు.

### తైతుల ఫలం

తైతుల యోగమునందు జన్మించినవారు నిర్మల గాత్రమును ఆట పాటలయందాసక్తియు, నేర్పు, విలాసముగా మాట్లాడుట ఇత్యాది కలిగి యుందురు.

### గజకరణ ఫలం

గజకరణమునందు జన్మించినవారు పరోపకారము చేయువారు. విద్య, ఆలోచన, బలము, శౌర్యము మధురగాత్రము కలిగియుందురు.

### వణిజ ఫలం

వణిజ కరణమునందు జన్మించినవారు ప్రజ్ఞావంతులు, వ్యాపార మూలక ధనలాభము కలిగి యుందురు. నమస్త ఫలముల పొందుదురు.

### విష్టి ఫలం

విష్టికరణము నందు జన్మించినవారు శతృనాశనము చేయుదురు. అధిక నిద్రకలిగి యుందురు. మంచి బుద్ధిమంతులు అయి యుందురు.

—: ఫలం నమాప్తం :—

## ద్వాదశ లగ్న ఫలం

### మేషలగ్న ఫలం

మేషలగ్నమునందు జన్మించినవారు గుణవంతులు, అధిక కోష్ణులు, స్వజనులకు విరోధులు, పరాక్రమవంతులు, అత్యంత కీర్తియుతులు

## వృషభలగ్న ఫలం

వృషభలగ్నమునందు జన్మించినవారు శౌర్యము, వీరత్వము, ప్రతాపము ఇత్యాది గుణములును- గొప్పవైన ఆశయములను గురుదేవతా భక్తియు కలిగియుందురు.

## మిధునలగ్న ఫలం

మిధున లగ్నమునందు జన్మించినవారు ధనధాన్యయుక్తులు, ఔదార్యము, సత్పుత్రులు గలవారు, మంచిశీలము, బుద్ధియుగల మిత్రులను కలిగియుందురు.

## కర్కాటక ఫలం

కర్కాటక లగ్నమందు జన్మించినవారు పీతికలిగియుందురు. లోల బుద్ధియు, జలక్రీడలయందు ప్రీతియు, మధురపదార్థములను భుజించుదురు, మంచి భోగముగలవారు.

## సింహలగ్న ఫలం

సింహలగ్నమందు జన్మించినవారు అభిమాన వంతులు, పరాక్రమము- మంచిబుద్ధి- చతురత గలిగి యుందురు. ఉదార స్వభావులు- అల్పభక్షణులు- కృశించిన కడుపు గలవారు.

## కన్యాలగ్న ఫలం

కన్యాలగ్నమునందు జన్మించినవారు, సద్గుణవంతులు- జ్ఞాన సంపన్నులు, నేర్పుగలవారు- స్త్రీలయందభిమానము గలవారు కామక్రీడానసక్తులు.

## తులాలగ్న ఫలం

తులాలగ్నమందు జన్మించినవారు క్రయ విక్రయములందు నేర్పరులు- అధికమగు గుణములు గలవారు తన వంశమునందు అధికమగు పేరు ప్రతిష్ఠలను కలిగియుందురు.

## వృశ్చికలగ్న ఫలం

వృశ్చిక లగ్నమందు జన్మించినవారు- కళాప్రియులు- సదాచారులు, శూరులు, అత్యంత విమర్శనలను చేయువారు- సమస్త విద్యలందు ప్రవీణులు.

## ధనుర్లగ్న ఫలం

ధనుర్లగ్నమందు జన్మించినవారు ధనుర్విద్యా ప్రవీణులు, యదార్థ వాదులు, నిశ్చితాభిప్రాయులు- దాస దాసీజనులను కలిగియుందురు.

## మకరలగ్న ఫలం

మకరలగ్నమునందు జన్మించినవారు కుటిల స్వభావులు- లోభులు- చెడుతలంపులు గలవారు, అధిక సంతతి కలవారు.

## కుంభలగ్న ఫలం

కుంభలగ్నమునందు జన్మించినవారు డాంబికముగ నుందురు. కపటము- గర్వము మోసము వీరి స్వభావమునందిమిడి యుండును. శత్రువులకు ద్రోహము చేయుదురు. కోర్కె అధికముగలవారు చంచలస్వభావులు మధురముగ మాట్లాడుదురు. స్వబంధుజనమునకు ఉపాధిని కలిగించును.

## మీనలగ్న ఫలం

మీనలగ్నమునందు జన్మించినవారు స్వల్పముగ భుజింతురు. చాతుర్యము గలవారు, లోలనేత్రములను, మంచిరూపమును కలిగియుందురు. బంగారము, రత్నాది అలంకారములు కలిగియుందురు.

ద్వాదశలగ్నఫలం సమాప్తం

# ద్వాదశ భావస్థిత నవగ్రహ ఫలం

## రవిఫలం

లగ్నమందు సూర్యుడున్నయెడల ఎర్రని నేత్రములును అధిక కోపమును, వాతపైత్యసంబంధమైన బాధలు కలుగును- ఇతర చోట్లనుంచి ధనలాభము కలుగును.

రెండవరాశిలో రవియున్నయెడల భాగ్యవంతులగుదురు. కుటుంబ సౌఖ్యముండును. ధనము, సంతానము, వాహనము మొదలగువానిని కలిగియుందురు.

మూడవరాశిలో రవియున్నయెడల జ్యేష్ఠసోదర నష్టము కలుగును.

స్వప్రయోజనము వలన ధనలాభము కలుగును- శత్రునాశనము రాజ సుఖము కలుగును.

నాల్గవయింట రవియున్నయెడల సుఖము లేనివారును ధనము కొరకు విచారపడువారు నగుదురు. మాతా పితృ సౌఖ్యము స్వల్పముగా నుండును.

పంచమ స్థానమందు రవియున్నయెడల స్వల్పసంతతి యుండును. శాస్త్రవేత్తలగుదురు. వైద్యమంత్రశాస్త్రముల నభ్యసింతురు.

ఆరవయింట రవియున్నయెడల శత్రు, రోగనాశనము కలుగును. రాజద్వారమునందు గౌరవము కలుగును. మేనమామకు కష్టముకలిగించును.

సప్తమ స్థానమందు రవి యున్నయెడల స్వల్పలాభము కలుగును. కళత్రదుఃఖము శరీరనారోగ్యమును కలుగును.

అష్టమస్థానమందు రవి యున్నయెడల అనేక కార్యములతో కూడు కొని యుండువారును పరస్త్రీ చోరులు వేశ్యామూలకముగా ధన వ్యయము కలుగును.

తొమ్మిదవ స్థానమందు రవియున్న యెడల, దానధర్మములు సత్కా ర్మలు చేయుదురు- వ్యవహారమునందు నేర్పుకలిగి యుందురు. మాన్యులు, సోదరులు విచారము కలిగింతురు.

పదవస్థానమందు రవియున్నయెడల రాజసమానులగుదురు. మాతృ కష్టమును, సర్వకార్యసిద్ధియు కలుగును.

పదకొండవ స్థానమందు రవి యున్నయెడల వాహనాది సుఖములు కలుగును. రాజద్వారమందు ధనలాభము కలుగును. శతృవులకు భయము కలిగింతురు.

పండ్రెండవ స్థానమందు రవియున్నయెడల శరీర పీడలుగ్గాని, అల్పదృష్టినిగాని కలిగియుందురు. విదేశములలో ధనవ్యయము కలుగును. బంధువులకు శతృవులకు విచారము కలిగింతురు.

## చంద్ర ఫలం

మేష-వృషభ- కర్కాటక లగ్నములందు చంద్రుడుండెనేని సుఖము కలుగును. ఇతరములైన లగ్న చంద్రునివల్ల దుఃఖము-చెముడు గ్రుడ్డి జడత్వము ఇత్యాది కలుగును.

రెండవరాశిలో చంద్రుడున్న యెడల స్త్రీలకు ప్రీతికలవారగుదురు. సర్వ సంపదలను కలిగియుందురు. స్వల్పస్నేహమును పెద్దకుటుంబమును కలిగియుందురు.

మూడవరాశిలో చంద్రుడున్న యెడల అధికబల సంపన్నులు, కృషిమూలకముగాను, స్త్రీలవల్లను, ధనలాభము కలుగును.

నాల్గవయింట చంద్రుడున్నయెడల రాజమూలక ధనప్రాప్తి కలుగును. దారాపుత్రాదులతోను, సోదరులతోను, దినదినానందముతో నుందురు

ఐదవయింట చంద్రుడున్న యెడల శ్రేష్ఠమైన బుద్ధియు నిర్మలమగు మనస్సును కలిగియుందురు. బంగారము, భూమి, ధనము మొదలగునవి కలిగియుందురు. తప్పక దాతలగుదురు.

ఆరవయింట చంద్రుడున్న యెడల రాజభయము కలుగును. శతృవృద్ధియుండును. దినదినాభివృద్ధిగ విచారము కలుగును.

ఏడవ రాశియందు చంద్రుడున్నయెడల దానధర్మములతోను సత్కర్మలతోకూడియుండును. నేప్పు, రూపము, పాతివ్రత్యము, మధుర సంభాషణము గల కళత్రము సిద్ధించును.

ఎనిమిదవ యింటిలో చంద్రుడున్న రసాయన శాస్త్రమునందు ప్రజ్ఞకలిగియుందురు. జోతిషవైద్య శాస్త్రములందు ప్రజ్ఞ కలిగియుందురు

తొమ్మిదవయింట చంద్రుడున్నచో చంద్రునిబోలు ముఖమును భాగ్యాభివృద్ధియు, శరీర సౌఖ్యమును కలుగును.

పదవస్థానమందు చంద్రుడున్న యెడల నూతనస్త్రీ ప్రేమయు కలుగును. గజాది వాహనములును, మదాధికారమును కలుగును. సుఖ సంపదలతో ప్రకాశింతురు.

పదకొండవ స్థానమున చంద్రుడున్నయెడల రాజమూలక ధన

లాభము కలుగును. నూతనవస్తువులు వస్త్రములు కలుగును. ఇతర దేశ మునందు ప్రీతి యుండును.

పండ్రెడవ యింటియందు చంద్రుడున్న యెడల నేత్రపీడ శత్రు సంబంధమైన పీడ కలుగును. తండ్రికి దేహపీడ యుండును. స్త్రీలు ఇట్టివానియం దభిమానము తగ్గియుందురు.

## కుజఫలం

లగ్నములో కుజుడున్న యెడల శిరస్సు-నేత్రసంబంధమైన పీడలు కలుగును. మరియు, దండము, లోహము, అగ్నివీటి వల్ల భయమును, దశాకాలమందు వ్రణసంబంధమైన పీడలు కలుగును.

రెండవ స్థానమున కుజుడున్న జాతకుని ధనము కోతికిచేసిన అలంకారమువలె నిష్ప్రయోజనమగును. ఎవరును ఇట్టివానికి దరిజేరరు.

మూడవ యింటనున్న కుజుడు బలపరాక్రమముల నశింపజేయును. ధనహాని, బంధు నష్టమునిచ్చును. శాత్రుకష్టమును కలిగించును.

నాల్గవయింట కుజుడున్న యెడల ఏమి శుభఫల మిచ్చును? ఈయ దనుభావము. నూతనోపాయములచేత స్వల్ప, భూ ధనలాభమును స్వల్ప సౌఖ్యమును పొందెదరు.

పంచమున కుజుడున్న యెడల సంతతికి కష్టము కలుగును. అనేక శాస్త్రములు తెలిసికొందురు. మంత్ర, యంత్ర శాస్త్రములందు ప్రవీణులగుదురు.

ఆరవయింట కుజుడున్న యెడల శత్రువులను జయింతురు. రాజ ప్రియము కలిగి యుందురు. ధనధాన్యములుండును. మామకు విచారము కలుగును.

సప్తమ స్థానములో కుజుడున్న యెడల స్త్రీలకు భర్తయును, పురుషులకు భార్యయు క్రమముగ నశించెదరు.

అష్టమమందు కుజుడున్నయెడల ఏమి ఫలమిచ్చును? మిత్రులను శత్రువులుగ జేయును. మంచిపనులు చెడ్డగమారి నిష్ప్రయోజన మగును.

తొమ్మిదవయింట కుజుడున్నయెడల చెడుపనులయం దధిక లాభ మును మంచివానియందు స్వల్పలాభమును కలుగును. సోదరులను లెక్క జేయరు.

పదవ యింటియందు కుజుడున్నయెడల సింహ తుల్యమైన పరాక్ర మము కలిగియుందురు. అనేకమంది దాసదాసీ జనులుందురు. జీర్ణగృహ మందు జన్మించియుందురు.

లాభస్థానమందు కుజుడున్నయెడల గోవులు, ధనము, వాహనము యిత్యాది కలిగియుందురు. శత్రువులు సైతము సుఖముగా నుందురు.

పంద్రెండవ స్థానములో కుజుడున్నయెడల దశాకాలమునందు విచారమును ధననష్టము కలిగించును. శస్త్రమువలన జననము కలుగును. ధననష్టము ఇష్టకార్యములు నెరవేరక పోవుట చెప్పవలెను.

## బుధ ఫలం

లగ్నమందు బుధుడున్నయెడల వైద్యవిద్యా విశారదులగుదురు. సభలలో గౌరవింప బడుదురు. మరియు ప్రతిష్ఠ గలిగియుందురు.

రెండవరాశిలో బుధుడున్నయెడల సమస్త సంపదలను కలిగి యుందురు. విద్వాంసులు, శూరులు, వ్యాసునివలె సమస్త విద్యాపారంగతు లగుదురు.

తృతీయమందు బుధుడున్నయెడల వాణిజ్యమునందును మంత్రము లందును నేర్పు కలిగి యుందురు- నీతి శాంతస్వభావము సర్వకార్యము లందు నేర్పు ఇత్యాది కలిగియుందురు.

నాల్గవయింట బుధుడున్నయెడల సమస్త సుఖములు కలుగును. పశుసంపదయు గృహములు వాహనములు మొదలగునవి యుండును. దశాకాలమునందు ధనవృద్ధి కలుగును.

పంచమస్థానమందు బుధుడున్నయెడల తొలిసంతానము నష్టము కలుగును. మంత్ర తంత్రములందును మారణము ఉచ్చాటనము మొదలగు మంత్రక్రియలయందు నేర్పు కలుగును.

ఆరవయింట బుధుడున్నయెడల జనవిరోధియగును. మిత్రులే శత్రువులగుదురు. వ్యవహారములందు క్రోధయుక్తులగుదురు. యతుల యందలి జ్ఞానమును ప్రకాశింప చేయువారగుదురు.

సప్తమనందు బుధుడున్నయెడల మంచి స్వరూపము, చంచల స్వభావము నిరోగిత్వము కలిగియుందురు. ఇట్టిజాతకుడు స్వల్ప రతి కలిగి యుండుటవలన స్త్రీ తృప్తిని పొందజాలడు.

అష్టమస్థానమునందు బుధుడుండెనేని జాతకుడు శతాయుష్యము గలవాడగును. అన్యదేశములనుండి ధనప్రాప్తియు, రాజులవల్ల గౌరవ మును పొందువాడగును.

తొమ్మిదవయింట బుధుడున్న యెడల మంచిదీక్ష గలవారు ధర్మ వంతులగుదురు. రాజప్రతాపము కలిగి యుందురు. స్వకులమునందు సూర్యునివలె ప్రకాశింతురు.

పదవస్థానమందు బుధుడున్నయెడల రాజ సమానులగుదురు. మాతా పితరుల యెడలను గురువుల యెడలను భక్తికలిగియుందురు. పిత్ృ ధనముతో తీర్థయాత్రలు చేయుదురు.

లాభస్థానమందు బుధుడు లేకున్నయెడల ఒకప్పుడైనను లాభము ప్రాప్తించదు. అనగా, లాభమునందు బుధుడుండిన నిరంతర ధనలాభ ప్రాప్తికల్గును. దేవతలను బ్రాహ్మణులను తృప్తిపరతురు. సత్కార్యముల మూలకముగా ధనవ్యయము చేయుదురు.

పంద్రెండవ స్థానములో బుధుడున్నయెడల దేవతారాధన కొరకు ధనవ్యయము చేయుదురు. యుద్ధమునందు శత్రుక్షయము కలుగును. ధనా గారమునందు బహుధనము నిల్వయుండును.

## గురు ఫలం

లగ్నమునందు గురువున్నయెడల దివ్యదేహము కల్గును. మంచి భూషణముల ధరింతురు. బుద్ధిమంతులు. పూజింపబడుచుందురు. సద్గుణ ములు ఐశ్వర్యముతో కూడియుందురు. రాజ్యాధికార ప్రాప్తియు కలుగును.

రెండవరాశిలో గురువున్నయెడల అతికష్టముమీద ధనము కలు గును. కవిత్వము వచ్చును. గృహమందు ధనము నిలవ యుండదు.

మూడవయింట గురువున్నయెడల భాగ్యలబ్ధి యుండదు. మిత్రులు కృతఘ్నులగుదురు. బంధుసుఖము స్వల్పము.

నాల్గవస్థానములో గురువున్నయెడల వాహనాది సుఖములు కలు గును. దేవతల యెడలను బ్రాహ్మణులయెడలను భక్తి కలిగియుందురు. శత్రువులుకూడా సేవకులవలె దాసులగుదురు.

పంచమస్థానమందు గురువున్నయెడల మంచిజ్ఞానము కలుగును.

స్వల్పముగ మాట్లాడుటయు వ్రాతలో నేర్పునుండును. పుత్ర ధనయుక్తు డగును.

ఆరవయింట గురువున్న యెడల కృశించిన దుర్బలదేహము నిరంతర వ్యాధిపీడితుండు తల్లి మేనమామలకు ఆరోగ్యము తగ్గియుండును. శత్రువులకు జయింపరాని వాడగును.

సప్తమములో గురువున్న యెడల ప్రియమగు వాక్కుగల సత్కళత్రము లభించును. జాతకులు ధనవంతులు బుద్ధిమంతులగుదురు. మన్మధ సమాన సుందరుడగును.

ఎనిమిదవ స్థానములో గురువున్న యెడల రోగములు లేక చిర కాలము జీవింతురు. జీవితములో ఒక స్థానమున వసతియుండనేరదు. అంత్యమునందు పుణ్యలోకమును పొందుదురు.

తొమ్మిదవయింట గురువున్నయెడల స్వధర్మములను నిర్వర్తింతురు. నీతిమంతులు యశలులగు సోదరులుందురు. సంతోషమునందును దానమునందును ప్రకాశించు స్వభావము గల్గియుందురు.

పదవస్థానమందు గురువున్న యెడల ధ్వజధారులు పేరు ప్రతిష్ఠలు కలవారగుదురు. ధనవంతులగుదురు. చిత్ర విచిత్ర గృహములను కలిగి యుందురు. జీవితములో మొదటి భాగమందు అధికముగ ధనము సంపాదింతురు.

లాభస్థానమందు గురువున్న యెడల తండ్రి-సోదరులు, సేవకులు మొదలగువారి సౌఖ్యముకలిగియుందురు. ఏనుగులు, మొదలగు వాహనములను వస్తుసంపదలను కలిగియుందురు.

పండ్రెండవ స్థానములో గురువున్న యెడల అభిమానవంతులగుదురు. న్యాయమార్గమున ధనసంపాదన చేయుదురు. సత్కార్యములకొరకు ధనధాన్యదాన ప్రయములనొనర్చినను కూడా కీర్తిమాత్రము లభించదు.

## శుక్రఫలం

లగ్నములో శుక్రుడున్న యెడల మంచిరూపమును, సన్మిత్రులనిన ఇష్టపడుదురు. మంచి వస్త్రములను మంచిపనులను చేయుటయందాసక్తి కలిగియుందురు. అలంకారములుండును,

రెండవస్థానమందు శుక్రుడున్న యెడల మంచి ముఖసౌందర్యమును వాక్కును బుద్ధియు ఇత్యాది కలిగియుందురు. దానధర్మాదుల యందు ఆసక్తి యుండును.

తృతీయస్థానమందు శుక్రుడున్న యెడల ప్రీతికలిగియుందురు. స్త్రీలకు మోహమును పుట్టించువాడగును. సంతానమువల్ల నుంచి సేవకులనుంచియు సంపూర్ణసౌఖ్యము పొందుదురు. యుద్ధమునందు భయశీలము కలవారగుదురు.

నాల్గవయింట శుక్రుడున్న యెడల అధికమగు మహత్తును సుఖము సంపత్తు కలిగియుందురు. శతృవులవిషయమందైనను ప్రియముగా మాట్లాడుదురు.

పంచమస్థానమందు శుక్రుడున్న యెడల మంత్రశాస్త్ర పారంగతులగుదురు. కవిత్వమునందును మధుర పదార్థములందును ప్రీతికలిగి యుందురు.

ఆరవయింట శుక్రుడున్నయెడల త్రోవలో చోరుల వలన భయము కలుగును. క్షుద్రదేవతా రాధనము చేయుదురు. పశ్చాత్తప్తులగుదురు.

సప్తమ స్థానములో శుక్రుడున్న యెడల విదేశగమనము కలుగును భార్య అతిసుందరురాలును, శీలవతియగును. దశాకాలమునందు పుత్రసంతానము కలుగును— (గర్భ ధారణము కలుగును.)

ఎనిమిదవయింట శుక్రుడున్న యెడల దీర్ఘాయుష్మంతు లగుదురు. కష్టముమీద అధికలాభము కలుగును. గజాశ్వాది వాహనసుఖము కలుగును.

తొమ్మిదవ యింట శుక్రుడున్న యెడల శరీర సౌఖ్యము కలుగును. గృహము సోదర-పుత్ర-మిత్ర బృందములతో కూడుకొనియుందురు. ఆనందకరముగా ప్రకాశించును.

పదవస్థానములో శుక్రుడున్న యెడల కార్యకరణ కోవిదులగుదురు. బ్రాహ్మణధర్మములను కలిగియుందురు. ధనముకొరకు భూమియందెక్కువగా సంచరింతురు.

పదకొండులో శుక్రుడున్నయెడల మంచి శీలమును చాతుర్యమును

ధనమును కలిగియుందురు. దేశములో అధికవిఖ్యాత కీర్తిని పొందుదురు. భూసంపదైశ్వర్య వంతుడగును.

పంద్రెండవస్థానములో శుక్రుడున్న యెడల ధర్మము, గుణము కీర్తి యిత్యాది కలిగియుందురు. మిత్రులే శత్రువులగుదురు-ఉన్న సర్వ శ్వము ఖర్చు అయిపోవును.

## శనిఫలం

లగ్నములో శని యున్నయెడల స్థూలమైన శరీర ముండును. ధన సంపాదనయం దధికకోర్కె ఆశయము కల్గియుందురు. దృష్టిదోషము కలిగింతురు. చూచినంత మాత్రము చేతనే శత్రునాశనము కలుగును.

రెండవ స్థానములో శని యున్నయెడల కుటుంబ విషయములందు విముఖులుగ నుందురు. సమస్త భోగ భాగ్యములను కలిగియుందురు. ఎల్ల ప్పుడు నిష్ఠురముగ మాట్లాడుచుందురు.

తృతీయములో శనియున్న యెడల భాగ్య విషయమున తప్ప మిగిలినయన్ని విషయము లందును విఘ్నములు యుండవు వీరికెన్నడును చిత్తశాంతియుండదు. ఇతరులచే సత్కరింప బడినను గూడ వీరు తృప్తి జెందక అయుక్తముగనే మాట్లాడుదురు. ముఖరోగము కలవారగుదురు.

చతుర్థమందు శనియున్నచో మాతాపితరులకు విచారము కలుగును. బంధువర్గమునం దపవాదము పొందుదురు. గృహ వాహనములుండును.

ఐదవస్థానములో శని యున్నచో సంతతికి కష్టము కలుగును. మందబుద్ధియు, మంచిశీలము కలిగియుందురు. శాస్త్రప్రమాణములందు వమ్మకముండదు.

ఆరవయింట శనియున్నయెడల శత్రుఋణ-రోగములు నశించును. రాజమూలక ధనలాభము కలుగును. మేనమామ సౌఖ్యముండదు.

సప్తమములో శనియున్నయెడల కళత్రము రోగయుక్తురాలగును. ధనము, మిత్రులు, దారాపుత్రాది సౌఖ్యము చిరకాలముండును.

ఎనిమిదవస్థానములో శనియున్నయెడల జనసామాన్య వియోగము వలన స్నేహప్రీతి కలుగును. తొందర తనమువల్ల ధననాశము కలుగును.

తొమ్మిదవయింట శనియున్న యెడల యోగసాధనము చేయుదురు. రజోగుణ ప్రధానులు. సోదరులకు స్వల్పప్రీతి కొలుపుదురు.

పదవస్థానములో శనియున్నయెడల మాతృసుఖమెట్లు కలుగును? అనగా యుంతనేరదు అని భావము. స్వయం కృషిపలన అభివృద్ధిలోనికి వత్తురు. పితృకష్టము కలుగును.

పదకొండవ స్థానములో శనియున్న యెడల ధనమాన గౌరవాదులు చిరకాలము స్థిరముగా నుండును. రోగకారణములు నశించగలవు.

పన్రెండవ స్థానమందు శనియున్న యెడల మందదృష్టి కలవార గుదురు. విదేశములందుప్రీతిగలవారునులజ్జాహీనులునగుదురు.స్వగృహము నందును, స్వదేశమునందును ప్రీతి అల్పము. వ్యయస్థానమునందు శనిస్వ క్షేత్రగతుడైన శత్రు నాశము చేయును,

## రాహుఫలం

లగ్నమునందు రాహువున్నయెడల ఆడినమాట తప్పకుందురు. బహుభార్యలతో సుఖించుచు కూడా తృప్తిచెందరు. అధికమైన కోర్కెలు కలిగియుందురు. చక్కని వేషధారణ కలిగియుందురు.

రెండవ స్థానములో రాహువున్న యెడల కుటుంబ జీవితమున పీడ కలుగును. మాయలేనివారు, సత్యముపలుకు వారగుదురు. కారాగార వాసము చేయుదురు.

మూడవయింట రాహువున్న యెడల బలవంతులు, పరాక్రమ వంతులు సోదరులతోను బంధువులతోను కూడియుందురు. స్వల్పభాగ్యము కలిగియుందురు.

నాల్గవయింట రాహువున్న తల్లికి దుఃఖము కలుగును. హృద యమునందు తాపము కలుగును. బాహ్యముగా శాంతమును పొందినట్లుం డును. మేష కర్కాటక మిధునములందు చతుర్థస్థితి కలిగినప్పుడు ఉత్తమ ఫలితమునిచ్చును. రాజతుల్యులగుదురు. రాజబంధువులుగాని రాజప్రేమను పొందినవారుగాని యగుదురు. తల్లి చిరాయువగును.

పంచమున రాహువున్న యెడల దారాపుత్రాదులను గురించి విచా రము కలుగును. జాతకుడు కుక్షిపీడతో బాధపడును. భార్య అధమురాల గును. మిక్కిలి కపటముకలదగును.

ఆరవయింటియందు రాహువున్న యెడల ధనవృద్ధి బలవృద్ధియుండును శత్రునాశనము కలుగును. మాటకు స్థిరసంకల్పముండును.

సప్తమ స్థానములో రాహువున్న యెడల కళత్రమనారోగ్య వంతు రాలగును. మనశ్చింతయు లోకాపవాదమును కలుగును.

అష్టమ స్థానమందు రాహువున్న యెడల పండితులచేతను రాజుల చేతను పూజింపబడుదురు. స్వపరాక్రమము వలన ధన సంపాదనము చేయుదురు. శత్రువులకు భయము కొలుపుదురు.

తొమ్మిదవ స్థానమునందు రాహువున్న యెడల బంధువర్గమును పోషించువాడగును. రాజమూలక ధనలాభము కలుగును. తీర్థయాత్రలు దేవాలయములందు ప్రీతి కలిగియుందురు.

పదవస్థానమందు రాహువున్నయెడల మ్లేచ్ఛజనుల యెడ ప్రీతిని కలిగియుందురు. ఉచ్ఛ స్త్రీ సంభోగము కలుగును. దుర్మార్గుల మూల కముగా ధనవ్యయము చేయుదురు.

లాభస్థానము (పదకొండవ స్థానము)లో రాహువున్నయెడల మ్లేచ్ఛుల మూలకముగ ధనలాభము కల్గును. ఇట్టిజాతకునియొక్క సేవకులు ధూర్తులగుదురు, భార్యయు ధూర్తురాలగును.

పంన్రెండవ స్థానములో రాహువున్నయెడల వాతరోగము వలన బాధింపబడుదురు. సాధుజన విరోధము, దుష్టజన ప్రీతియు కల్గును.

కేతుఫలం

లగ్నమందు కేతువున్నయెడల బంధుజనులవల్ల విచారము కష్టము పీడ కలుగును. వాతసంబంధమైన పీడలు కలుగును. ఎల్లప్పుడు స్త్రీ విషయిక చింత కలిగియుండును.

రెండవ స్థానములో కేతువున్నయెడల ధననాశనము కల్గును. చెడ్డగా మాట్లాడుదురు. కుటుంబ విరోధములు ముఖరోగము కల్గును. ధనస్థానమునందే కేతువు స్వక్షేత్రవర్తి యగుచేని ధనలాభము, కుటుంబ సౌఖ్యము మంచివాక్కు మొదలగు శుభఫలములు నిచ్చును.

మూడవస్థానములో కేతువున్నయెడల వివాదము కల్గును. ధన

వంతులగుదురు. అనేక విధములగు పీడలు బాధించును, మనోద్వేగము బంధువర్గ నాశనము కలుగును.

నాల్గవ యింట కేతువున్నయెడల మాతృపీడ కలుగును. పితృ నాశనము కలుగును. ఉచ్చ స్వక్షేత్రములందున్నయెడల వ్యతిరేక ఫలములు కలుగును. అనగా శుభప్రదుడగును.

పంచమస్థానమందు కేతువున్నయెడల అల్పసంతతి కలుగును. ఉదరమునందు వాతరోగము గలవాడగును. బుద్ధిబలము తక్కువగ నుండును.

ఆరవయింట కేతువున్నయెడల రోగనాశనము, శత్రుజయము కలుగును. రాజద్వారమందు జయము గౌరవము ప్రాప్తించును. ఇంటియందు (గేదెలు) పాడి సమృద్ధిగానుండును.

సప్తమమందు కేతువున్నయెడల కళత్ర సౌఖ్యము కొంచెమైనను పొందనేరడు. మార్గమందు విచారము జలభయము కలుగును. కేతువు స్వక్షేత్రమగు సప్తమమందుండెనేని శుభఫలములనిచ్చును. కళత్ర సౌఖ్యాదుల నొసంగును.

అష్టమమందు కేతువున్నయెడల ఆసనపీడ కలుగును. అష్టమ స్థానము కన్య, వృశ్చిక, మేష, వృషభ మిధునములందున్నచో ఎల్లప్పుడు లాభము నిచ్చును.

తొమ్మిదవ స్థానమందు కేతువున్నయెడల ధన పుత్రుల విషయమై విచారముండదు. క్లేశరహితమగు జీవిక కల్గును. మ్లేచ్ఛుల మూలకముగా ధనలాభము కలుగును. ఇట్టి కేతువు అనేక రోగములను కలిగించును.

పదవ స్థానమందు కేతువున్నయెడల పితృసౌఖ్యముండదు. మేష కన్యా వృషభ వృశ్చికములు అష్టమ స్థానమై అందెందేనియున్నచో శత్రునాశనము ధనలాభము కలుగును.

లాభమందు కేతువున్నయెడల ధనలాభము కలుగును, భాగ్యవంతుడగును. విద్యాలాభము గాత్రమాధుర్యముండును. అధికమగు ఐశ్వర్యము కలిగి ఎక్కువ విలువగల వస్త్రముల ధరించును. సంతతికి కష్టము కలుగును.

పంచ్రెడవ స్థానమందు కేతువున్నయెడల శత్రునాశనము కలుగును. రాజతుల్యులుగ నుందురు. వస్తి గుహ్య నేత్ర పాదాద్యవయవములకు పీడ కలుగును. మేనమామలకు సౌఖ్యము కలుగును. మేనమామవలన జాతకుడు సౌఖ్యవంతుడగును.

# ద్వాదశబావ పలం

## తనుభావఫలం

మేషము లగ్నమయినచో శ్లేష్మాధిక్యమును అధిక క్రోధమును మందబుద్ధియు కలిగియుందురు. స్థిరమగు చిత్తవృత్తియును, స్థిరమైన జీవనోపాధియు కల్గియుండును. స్త్రీలకు సేవ చేయుదురు.

వృషభము లగ్నమైనచో శస్త్రాదుల వలన అపాయము ధన వ్యయము కలుగును. వియోగము కలహము దుఃఖము ఇత్యాది కలుగును. పైత్య సంబంధమగు పీడలు కలుగును.

మిధునము లగ్నమైనచో గౌరవర్ణముగ నుందురు. దారా (పుత్రాది విచారములు కలుగును.) ప్రసన్నమైన వారు, ప్రియమైన వాదమును చేయుదురు.

కర్కాటకము లగ్నమైనచో పిత్తప్రకోపము కలుగును. శుచి కలిగియుందురు. ధర్మవర్తనులగుదురు. ధర్మమునకు పట్టుగొమ్మయన నగును. ఓర్పును పట్టుదలయును కలిగియుందురు, నీటియందును కురు పేర్మినందును, రుచి ప్రేమను కలిగియుందురు.

సింహము లగ్నమైనచో పాండువర్ణముగ నుందురు. తీక్షణమైన బుద్ధి కలిగియుందురు. ప్రగల్భములను పలుకుదురు. పైత్య వాత సంబంధమైన పీడలు కలుగును.

కన్యారాశి లగ్నమైనచో నీతిమంతులు శ్లేషతత్వము శ్లేష్మతత్వ ద్వంద్వవ్యాధి పీడితులగుదురు. ధనధాన్యములతో కూడియుందురు.

తులారాశి లగ్నమైనచో అత్యంత ప్రీతిగలవారు సత్యవాదులు శ్లేష్మాధిక్యము గలవారు దేవతా గురుభక్తియు రాజగౌరవము కలిగియుందురు.

వృశ్చికరాశి లగ్నమైనచో శత్రువులను దండింతురు. వేద శాస్త్రము లందు ప్రీతికలిగియుందురు. గుణగ్రహణ సమర్థులగుదురు, మునలితనము గనుపించును. గొప్పధనమును పొందెదరు.

ధనూరాశి లగ్నమైనచో ధనుర్విద్యయందు నేర్పరులగుదురు. దేవతలను బ్రాహ్మణులనుపూజింతురు. వాహనాది సుఖములను గలిగియుందురు.

మకరరాశి లగ్నమైనచో పొడవగు శరీరమును, ఉష్ణతత్వమును కలిగియుందురు. తొందరగలవారు, దుష్టకార్యములు చేయువారగుదురు. కొండెములు చెప్పట, ఇతరుల దోషములను సూచించుట మొదలగువానిని చేయుచుందురు.

కుంభరాశి లగ్నమైనచో స్థిరబుద్ధియు, ప్రియవాక్కుచే ఆకర్షణీయమైన మూర్తివంతము కలిగియుందురు. గాత్రమాధుర్యమును పుత్రమిత్రాదులను కూడియుందురు. అభీష్టసిద్ధి కల్గును.

మీనరాశి లగ్నమైనచో స్థూలదేహము కల్గును. కీర్తియు విమర్శనా జ్ఞానమును కలిగియుందురు. అధికముగా మాట్లాడుదురు. మంచి పండితుడగును. కీర్తిని పొందునుగాని చింతాయుక్తుడగును.

## ద్వాదశభావస్థిత లగ్నఫలం

లగ్నాధిపతి లగ్నమందే యున్నయెడల దీర్ఘాయువు నిచ్చును. రాజలక్షణములు కలిగియుందురు. భూమి ధనము గృహము ఇత్యాది గలిగి యుందురు.

లగ్నాధిపతి రెండవయింటిలో నున్నయెడల దానధర్మములు సత్కార్యములు చేయుదురు. కులశ్రేష్ఠులగుదురు. ధనవంతులు ఆరోగ్యవంతమగు శరీరము కలిగియుండును.

లగ్నాధిపతి మూడవయింట నున్నయెడల బంధుమిత్రులను కూడి యుందురు. శౌర్యవంతులు ధర్మాత్ములు బలము శక్తి కలిగియుందురు. ఇట్లిలగ్నాధిపతి దాతృత్వమును, కలుగజేయును.

లగ్నాధిపతి చతుర్థములో నున్నయెడల రాజసమానులగుదురు. దీర్ఘాయువును అధికమగు యాకలిని కలిగియుండెదరు. మాతాపితరులకు సేవ చేయుదురు.

లగ్నాధిపతి పంచమములో నున్నయెడల మంచిపనులు చేయుదురు సత్సంతానము కలిగియుండెదరు. సద్బుద్ధియు నృత్యగీతాది వినోదముల యందు ప్రీతికలిగియుందురు.

లగ్నాధిపతి షష్ఠమ మందున్న యెడల భూలాభము కలుగును. లుబ్ధత్వము, నీచబుద్ధికలిగియుండి ధన లాభమును గడింతురు. తనపగను చంపువాడగును.

లగ్నాధిపతి సప్తమందున్నయెడల జాతకులు తేజోవంతులు శీల వంతులగుదురు. కళత్రము, శీలవతియు, రూపవతియు మధురభాషిణి యగును.

లగ్నాధిపతి అష్టమ మందున్నయెడల నీచులు, లుబ్ధులు, ధన వంతులు నగుదురు- శుభగ్రహమైన యెడల దీర్ఘాయువును, పాపగ్రహ మైన అల్పాయువునిచ్చును.

లగ్నాధిపతి నవమ మందున్నయెడల సత్కార్యములు చేయు వారును బంధుజనులతో కూడియుండువారు నగుదురు. ప్రసిద్ధులగుదురు. కార్యకరణసమర్థులు, శీలవంతులునుగూడ నగుదురు.

లగ్నాధిపతి దశమములో నున్నయెడల పండితులు, మంచి శీల వంతులగుదురు- రాజసన్మానము ధనము పొందుదురు. సర్వవిధముల ప్రసిద్ధి పొందుదురు. గురుపూజ చేయుదురు.

లగ్నాధిపతి లాభములో నున్నయెడల సంతానము- సౌఖ్యము కలుగును. దశాకాలమందు, దీర్ఘాయువు తేజస్సు నిచ్చును- అనేకవిధము లుగా లోభప్రదుడున్ను యగును.

లగ్నాధిపతి వ్యయమందున్నయెడల నిష్ఠురముగను కఠినముగను మాటలాడువారగుదురు. అభిమానవంతులు, నీతిపరులు, దేశాంతర సంచా రము చేయువారును యగుదురు.

### ధనభావ ఫలం

మేషము ధనస్థానమైనచో ధనధాన్యయుక్తులగుదురు. [illegible] వృద్ధిగానుండును. పాండిత్యమును కలిగియుందురు. ఎల్లప్పుడు సత్య [illegible]ర్తనము కలిగియుంధురు.

వృషభరాశి ధనస్థానమైన యెడల కృషికర్మయందభిమానము కలిగి యుందురు. (వ్యవసాయవృత్తి కలిగి యుందురనుట) ఆవులు, గేదెలు, ఎద్లు, బంగారము, వెండి ఇత్యాది కలిగియుందురు.

మిధునము ధనస్థానమైన యెడల స్త్రీమూలక ధనలాభము కలుగును. మంచిరూపము, వస్త్రాభరణాదులను కలిగియుందురు. చతుష్పాద వాహనలాభ ముండును.

కర్కాటకము ధనస్థానమైనయెడల మధుర పదార్థములందు ప్రీతి కలిగియుందురు. స్వప్రయోజనము వలన ధనలాభము కలుగును. సంతాన వర్గము వారియందధిక ప్రీతికలిగియుందురు.

సింహము ధనస్థానమైనచో అరణ్య వస్తువుల మూలకముగా ధన లాభము కలుగును. పరోపకారము చేయుదురు- నీతిపరులు, పరాక్రమ వంతులు నగుదురు.

కన్యారాశి ధనస్థానమైనచో రాజమూలక ధనలాభము కలుగును. బంగారము, రత్నాభరణములు, గజాశ్వాది వాహనములను కలిగియుందురు.

తులారాశి ధనస్థానమైనచో అనేక పుణ్యకార్యములు చేయువారగుదురు. పాషాణాదుల వలనను లోహాదులను భస్మము చేయుట వలనను ధనము కలుగును.

వృశ్చికరాశి ధనస్థానమైనచో స్వధర్మమును పాటింతురు. మంచిశీలమును కలిగియుందురు- దేవ, బ్రాహ్మణుల యెడల భక్తి కలిగియుందురు- చిత్ర విచిత్రముగా మాట్లాడుదురు.

ధనస్సు ధనస్థానమైన యెడల విక్రయము మూలకముగ ధన లాభము కలుగును. నానావిధములగు చతుష్పాద జంతు లాభము కలుగును. పేరుపొందిన కీర్తికలవాడగును.

మకరరాశి ధనస్థానమైన యెడల ధనలాభము కలుగును. కృషియందభిమానము మంచిదక్షత యుండును. జలాశయములందు ప్రీతియుండును.

కుంభము ధనస్థానమైనచో పుష్పమాలలయందు ప్రియముండును. పిటిసంబంధమైన ధనలాభము కలుగును. ఉపకారులు విచక్షణులగుదురు.

మీనరాశి ద్వితీయమైనచో ధనధాన్యలాభము కలుగును. మాతా పితృ సంబంధమైన ధనము తప్పక పొందుదురు.

# ధనేశద్వాదశ బావస్థిత పలం

ధనాధిపతి లగ్నములో నున్నయెడల లోభియు నీచగుణములు కలవాడునుఅగును. లోకములో శ్రీమంతులని పేరుగాంతురు. స్వార్థపరు లగుదురు.

ధనాధిపతి ధనస్థానమందే యున్నయెడల అధిక ధనవంతులగు దురు. స్వజనులలో సుఖము పొందుదురు. మణులను రత్నములను కలిగి యుందురు.

ధనాధిపతి తృతీయములోనున్న ఎడల బంధుజన ప్రియత్వమును, నానాభోగములను, అధికబలపరాక్రమములను కలిగియుందురు.

ధనాధిపతి చతుర్ధమందున్న ఎడల ఎల్లప్పుడు పితృలాభమును పొందెదరు. దీర్ఘాయువును కలిగియుందురు. క్రూరులగుదురు, విదేశమందు మరణము పొందెదరు.

ధనాధిపతి పంచమములో నున్న ఎడల కృపణుడగును. దుఃఖ భాజనమగు జీవనము కలవాడగును. అతికష్టముమీద కృషి చేయుదురు. హీనులని పేరుగాంతురు.

ధనాధిపతి షష్ఠమములో నున్నఎడల ధనసముపార్జనా తత్పరుడ గును. శత్రునాశనము చేయుదురు. భూలాభమును పొందెదరు. మేనమా మకు సుఖము కలిగింతురు.

ధనాధిపతి సప్తమములో ఉన్న ఎడల, మంచిభోగవంతులు శుభ చింతన గలవారగుదురు. శుభగ్రహమైనచో భార్య ధన వంతురాలగును. కూౄరగ్రహ మైనచో వంధ్యగా దెలియదగును.

ధనాధిపతి అష్టమములో ఉన్న ఎడల కాపాలికుడు, ఆత్మఘాతు కుడు అగును. ఉన్నత కుటుంబమున జన్మించిన వాడైననుకూడా అల్ప త్వమును పొందును.

ధనాధిపతి తొమ్మిదవ స్థానములో ఉన్నఎడల శుభగ్రహమైనచో అతి బీదకుటుంబమున జన్మించినవారకైనను ధనవృద్ధి కలుగును. పాప గ్రహమైనచో బిక్షాటనము కలుగును. సోదరులును భాగ్యహీనులగుదురు.

ధనాధిపతి దశమములో ఉన్న ఎడల రాజమూలక ధన లాభము

కలుగును. సౌమ్యగ్రహమై స్వవర్గమునందున్నచో మాతా పితృవాక్య పరిపాలకులగుదురు.

ధనాధిపతి లాభములో ఉన్న ఎడల వ్యవహారములందు అధిక ప్రియమును కలిగియుందురు. శౌర్యవంతులు, ధనములేని వారగుదురు. ధనాధిపతి శుభగ్రహమై యుండెనేని ధన లాభము కలుగును.

ధనాధిపతి పండ్రెండవ స్థానములో ఉన్న ఎడల దుష్కార్యాలు చేయుదురు. క్రూరగ్రహమైనచో నిర్ధనులగుదురు. సౌమ్య గ్రహమైన స్వల్పధనము లభించుచుండును.

## తృతీయ భావ ఫలం

తృతీయము మేషమైనచో అన్యజాతులవారితో మైత్రిచేయును. పరోపకారములు చేయుదురు. విద్వాంసులు రాజులచేత పూజింపబడువారగుదురు.

తృతీయము వృషభరాశియైనచో రాజమంత్రులగుదురు. విశేష ధనమును కీర్తియు, శూరత్వమును కలిగియుందురు. కవులను విప్రులను పూజింతురు.

మిథునము తృతీయమైన యెడల గజాశ్వాది వాహనములు కలిగియుందురు. స్త్రీలయెడల అధికప్రీతి యుండును. కులశ్రేష్ఠులు ఉదార స్వభావులగుదురు.

కర్కాటకరాశి తృతీయమైనచో పైశ్యజన మిత్రులుందురు. శ్రేష్ఠమైన వంశమునందు జన్మింతురు. ధర్మమార్గమున సంచరింతురు.

సింహము తృతీయమైనచో ప్రచండుడు రాజులకు యిష్టుడు. కఠిన స్వభావులు అగుదురు. కఠినమగు ఆజ్ఞలను బలుకుదురు.

కన్యారాశి తృతీయమైనచో మంచి నడవడిక గలవారగుదురు. కళత్రపుత్ర మిత్రాదులతోను బ్రాహ్మణ పూజతోనుకూడియుందురు.

తులారాశి తృతీయమైనచో పెద్దవారియెడల అభిమానము కలిగియుందురు. సామాన్య నేర్పరులు సమస్త సుఖములను ధనమును కలిగియుందురు.

వృశ్చికరాశి తృతీయమగుచుండగా జన్మించినవాడు దరిద్రుల

తోటి మైత్రికలిగియుండును. చేసినమేలు మరచువాడు, పరులకపకార అపాయముల నొనర్చువాడు, కష్టదుఃఖములను కలుగజేయువాడును యగును.

ధనస్సు తృతీయమైనయెడల శౌర్యవంతులగుదురు. మిత్రులకు రాజులకు ప్రియులగుదురు. దానధర్మములతో కూడీయుందురు, ప్రసన్నమైనవారును, దయగలవారు బుద్ధిమంతులగుదురు.

మకరరాశి తృతీయమైనచో సౌఖ్యము గలవారు, సౌమ్య స్వభావులు—దేవతాగురుభక్తి కలిగియుందురు. పండితులగుదురు.

కుంభరాశి తృతీయమైనచో కృతజ్ఞతగలవారు, సత్యవాదులు మంచి శీలము గలవారును వృత్యగీతాదులయందు ప్రీతినికలిగి యుందురు.

మీనము తృతీయరాశియైన యెడల జన్మభూమిగతధనమును కలిగి యుందురు. పుత్ర మిత్రాదులతో కూడియుందురు. సత్కీర్తము లభించును.

తృతీయాధిపతి లగ్నములో నున్నయెడల చిక్కులతో కూడి యుందురు, సుతుల ఎడలను స్త్రీల యెడలను స్వల్పప్రీతి కలిగియుందురు. స్వజనమునందు భేదభావము కలిగియుందురు.

మూడవ స్థానాధిపతి రెండవరాశిలో నున్నయెడల అల్పాయుర్దాయము గలవారు ధనము లేనివారగుదురు. క్రూర గ్రహమైనచో బంధువిరోధము కలుగును. సౌమ్యగ్రహమైనచో శుభఫలముల నిచ్చును.

తృతీయాధిపతి తృతీయమందే యున్నయెడల బంధుజనులకును భ్రాతృవులకున్ను, సుఖము కలిగింతురు. దేవబ్రాహ్మణభక్తి కలిగియుందురు. రాజమూలక ధనలాభము పొందుదురు.

తృతీయాధిపతి చతుర్థములో నున్నయెడల సౌమ్యగ్రహమైనచో పితృధనము నిచ్చును. క్రూరగ్రహమైనచో పితృధన నాశనము దరిద్రము కలుగజేయును.

తృతీయాధిపతి పంచమములో నున్నయెడల పుత్రులను పోషణ

ల్లను రక్షించనేరనివాడగును. పోషణయందు అసమర్థుడు దీర్ఘాయువు గలుగును. సుఖముల ననుభవించును, పరోపకారము చేయును.

తృతీయాధిపతి షష్ఠమములో నున్నయెడల బంధువిరోధులగుదురు. నేత్రరోగము శత్రుభయము కలుగును, స్వల్పముగ చిత్తభ్రాంతియుండును.

తృతీయాధిపతి సప్తమమందున్న యెడల రూపవతి, భర్తయందు ప్రీతిగల కళత్రము సిద్ధించును.

సోదరస్థానాధిపతి అష్టమములో నున్నయెడల సోదరులు ఋజువర్తనులగుదురు- క్రూరగ్రహమైనచో జాతకులు ఎనిమిది సంవత్సరముల పర్యంతము అనారోగ్యవంతులగుదురు. సౌమ్యగ్రహమైనచో ఆరోగ్యవంతులగుదురు.

తృతీయాధిపతి తొమ్మిదవ స్థానములో నున్నయెడల క్రూరగ్రహమైనచో బంధుభయము కలుగును. శుభగ్రహమైనచో ఉదారస్వభావులు, భక్తులు, బంధుజనులకు సుఖము కలిగించువారగుదురు.

తృతీయాధిపతి పదవయింటనున్నచో రాజులు సైతము సోదరుల వలె నుందురు. దివ్యవస్త్రములను ధరింతురు. స్వజాతియొక్క గౌరవ ప్రతిష్ఠలను పెంపొందించువాడగును.

తృతీయాధిపతి లాభములో నున్నయెడం సోదరులకు మిక్కిలి లాభము కలుగును. విద్యార్థులకు విద్యయు, వస్త్రార్థులకు వస్త్రములు లభించును.

తృతీయాధిపతి వ్యయమందున్నయెడల బంధువులకు కళత్రమునకు దుఃఖముకలిగింతురు. లేక బంధుజనులయెడలను, కళత్రమునందును స్వల్పప్రీతి మాత్రమే యుండును.

మేషము చతుర్థస్థానమైనయెడల స్వార్జిత వాహనములుండును. చతుష్పాద జీవనలాభమును నానా భోగభాగ్యములను కలిగియుందురు.

వృషభము చతుర్థమైనయెడల తప్పక సుఖము కలుగును. నానా విధభోగములననుభవింతురు. వ్రత నియమాదులందు ఆసక్తి కలిగి ఆచరింతురు.

మిథునరాశి చతుర్థ స్థానమైనచో జలాశ్రయముల వలన సుఖము

కలుగును, ఇతరులను సేవించుటచేత లాభము, పుణ్యము ప్రాప్తించును.

కర్కాటకము చతుర్థమైనయెడల మంచి రూపమును కలిగి యుందురు. సురూపమును పొందుదురు. నీతి, వినయము, శీలము మంచి నడవడిక కలిగియుందురు. స్త్రీ హృదయమును గ్రహించగలరు.

సింహము చతుర్థరాశియైనయెడల కోపమువలన సుఖమును పొందె దరు. దారిద్ర్యము పొందుటవల్లను, దరిద్రుల సహవాసమువల్లనను శీలమును పోగొట్టుకొందురు.

కన్యారాశి చతుర్థమైనచో కొండెములు చెప్పునట్టి, పరదోషాన్వే షణపరులగు దుష్టుల స్నేహము ఏర్పడును. చోరులవలన సుఖమును పొందువారును కలహ ప్రియులునగుదురు. ఇతరులతో పోట్లాటయందు వీరికిసుఖమెక్కువ. పరులను సేవించుటవలన కూడా వీరును సుఖింతురు.

తులారాశి చతుర్థస్థానమైనచో నీతి, విద్య, జ్ఞానము, శాంత స్వభా వమును, ప్రసన్నమైన ముఖమును కలిగియుందురు.

వృశ్చికము సుఖస్థానమయినచో బుద్ధిహీనులును, మంచితీక్షణము గలవారును కోపము గలవారును, శక్తిలేక బలహీనులు నగుదురు.

ధనస్సు చతుర్థరాశియైనచో అధికమగు కీర్తియును, దాసదాసీ జనులను కలిగియుందురు.

మకరము చతుర్థస్థానమైన యెడల ప్రాజ్ఞుడు, మిత్రయుక్తుడగును. చెరువులు, నూతులు, పుష్పవాటికలు మొదలగు వాని నిర్మాణముచేసి సుఖింతురు.

కుంభము చతుర్థస్థానమైన యెడల మధుర పదార్థములను, లవణము పక్వమూల ఫలాదులను స్నేహితులతో కూడి భుజింతురు.

మీనరాశి చతుర్థమయిన యెడల ధనలాభములను పొందెదరు. ఎల్లప్పుడు శుభ్రమైన మంచివస్త్రములను ధరించువారగుదురు. మందగతితో చరింతురు.

## చతుర్థ భావ ఫలం

చతుర్థాధిపతి లగ్నమందున్నయెడల తల్లియెడల అధిక ప్రీతియు, తండ్రియెడల స్వల్పప్రీతిని కలిగియుందురు. విచిత్రముగా ధనలాభము కలుగును,

చతుర్థాధిపతి ధనస్థానమందున్న యెడల క్రూరగ్రహముయినచో పితృవిరోధమును, శుభగ్రహమయినచో పితృభక్తియు, పితృవాక్యపరిపాలకుడును అగును.

చతుర్థాధిపతి మూడవయింట యున్నయెడల బంధుజన పరిపాలనము, మాతా పితృసేవయు చేయుదురు. ధనసంతాన వృద్ధి కలుగును.

చతుర్థాధిపతి చతుర్థమందే ఉన్నయెడల పితృలాభము విచ్చును. రాజద్వారమువల్ల మంచి గౌరవము కలుగును. (భృగువాక్యము సంశయములేదు)

చతుర్థాధిపతి పంచమమున్న యెడల గజాశ్వాది వాహనములను కలిగియుందురు. దీర్ఘాయువును ధనధాన్య లాభము సంతాన వృద్ధియును కలుగును.

చతుర్థాధిపతి ఆరవయింట ఉన్నయెడల పితృధనము వ్యయమగును క్రూరగ్రహమయినచో వ్యయమును, సౌమ్యగ్రహమయినచో ధనలాభము విచ్చును.

చతుర్థాధిపతి సప్తమమందున్న ఎడల అత్తవారివలన దుఃఖము కలుగును. శుభగ్రహమయినచో భార్యయందు ప్రీతియుండును. పాపగ్రహమగునేని ప్రతికూలఫలమును దెలియవలెను. సప్తమమున బుధుడున్నచో జాతకుడు నపుంసకుడని చెప్పవలయును.

చతుర్థాధిపతి అష్టమములో ఉన్నయెడల క్రూరరోగములచే బాధపడెదరు. మ్లేచ్ఛకర్మలు చేయుదురు.

చతుర్థాధిపతి తొమ్మిదవయింట ఉన్న ఎడల దానధర్మములతోను సత్కార్యములతో కూడియుందురు. పితృ ధర్మ సంగ్రహము కలిగియుందురు-విధివిశేషపాలను పొందేవాడగును.

చతుర్థాధిపతి దశమములో ఉన్నయెడల తల్లిదండ్రులచే విడువబడుదురు. శుభుడైనచో తలిదండ్రులయందు ప్రీతి కలిగి సేవించెదరు. రాజమూలక ధనలాభమును పొందెదరు.

చతుర్థాధిపతి లాభములో ఉన్న ఎడల విదేశప్రయాణములయందు ప్రీతిని కలిగియుండెదరు, క్రూరగ్రహములైన ఎడల ఇతరదేశములందు జన్మింతురు,

చతుర్థాధిపతి వ్యయములో ఉన్న ఎడల ఎల్లప్పుడుఅనారోగ్యముగ ఉండురు. కొంచెముకూడా సుఖము లభించదు.

## పంచమ భావఫలం

మేషముపంచమస్థానమయిన ఎడల సత్పుత్రులు కలుగుదురు. పాప క్రూరగ్రహములతో నిండిన చెడ్డ స్వభావముగల వారగుదురు.

వృషభము సుతస్థానమయినచో నేర్పుగల పుత్రిక కలుగును. శుభ గ్రహమయినచో ప్రకాశముకలిగి నిజధర్మపరాయణురాలగును.

మిధునము సుతస్థానమయినచో మంచి గుణవంతులు శీలము, రూపము, బలముగల సంతానము కలుగును.

కర్కాటకము సుతస్థానమైనచో బహుపుత్రులు కలుగుదురు. సంతానము రూపము, గుణము, కీర్తివంతులగుదురు.

సింహము సుతస్థానమైనచో చెడ్డస్వభావము గల పుత్రులు కలుగుదురు, మాంసప్రియులు, అధికమగు ఆకలిగలవారు, విదేశమూలకముగ ధనము పొందెదరు.

కన్యారాశి పంచమ స్థానమైనచో పుత్రులయెడలను, కన్యాసుల యెడలను ప్రీతిని కలిగియుందురు. పురుషులకు పుత్రులుండరు. స్త్రీ సంతానము యెడ ప్రీతియుండును.

తులారాశి సుతస్థానమైనచో మంచిశీలము- రూపము, గుణములు కలిగిన మనోహరమైన సంతానము లభించును.

వృశ్చికము పంచమరాశి యైనచో, రూపము, గుణముగలవారును, అజ్ఞానులు, దోషయుక్త సంతానము కలుగును.

ధనస్సు పుత్రస్థానమైన యెడల సంతానము శతృనాశనము చేయువారును, రాజద్వారమందు ప్రతిష్ఠగలవారును ధనవంతులు నగుదురు.

మకరము పంచమ స్థానమైనచో కురూపముగల సంతానము కలుగును. ప్రేమలేనట్టియు, నిష్ఠురముగ మాట్లాడునట్టియు, విచారముతో కూడినట్టి సంతానము కలుగును.

కుంభము పంచమస్థానమైనచో సంతతి అధికచేష్టలును, గంభీరులు, బుద్ధిమంతులు నై యుందురు.

మీనము పంచమభావమైనచో బలవంతులు, శక్తిపరులునగు సంతతి కలుగును. క్రూరగ్రహ మైనచో స్త్రీ సములుగ నుందురు. రోగయుక్తులగు దురు.

## ద్వాదశరాశి స్థిత పంచమ భావఫలం

పంచమాధిపతి లగ్నములో నున్న యెడల శాస్త్రవేత్త అగుదురు. సత్కర్మలు చేయుదురు- మంచి బుద్ధియు, ఖ్యాతి, శాంతము మధుర వాక్కును కలిగియుండెదరు.

పంచమాధిపతి రెండులోనున్న యెడల క్రూరగ్రహమైనచో నృత్య గీతాదులయందు ప్రీతికలిగి యుండెదరు. కష్టముమీద ధనము కలుగును.

పంచమాధిపతి తృతీయములో నున్నయెడల మధురవాక్కును కలిగియుండెదరు. పండితులగుదురు, బలవంతులు బంధువులను పుత్రులను పరిపాలించు వారగుదురు.

పంచమాధిపతి చతుర్థస్థానములో నున్నయెడల మధురోక్తులు కలిగియుందురు. మాతా పితృవాక్య పరిపాలకులగుదురు.

పంచమాధిపతి పంచమమందేయున్న యెడల, మంచిబుద్ధియు వాక్కును కార్యములందు నేర్పును, పుత్రవృద్ధియునుండును.

పంచమాధిపతి ఆరవయింట నున్నయెడల ఎల్లప్పుడు కలహములతోను, రోగముతో నుందురు. ధనహాని కలుగును. చెడ్డగా మాట్లాడుదురు.

పంచమాధిపతి సప్తమములో నున్నయెడల మంచిశీలము, మధుర భాషణము పతిస్నేహముగల కళత్రము సిద్ధించును.

పంచమాధిపతి అష్టమములో నున్నయెడల పాపసంభాషణ చేయుదురు. స్త్రీ సంతానమున కనారోగ్యము కలుగును. పుత్రులు మాటవినరు.

పంచమాధిపతి నవమములో నున్నయెడల విద్యావినయములను రాజపూజ్యతయు, సంతోషము కలిగియుందురు.

పంచమాధిపతి దశమములో నున్నయెడల రాజమూలక ధనలాభము కలుగును. మాతృసౌఖ్యము పూర్తిగనుండును, ఎప్పుడో నొకప్పుడైనను రాజమంత్రియగును.

పంచమాధిపతి లాభములోనున్న యెడల గానవృత్త, గీతాది

కళలను నేర్చినవాడగును. నిత్యమును గానకళోపాసకుడగును. ఎల్లప్పుడు రాజులవలె ప్రకాశించుచు సర్వసౌఖ్యముల ననుభవించును.

పంచమాధిపతి వ్యయములో నున్నయెడల క్రూరగ్రహమైనచో సంతానప్రాప్తి యుండదు. సౌమ్యగ్రహమైనచో సత్సంతానము కలుగును, జాతకుడు విదేశములందు సంచరించువాడగును.

## షష్ఠభావఫలం

మేషరాశి ఆరవస్థానమైనచో గేదెలు మొదలగువానిని కలిగి పాడి సౌఖ్యమును పొందెదరు. మ్లేచ్ఛసంపర్కమువలన, సహాయము వలన, సర్వకార్యములును సిద్ధించును.

వృషభము ఆరవస్థానమైనచో చతుష్పాదలాభముండును. మార్గమునందు ధననష్టము కలుగును.

మిధునము ఆరవరాశియైనచో స్త్రీ విరోధము వృద్ధియగును. పాపగ్రహమైనచో నీచస్త్రీలయెడల ప్రీతియుండును.

కర్కాటకము శత్రుక్షేత్రమైనచో రాజసమానులగు పుత్రులు కలుగుదురు. జాతకులును రాజసమానులగుదురు. రాజమంత్రిత్వమును పొందుదురు. భృగువాక్యము సందేహము లేదు.

సింహము ఆరవరాశియైనచో బంధుపుత్రనాశనము కలుగును. మేనమామలతోటి విరోధము, ధనహాని కలుగును.

కన్యారాశి శత్రుక్షేత్రమైనచో వైశ్యజనప్రీతియు బ్రాహ్మణ జన విరోధమును కలుగును. స్వగృహ వాసము అతిస్వల్పము. ఎప్పుడును పరగృహములందే వశించువాడగును.

తులారాశి శత్రుక్షేత్రమైనచో భూ, గృహ, ధనములు నశించును. బంధుమిత్ర విరోధమును ధనవిభాగమును పొందును.

వృశ్చికము శత్రురాశియైనచో వైభవముగా ధనము సంపాదింతురు. స్వబంధువిరోధము తప్పక కలుగును. ధనవిభాగము కలుగును.

ధనస్సు శత్రుస్థానమైనచో మానసిక బాధలు కలుగును. జంతు విరోధము బంధువులతో విరోధము కలుగును.

మకరము శత్రుక్షేత్రమైనచో ధనవంతు లగుదురు. శత్రువులుందురు. ప్రసవసమయమందు స్వగృహమందు సాధువులు నివసింతురు.

కుంభరాశి శతృక్షేత్రమైనచో చెరువులు, నూతులు జలాశయములు
మూలకముగను, వస్త్ర పుష్పాదుల వల్లను ధనవ్యయము కలుగును.

మీనము శతృక్షేత్రమైనచో స్వజన బంధువైరమును కళత్ర హేతు
విరోధమును పుత్రమిత్రవిరోధము కలుగును.

## ద్వాదశరాశి స్థిత శతృ భావ ఫలం

షష్ఠాధిపతి లగ్నములోనున్నయెడల అధికకష్టము కలుగును.
దశాకాలమునందు ధనహానియు స్వజనులతోటి శతృత్వమును పొందును.

షష్ఠాధిపతి ధనస్థానములోనున్నయెడల కుటుంబములో అనారోగ్య
ముగ నుందురు. శతృపక్షము వృద్ధిపొందును. చికిత్సలకు ధనవ్యయము
కలుగును.

షష్ఠాధిపతి తృతీయములోనున్నయెడల బంధుజనులకు విచారము
కలిగింతురు. దశాకాలమందు పితృమరణమును బలనాశనమును కలుగును.
పరాక్రమ సాహసములు నశించును. పౌరుషాలంకారుడగునన పొచ్చ్యము.

షష్ఠాధిపతి చతుర్థములోనున్నయెడల తండ్రిపుత్రులకు విరోధము
కలుగును. ఆయాసరహితముగా తండ్రి ధనమును పొందును.

షష్ఠాధిపతి పంచమములో నున్నయెడల క్రూరగ్రహమైనచో
తండ్రిపుత్రులు శతృవులగుదురు. సౌమ్యగ్రహమైనచో ధననష్టము
కలుగును.

శతృస్థానాధిపతి శతృస్థానమందే యున్నయెడల శతృవులకు
సుఖము కలుగును. దుఃఖమును అనుభవింపరు.

శతృస్థానాధిపతి సప్తమములో నున్నయెడల భార్యక్రూరురాలును,
విరోధస్వభావురాలును యగును. విచారము కలిగించును. సౌమ్యగ్రహ
మైనచో వంధ్యయగును.

షష్ఠాధిపతియగు శని అష్టమస్థానములో నున్నయెడల గ్రహణీ
వ్యాధి కలుగును. కుజునిచే వివాదములు అధికమగును. సూర్యునివలన
సింహవ్యాఘ్రాది క్రూరమృగములచే మృతికలుగును.

షష్ఠాధిపతి నవములోనున్నయెడల క్రూరగ్రహమైనచో బంధు
జన విరోధము కలుగును. నాస్తికుడును, వేదశాస్త్రములయందలి ధర్మ
ములను పాటింపనివాడును అగును.

షష్ఠాధిపతి పదవస్థానములో నున్నయెడల మాతృదోషి యగును. క్రూరులును, దుష్టకర్మలు చేయువారగుదురు.

శతృస్థానాధిపతి లాభములోనున్నయెడల శతృవులవలన మృతికలుగును. పశుసముపార్జనకొరకు దాచబడినధనమును దొంగలపహరింతురు.

షష్ఠాధిపతి ద్వాదశములోనున్నయెడల చతుష్పాద జంతువుల మూలకముగా ధనవ్యయము కలుగును. త్రిప్పట యెక్కువగా నుండును. మార్గమునందు మరణము లేక పరాభవముగాని పొందుదురు.

## సప్తమ భావఫలం

మేషము సప్తమమై పాపగ్రహాక్రాంతమైనచో నపుంసకత్వమును, కృపణత్వము చంచలత్వము కలిగియుండురు. కళత్రము క్రూరకర్మలు చేయుచుండును.

వృషభరాశి సప్తమమైనచో, మంచి శీలము, శుభము కలుగజేయునట్టి గృహాలంకారమైన కళత్రము సిద్ధించును. పతి భక్తి, సోదరభక్తియు, కలిగి యుండును.

మిధునము సప్తమమైనచో స్త్రీ ధనయుక్తదగును. రూపము, నీతి కలిగినటువంటి కళత్రము సిద్ధించును గాని ప్రసన్నత యుండదు.

కర్కాటకము సప్తమస్థానమైనచో మనోహరమై నటువంటి (అనగా రూపమునందు) స్త్రీ లభించును. శుక్రగ్రహమగునేని రెండు మూడు కళత్రములగును.

సింహరాశి సప్తమస్థానమైనచో జాతకునిభార్య కటువుగామాట్లాడు స్వభావము కల్గియుండును. మంచి నేత్రము, చపలబుద్ధి అసత్యభాషణము స్వల్పమగు సత్సంతానము కలుగును.

కన్యారాశి సప్తమమైనచో రూపము, గుణముకల కళత్రము సిద్ధించును. సౌభాగ్యము కలుగును. సంతతికి స్వల్పకష్టము కలుగును.

తులారాశి సప్తమమైనచో వివిధ శుభముల నిచ్చునట్టియు, రూపము, యౌవనము, ఐశ్వర్యము, ఉదార స్వభావము, గర్వముగల అనేక కళత్రములు కలుగును.

వృశ్చికము సప్తమమైనచో మంచి రూపము కృపణత్వము, పలు విధములగు దోషములతో కూడిన భార్య కలుగును. దోషములను ఒక ప్పుడును లెక్కచేయని స్వభావముగల దార కలుగును.

ధనస్సు సప్తమస్థానమైనచో పుంషాకృతిగల కళత్రము లభించును. నిష్ఠుర భాషిణియు, భక్తిహీనయు, అసౌమ్య స్వభావయు, సద్బుద్ధి వర్జితయు నగును.

మకరరాశి సప్తమమైనచో లోభమును, డంబమును, లజ్జాహీన తయు, (సిగ్గు) నిష్ఠురములు పలుకుటయు యను గుణములు జాతకుని కళత్రమునందు చెప్పవలయును.

కుంభము సప్తమరాశి అయినచో కళత్రము ధర్మమే రూపముగా కలిగియుండును. పతిసేవయందు ప్రీతియు, కీర్తి కలిగి యుండును.

మీనరాశి సప్తమమయినచో కళత్రము, పుత్రులును మంచి ధర్మ మును, మంచిగుణములు మొదలగునవి లేనివారగుదురు.

## ద్వాదశరాశిస్థిత సప్తమేశ ఫలం

సప్తమాధిపతి లగ్నములో ఉన్న ఎడల భోగము, రూపము యౌవనము, ఐశ్వర్యము, పతి చిత్తానుసార వర్తనము మొదలగు సుగుణ ములుకల కళత్రము సిద్ధించును.

సప్తమాధిపతి ధనస్థానములో ఉన్న ఎడల ధనముకలిగిన కళ త్రము సిద్ధించును. నిరంతరము భర్తనుకూడి ఆనందము అనుభవించును. నిశ్చయమగు ధనసంచయము కలుగును.

సప్తమాధిపతి తృతీయములో ఉన్న ఎడల కళత్రము బంధుజనుల యందు ప్రీతియు మంచి రూపమును పతిభక్తి కలిగి యుండును. కఠినా త్మురాలగు స్వభావయగును.

సప్తమాధిపతి చతుర్థములోఉన్న యెడల తండ్రితో తరచు విరో ధము కలుగును. కళత్రము తల్లిదండ్రులమీద అధికారము చేయును. నిష్ఠురవాక్యము పలుకును.

సప్తమాధిపతిపంచమములోఉన్న ఎడల, కళత్రముసౌభాగ్యముతో ఉండును. పుత్రులను పాలించును. తన పతియందుమాత్రము స్వల్పప్రీతి యుండును,

కళత్రస్థానాధిపతి శత్రుక్షేత్రములోఉన్న ఎడల, కళత్రము అనారోగ్యవంతురాలగును. స్వల్పప్రీతి కలుగును. క్రూరగ్రహమయినచో మరణము కలుగును.

సప్తమాధిపతి సప్తమమందే యున్నయెడల కళత్రసౌఖ్యము పూర్తిగ ఉండును. నిర్మలత, మంచిశీలము, శాంతము, ప్రకాశము, పుత్రప్రీతియు యుండును.

సప్తమాధిపతి అష్టమములో ఉన్నఎడల వేశ్యాలోలుడగును. క్రూరగ్రహమయిన కళత్రహీనుడును సౌమ్యగ్రహమయినచో కళత్రసేవ చేయువారును యగుదురు.

సప్తమాధిపతి భాగ్యములో ఉన్న ఎడల మంచిశీలము, సౌందర్యముగల కళత్రము లభించును. క్రూరగ్రహమయినచో కురూపిణియు, కలహ ప్రియురాలగును.

సప్తమాధిపతి పదవస్థానములో ఉన్నయెడల రాజభయమును కుటిల మతియు, కటువాదము చేయువారగుదురు.

సప్తమాధిపతి లాభములో ఉన్న ఎడల కళత్రప్రీతియు, మంచి శీలముండును. స్త్రీయగుచో పతిప్రీతి కలిగియుండును.

సప్తమాధిపతి వ్యయములో ఉన్నయెడల కళత్రము పతి గృహమందుండదు. దుస్స్వభావయును, కలహ ప్రియురాలగును.

## ద్వాదశరాశి స్థిత అష్టమేశఫలం

అష్టమాధిపతి లగ్నములో ఉన్న ఎడల నానారోగములతోను, వాదోపవాదములతోను కూడియుందురు. రాజమూలక ధనలాభము కలుగును.

అష్టమాధిపతి రెండవ స్థానములో ఉన్నయెడల అల్పజీవులగుదురు. క్రూరగ్రహమయినచో క్రూరక్రియలును, సౌమ్యగ్రహమయినచో శుభములును చేయుదురు.

అష్టమాధిపతి తృతీయములోఉన్నఎడల బంధువిరోధము కలుగును లేనిచో స్వల్ప బంధువు లుందురు. నిష్ఠురముగా మాట్లాడెదరు.

అష్టమాపధితి నాల్గవయింట ఉన్న ఎడల మాతాపితృ విషయమై తపించెదరు. పితృధనము లభించును.

అష్టమాధిపతి పంచమములో ఉనఎ్నడల క్రూరగ్రహమయినచో పుత్రవినాశనమును, లేక నిత్య రోగులునగుదురు. సకృతుగా పుత్ర ప్రాప్తి కల్గును. ఎల్లప్పుడు దుఃఖభాజనుడగును.

అష్టమాధిపతియగు సూర్యుడు షష్ఠమమందున్న ఎడల భూసంపద పెంపొందును. గురువు ఉచ్ఛస్థుడై ఆరింట ఉన్న ఎడల సుందరులు, మంచిదృష్టిగలవారగుదురు. శుక్రుడున్న ఎడల సంఘసంస్కరణములు చేసెదరు.

అష్టమాధిపతి సప్తమములో ఉన్న ఎడల చంద్రుడైనచో సర్వభయము, బుధుడగుచో భయమును రాహువగుచో కష్టములును శనియగుచో శత్రునాశనము కలుగును.

అష్టమాధిపతి అష్టమస్థానములో ఉన్న ఎడల ఆరోగ్యవంతులగుదురు. అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యము కలుగుతుంది.

అష్టమాధిపతి తొమ్మిదవ స్థానములో నున్నయెడల చెడు సంఘములతో నుండువారు జీవహింస చేయవారగుదురు. మరియు బంధువులు లేనివారును లోకవిముఖులునగుదురు.

అష్టమాధిపతి దశమములో నున్నయెడల నీచకర్మలు చేయువారును, క్రూరులను, మాతృకష్టము కలవారగుదురు.

అష్టమాధిపతి లాభములోనున్నయెడల బాల్యమందుదుఃఖముపొందుచు పిమ్మట సౌఖ్యము పొందుదురు. సౌమ్యగ్రహమైనచో దీర్ఘాయువును క్రూరగ్రహమైనచో అల్పాయువును కలుగును.

అష్టమాధిపతి వ్యయస్థానములోనున్నయెడల క్రూరగ్రహమైనచో ధర్మహీనులును వ్యంగదేహమును ప్రియము లేనివారునగుదురు. విచక్షతా శూన్యమగు తిండితినువారగుదురు.

## అష్టమభావఫలం

మేషము అష్టమస్థానమైనచో విదేశమునందు మరణము కలుగును. విషూచికాది భయము కలుగును. తన్మూలకముగామరణము సంభవించును.

వృషభము అష్టమస్థానమైనచో అధికమైన శ్లేష్మసంబంధమైన బాధవలన గృహమందే మృత్యువు కలుగును.

మిధునము అష్టమస్థానమైనచో ప్లీహరోగము సంభవించును. లేనిచో ఆసనమందు బాధగాని ప్రమేహ సంబంధమైన బాధ కలుగును, తన్మూలకముగా మృతికలుగును.

కర్కాటక రాశియందు అష్టమభావ ముదయించుచుండగా జన్మించిన వాడు జలచరములవల్లగాని లేక కీటసర్పాదులవల్ల పరదేశములందు మృతిని పొందును. పరహస్తములమీదుగా ప్రాణవిసర్జనము అంత్యక్రియలను పొందువాడగును.

సింహరాశి అష్టమమందైనచో స్వస్థానమునందే మృత్యువు కల్గును. దొంగలవలనగాని విషసర్ప కీటాదులవల్లగాని ఇట్టివారికిమృత్యుకారణ మేర్పడి నశించగలరు.

కన్యారాశి అష్టమస్థానమైనచో స్వగృహమందు మరణము సంభవించును. యధావిధిగా కర్మ జరుగును, భార్యాపుత్రాదులు విలపింతురు.

తులారాశి అష్టమస్థానమైనచో వాయుపీడవలన మృతికలుగును. విషూచిక మేహసంబంధమైన వానివలన మృత్యువు కలుగును.

వృశ్చికము అష్టమరాశియైనచో విషజంతువులవలన మరణము కలుగును. మరణకాలమునందు స్వస్థానమును విడిచి పెట్టుదురు.

ధనస్సు అష్టమమైన మృగములవల్లగాని, గుహ్యసంబంధ పీడ వల్లగాని దేశాంతర మృతి కల్గును.

మకరము అష్టమస్థానమయినచో విద్యావంతులు, గుణవంతులు, విశాలమైన వక్షస్థలము గలవారు, కోరికలు కలవారు, జలమువలన మృత్యువుకలుగును.

కుంభరాశి అష్టమస్థానమైనచో ఆగంతుకముగా కలిగెడి అనారోగ్యమువల్లను వ్రణ, వాత, వికారాదులవలన మృత్యువు కలుగును.

మీనరాశి అష్టమస్థానమైనచో అతిసారము వల్లగాని శస్త్రమువల్లగాని, వాతపిత్తాది జ్వరబాధలు వలనగాని మరణము కలుగును.

## భాగ్యభావఫలం

మేషము భాగ్యస్థానమైనచో చతుష్పాద జీవన సుఖము కలుగును. వీటిని దానము ఇచ్చుటలోగాని పోషించుటలోగాని ప్రీతిని కలిగియుందురు.

వృషభము భాగ్యస్థానమైనచో భూముల మూలకముగా ధన లాభము కలుగును. గోవులు, తరువులు, వస్త్రములు మొదలగు వాని లాభము కలుగును.

మిధునము భాగ్యరాశియైనచో ఎల్లప్పుడు దానధర్మములతోను, అతిథి అభ్యాగతి పూజలతోను, తీర్థయాత్రాదుల సేవించుటతోను, కూడి యుందురు.

కర్కాటకము తొమ్మిదవ స్థానమైనచో వ్రత దానధర్మాది నియమ ములతో నుందురు. క్రమముగా ధనవృద్ధి కలుగును. యెల్లప్పుడు తీర్థ యాత్రలు చేయుదురు.

సింహము తొమ్మిదవ స్థానమైనచో వాహనాది సుఖము కలుగును. ధన, భూషణ, వస్త్రలాభములు కలుగును. వినయము ధర్మమును విడిచి పెట్టుదురు.

కన్యారాశి భాగ్యస్థానమైనచో ఇతరులకు సేవచేయు చుందురు. అధికముగ మాట్లాడుదురు. దయయు భక్తియు విడిచి పెట్టుదురు- పాషం డుడు వేదబాహ్యుడు అగును.

తులారాశి భాగ్యస్థానమైనచో ధర్మకర్తలయందు ప్రసిద్ధులగుదురు. అతిధి- దేవ- బ్రాహ్మణ పూజలను సల్పుచుందురు.

వృశ్చికము తొమ్మిదవ స్థానమైనచో పేరుకొరకు దంభమగు దాన ధర్మాదులను చేయుదురు. సాధువులకు దుఃఖమును కలిగింతురు. ఆదరణ రహితముగా, భక్తిరహితముగాను అతిధి అభ్యాగతులకు దానము చేయు దురు.

ధనస్సు తొమ్మిదవ స్థానమైనచో ధర్మమార్గము నవలంబింతురు. వస్త్రాదులను కలిగియుందురు. వీరిచే బ్రాహ్మణుల నధికముగ తృప్తి రచెదరు.

మకరరాశి తొమ్మిదవ స్థానమైనచో ఎల్లప్పుడు ధర్మమునే పలుకు చుందురు. స్వధర్మ మాచరించుచు పరధర్మమును దూషించుచుందురు.

కుంభరాశి తొమ్మిదవ స్థానమైనచో వృక్షములందును, చెరువులు, నూతులు తోటలు మొదలగువానియందు ప్రీతిని కలిగియుందురు.

మీనరాశి తొమ్మిదవ స్థానమైనచో ప్రయత్నముచేత ధర్మమాచ రింతురు. తీర్థయాత్రలు సేవించుటయందును, సాధుజన సేవయందును ప్రీతి కలిగియుందురు.

## ద్వాదశరాశి స్థిత భాగ్యభావ ఫలం

తొమ్మిదవ స్థానాధిపతి లగ్నములో నున్నయెడల దేవతా, గురు భక్తి కలిగియుండెదరు. కృపణత్వము, ధనవంతులగుదురు, రాజకార్య ములు చేయుచుందురు.

తొమ్మిదవ స్థానాధిపతి రెండులోనున్న యెడల శీలవంతులు, ధన వంతులు, సత్కార్యములు చేయుదురు. వ్యంగమైన ముఖమును చతు ష్పాద జంతుపీడయును కలుగును.

తొమ్మిదవ స్థానాధిపతి మూడవ స్థానములో నున్నయెడల తేజో వంతులు, బంధుప్రీతియు, బంధువర్గపాలనము స్త్రీలకు ప్రీతి కలిగించు టయు ఇత్యాది కలిగియుండెదరు.

భాగ్యాధిపతి చతుర్థములో నున్నయెడల తండ్రిని అధికముగా ప్రేమింతురు. అధికమైనకీర్తి నార్జింతురు. తండ్రిచెప్పిన పనులను, తండ్రిచే ప్రారంభింపబడిన కార్యములనను నేరవేర్తురు.

తొమ్మిదవ స్థానాధిపతి ఐదవ స్థానములో నున్నయెడల గురుభక్తి కలిగియుండెదరు. రత్నభూషణములతో కూడియుందురు. దేహసౌందర్య మును పొందెదరు.

భాగ్యాధిపతి ఆరవయింట నున్నయెడల శత్రువులకు లాభము కలి గింతురు. వీరిని చూచినంతనే శత్రువులు వీరినినిందింతురు. ఇట్టిజన్మగల వానికి ఎప్పుడును శరీర సంబంధమైన వ్యాధులుండును.

తొమ్మిదవ స్థానాధిపతి సప్తమములో నున్నయెడల ధనము, పతి

సేవ సత్యవచనము మొదలగు సద్గుణములుకల భార్యకల్గి కళత్రభాగ్యము కల్గును. స్త్రీ జాతకమునందైన నిట్టిగుణము లామెభర్తకు చెప్పవలెను.

నవమాధిపతి అష్టమములో నున్న యెడల బంధుజనులు, విద్య లేనివారగుదురు. సుకృతము లేనివారగుదురు. దుష్టులవలె లోకములో సంచరింతురు.

తొమ్మిదవస్థానాధిపతి తొమ్మిదవ స్థానమందే యున్నయెడల బంధుజనులకు ప్రీతికలిగింతురు. దాతలు, దేవతలను పూజింతురు.

తొమ్మిదవస్థానాధిపతి పదవస్థానములో నున్న యెడల మాతా పితృ సేవచేయుదురు. అభిమానవంతులు రాజమూలక ధనలాభము కలిగి యుందురు.

తొమ్మిదవ స్థానాధిపతి పదకొండులో నున్నయెడల గజ తురగాది వాహనము కలిగియుందురు. విజ్ఞానవంతులు, రాజసమానులగుదురు. అధవా రాజమంత్రు లగుదురు.

తొమ్మిదవ స్థానాధిపతి పండ్రెండులో నున్న యెడల సౌమ్యగ్రహ మైనచో విద్యావంతులగుదురు. క్రూరగ్రహమైనచో తొందరగలవారు మూర్ఖులగుదురు.

## దశమభావఫలం

మేషము పదవస్థాన మైనయెడల చెడుపనులతో కూడియుండెదరు. సాధుజనులను దూషింతురు. ప్రయోజనము లేనిపనులు చేయుచుందురు. పిసినిగొట్టు వారగుదురు.

వృషభము పదవస్థాన మైన ఎడల, సాధుజన ప్రీతి కలిగియుం డెదరు-దేవత-ద్విజ-సాధుజనులకు ప్రీతి కలిగించుచుందురు.

మిధునము పదవస్థానమయిన ప్రధానత్వము కలిగియుండెదరు. మంచికీర్తిని, రాజసన్మానోత్సవమును పొందెదరు.

కర్కాటకము దశమస్థానమయినచో సరస్సులు మొదలగువాని యందు ఎక్కువప్రీతి కలిగియుండెదరు. ఎల్లప్పుడు సంతోషముతోఉండుట చెరువులు తోటలు మొదలగువాని ఎడల ప్రీతి కలిగియుండెదరు,

సింహారాశి దశమస్థానమైనచో నిష్ఠురముగను క్రోధముగను మాట్లాడుదురు. పాపకర్మలు చేసెదరు. దయారహితులగుదురు.

కన్యారాశి దశమస్థానమైనచో గృహము కళత్రము ఇత్యాది కలిగి యుండెదరు. బలహీనులగుదురు. లోకనింద పొందెదరు.

తులారాశి దశమస్థానమయినచో వ్యాపారమూలక ధనలాభమును పొందెదరు. దాన ధర్మములు దయావినయము మధుర భాషణము కలిగి యుందురు.

వృశ్చికము దశమస్థానమయినచో నిర్దయులగుదురు. గురువులను అతిథులను, దేవతలను అభిమానము భక్తి మొదలగువానిని విడిచిపెట్టె దరు.

ధనూరాశియందు దశమభావ ముదయించుచుండగా బుట్టినవాడు, ప్రభుత్వాధికారమును పొందును. ఇతరుల ప్రయోజనములను సాధించి గొప్పకీర్తిని పొందును.

మకరము దశమస్థానమైనచో బంధుజనులతో నైతము విరోధము కలుగును. పాపకర్మలతో కూడియుండెదరు. స్వధర్మమును స్వకర్మను విడిచిపెట్టెదరు.

కుంభము దశమస్థానమయినచో పాషండులును అధర్మపరులును అతిలోభులును అవిశ్వసనీయులును అగుదురు. ఇట్టి జాతకుని భార్య స్వైరిణియు జారస్వభావయు నగును.

దశమము మీనరాశి అయినయెడల కుల శ్రేష్ఠులు కీర్తివంతులు బుద్ధిమంతులు పితృవాక్య పరిపాలకు లగుదురు.

## ద్వాదశ భావస్థిత దశమేశ ఫలం

దశమాధిపతి లగ్నములో నున్నయెడల తల్లిని శత్రువువలెజూచుడు(

తండ్రిని సేవించును. క్రూరగ్రహమైనచో పితృవిరోధము కలుగును. తల్లి పురుషునివలె ప్రవర్తించును.

దశమాధిపతి ధనస్థానములో నున్నయెడల రాజమూలక ధనలాభమును, నానావిధ లాభములును, పుత్రుడు స్వల్పముగా భుజించువాడును తిండిపుష్టి లేనివాడగును.

దశమాధిపతి తృతీయములో నున్నయెడల మాతృవర్గ బంధువిరోధము కలుగును. సౌమ్యగ్రహమైన యెడల రాజసేవయందు ప్రీతియు, బంధుజన పాలనము చేయుదురు.

దశమాధిపతి చతుర్థమందున్నయెడల తల్లిదండ్రులను సంతోష పెట్టువారును, కీర్తివంతులు రాజలాభము కలవారగుదురు.

దశమాధిపతి పంచమములో నున్నయెడల సౌమ్యమగుపనులు చేయుదురు. గీత వాయిద్యాది వినోదములందు ప్రీతియు, రాజమూలక ధనలాభము కలిగియుందురు.

దశమాధిపతి ఆరవయింట నున్నయెడల యెల్లప్పుడు శతృభయముతోనుందురు. కృపణత్వము గలవారును క్రియాశూన్యులు, వ్యాధిగ్రస్థులు నగుదురు.

దశమాధిపతి సప్తమములో నున్నయెడల కళత్రము పతివ్రత. పతిభక్తియు- ధనము- రూపము- శీలము యిత్యాది గుణములతో కూడియుండును.

దశమాధిపతి అష్టమస్థానములో నున్నయెడల ఎల్లప్పుడు అనారోగ్యముగ నుందురు. ఉష్ణవాతరోగమేర్పడును. శరీరమునందు కుడిభాగమునకు పీడనము కల్గును.

దశమాధిపతి నవమములో నున్నయెడల సత్యవాదులు మాతాపితృభక్తి గలవారు, ధనధాన్యయుతులు నగుదురు.

దశమాధిపతి దశమమందేయున్నయెడల మంచి దృష్టియు రాజ ప్రీతియు ప్రభువర్గమూలక ధనలాభము కలుగును.

దశమాధిపతి లాభస్థానములో నున్నయెడల నానావిధ ఐశ్వర్యము లను కలిగియుందురు. రాజద్వారమందు జయము భృగువాక్యము సంశ యములేదు.

దశమాధిపతి పండ్రెండవస్థానములో నున్నయెడల పితృకార్యము లకు ధనవ్యయము చేయుదురు. దైవికముగ పరస్త్రీ ప్రీతి కలుగును.

## లాభభావఫలం

మేషము లాభస్థానమైనచో వాహనాదులవలన అధికసుఖము కలు గును. చతుష్పాదులవల్ల ధనలాభము కలుగును. రాజద్వారమునందు గౌరవము కలుగును.

వృషభము లాభస్థానమైనచో కృషియందు నేర్పరులగుదురు. ధన ధాన్యములను తప్పక పొందుదురు.

మిధునము లాభస్థానమైనచో మంచి మూర్తివంతము జ్ఞాన దృష్టియు, వాహనాదిసౌఖ్యమును, ధనధాన్య లాభమును కలిగియుందురు. జాతకుడొకప్పుడు గ్రుడ్డివాడుకూడా కావొచ్చును.

కర్కాటకము లాభస్థానమైనచో చెరువులు, నూతులు, సరస్సులు మొదలగువానియందధిక ప్రీతిని కలిగియుందురు. వీటి మూలకముగా ధన లాభము కలుగును.

సింహము లాభరాసియైనచో పర్వతారణ్య మూలకముగా ధన లాభము కలుగును. క్రోధమువలన కార్యసిద్ధి కలుగును. తోటలయందు ప్రీతియుండును.

కన్యారాశి లాభస్థానమైనచో వాహనసుఖము కలుగును. దయయు ప్రసన్నమైన ముఖము, ఆత్మయు పరకార్యములందు ప్రీతియు కలుగును.

లాభభావము తులారాశి యందైనచో వ్యాపార జీవనము మంచి లాభకరము. జాతకుడు, శాంతస్వభావము, మధుర భాషణముకలిగి, ధన ధార పుత్రసంపదలను పొందును.

ఎవని జన్మకాలమున లాభభావము వృశ్చికరాశి యందగునో అట్టి జాతకుడు, మంత్ర యంత్ర ప్రయోగాదులందు నేర్పరియయి తంత్రవిద్యా యోగాదులవలన ధనమును పొందును, మరియును, ఇతరుల నెపముల నెన్నువాడు, కొంటెగాడు, మోసకాడు నగును.

యెవనికి లాభస్థానము ధనూరాశియం దగుచున్నదో అట్టి జాతకుడు ధనవంతుడు, కార్యవిచక్షణ కలవాడు, ధనుర్విద్య నేర్చినవాడు, పుత్ర పౌత్రాది సుఖము కలవాడు నగును.

మకరరాశి లాభభావమున కలిగినవాడు జనమూలకముగా ధనమును పొందును. సరస్సులు, బావులు, చెరువులు అనిన ఎక్కువ సంతోషమును పొందును.

ఏకాదశ భావమునందు కుంభరాశి యుదయించెనేని జాతకుడు తేజ శ్శాలి, రూపసి, విశాలనయనములు, విశాలదృక్పథము, కలిగియుండును. శ్లేష్మాధిక్యతకల శరీరతత్వము, ధనధాన్య యుక్తుడగును.

మీనరాశియందు పదకొండవ భావ ముదయించెనేని, జాతకుడు, మోనస్వభావము కలిగి నెపము లెన్నువాడగును. మంచి రూపవంతుడు. మాటనేర్పరియు నగును.

## లాభాధిపతిఫలం

లాభాధిపతి లగ్నమునందున్న యెడల జాతకుడు ధనధాన్య సంప దలు, వాహనసౌఖ్యము కలవాడగును. లాభాధిపతి శుభుడైగాని, లేక శుభ గ్రహ సంబంధిగాని యగునప్పుడు పైఫలములన్నియు కలుగును. అనగా పాపసంబంధ యోగాదులవల్ల పై ఫలములకు వ్యత్యస్త ఫలముల నూహించు కొనవలెనని భావము.

ఏకాదశాధిపతి ద్వితీయమునం దున్నయెడల ధనయుక్తుడగును. కాని లోభియు పిఱినికొట్టుయు నగును. కుటుంబజీవితమునందు ప్రేమకల వాడగును. వాహనాది సౌఖ్యములను పొందును.

లాభాధిపతి తృతీయమునందున్నచో, అన్నదమ్ములకు ధనప్రదు డగును. జాతకుడు బలవీర్య సాహసాదులుకల్గి, సేవకాజనము కలవాడ గును.

లాభాధిపతి నాల్గవస్థానమునందున్న యెడల, తలిదండ్రులను సేవించును. తండ్రివలన ధనసుఖములను పొందును.

పదకొండవ ఇంటిఅధిపతి పుత్రక్షేత్రము నందుండిన పుత్రలాభము కలుగును. అనుమానములేదు. విద్యావంతుడు కృతజ్ఞత లేనివాడు, మంత్ర శాస్త్రము తెలిసినవాడునగును.

షష్ఠస్థానమునందుండిన లాభాధిపతి దొంగలు, అగ్ని ప్రమాదముల వల్ల భయనష్టములను కలుగజేయును. మేనమామకు సౌఖ్యమబ్బును. జాతకుడు బర్రెలు పశుసంపదలు కలిగియుండును.

సప్తమమందు లాభాధిపతియున్నచో జాతకుడు స్త్రీలయొక్క ధనమును పొందును. భార్య యవ్వనవతి, మంచి శీలవతి. భర్తకు ఎల్లప్పుడు సంతోషమును కలుగజేయు స్వభావము కలిగియుండును.

అష్టమమందు లాభాధిపతియున్న జాతకుడు చేసిన కృషికి పొంద దగినంత లాభమును పొందలేడు. లభించు స్వల్పలాభమైనను కష్టము మీదగాని ప్రాప్తించదు. ఇట్టి లాభాధిపతి యొక్క దశాకాల మందుగాని ఇతర దశలలో తన అంతర్దశాదులందుగాని రోగమును కలుగజేయును.

ఏకాదశనాథుడు భాగ్యభావమునం దున్నచో అనేక విధములుగా లాభించును. అనగా యేపని చేసినను అందు లాభమే కల్గుచుండును. ధర్మశీలము, ప్రతాపము కలిగి యుండును, అన్నదమ్ముల వలన సుఖ ముండును.

లాభేశుడు దశమమందున్న యెడల తండ్రి వర్గముగా లాభించును. ప్రభుస్థానమున మర్యాదకలుగును. వివిధ మార్గముల ధనము సమ కూడును.

లాభాధిపతి లాభమందే యున్నచో, అధిక ద్రవ్యవంతుడగును. అనేక వాహనములు, పరిచారికా జనము కల్గి సౌఖ్యపడును.

లాభాధిపతి పంద్రెండవ భావములో నున్నయెడల, చాలా అల్ప మగు లాభము పొందును. కృషి ఫలము అతి శూన్యము, మిక్కిలి కష్టించినగాని స్వల్పధనము ప్రాప్తించదు. ఇట్టివాని వద్ద ధనము ఎక్కువ కాలము నిల్వయుండనేరదు. అనగా ఎల్లప్పుడూ ఆదాయమును మించిన వ్రయమగుచుండును.

## వ్యయభావ ఫలం

యెవనికి మేషరాశియందు వ్యయభావముదయించునో వానికి మేకల వల్ల ధనము వృద్ధియగును. మేకపాలు త్రాగును. (అనగా మేకపాలు ఆరోగ్యమునకు సహాయకారిగా నుండును.)

వృషభము పంద్రెండవ భావమగునేని గోవులు, ఎద్దు మొదలగు పశుసంపద కొరకు ధనవ్రయమగును. ఎప్పుడున్నూ ఆయాస రహితమగు ప్రయాణములు చేయలేడు. ప్రయాణములు క్లేశప్రదములుగా నుండును.

మిధునము వ్యయస్థానమగుచుండగా పుట్టినవాడు సత్యమును పలుకు వాడగును. వివాహమునందు ఇతనికి ధనలాభము కలుగును. శత్రువులు ఇట్టి వానికి లొంగియుందురు.

కర్కాటకరాశి ద్వాదశమగునేని, జలక్రీడయందు మిక్కిలి ప్రీతి కలిగి యుండును. చెర్వులు, బావులు మొదలగువాటి నిర్మాణముల కొరకుగా దాన ధర్మాదులను చేయుటయందు ధనము వెచ్చింతురు.

సింహము ద్వాదశముగాగల జాతకునకు అరణ్య సంచారము నం దును, అరణ్యములందు వస్తువులందును ప్రీతి మిక్కుటము, వనములందు,

ఉద్యానవనములందు, పర్వత భూములందును ఒంటరిగా సంచరించువాడ గును. ఒంటరితనము నందు మిక్కిలి ఆనందమును గాంచును.

కన్యారాశి పండ్రెండవ స్థానమయినచో జాతకుడు సౌమ్యమగు ప్రవృత్తి కలవాడగును. మంచిమార్గమున సద్ద్రవ్యము చేయును. వివాహ తీర్థయాత్రాది శుభకార్యములకు ధనమును వెచ్చించును.

తులారాశి వ్యయభావమైనచో నీచుడు, లోభి, కుత్సితుడునగును. సోదరులతోటి వివాదము కలుగును. ధనముకొరకు విభాగము లగుదురు.

వృశ్చికము వ్యయమగుచుండగా బుట్టినవాడు నిరంతరము సత్య మును పలుకువాడగును. కాని ఎల్లప్పుడు క్రూరకార్యముల నొనర్చుచుం డును.

అంత్యభావము ధనూరాశియందు కలవానికి రాజమూలకముగా ధనము లభించును. శత్రువులు నశింతురు. యెప్పుడును ధనుర్బాణ విద్య లందాసక్తుడై యుండును.

మకరరాశి యందు వ్యయభావ ముదయించు చుండగా జన్మించిన వాడు, జలక్రీడలయం దతిప్రీతి కలవాడగును. నదులు, చెర్వులు, బావులు వీటికి సంబంధించిన వివిధ కృషి కొరకు ధనవ్యయమును చేయువాడగును.

కుంభరాశి ద్వాదశమయినయెడల జాతకుడు అన్ని పనులయందు నేర్పరియగును. ధనవంతుడగును.

మీనరాశి వ్యయస్థానమయినచో నిలుకడలేని బుద్ధి కలవాడగును, జనప్రియుడు, మధురమగు వాక్కుకలవాడు, రాజద్వారమునందు కార్య జయమును పొందును.

## వ్యయాధిపతి ఫలం

ద్వాదశస్థానాధిపతి లగ్నమునందున్నచో జాతకుడు ఉదార చిత్తము కలవాడగును, ఎక్కువ విలువగల వస్త్రములను ధరించును. వేషధారణ ప్రీతికలవాడగును.

వ్యయాధిపతి ద్వితీయమందున్న యెడల స్వశక్తిపల్ల ధనసంపా దన చేయును. యెల్లప్పుడు విదేశములందు తిరుగువాడగును. స్వగృహము నం దునికి స్వల్పము.

 

వ్యయాధిపతి తృతీయములో నున్నయెడల భ్రాతృ నాశనమగును. ఇట్టి వ్యయాధిపతి దశయందు జాతకునికి దేహము మలినముగా నుండును.

వ్యయాధిపతి సుఖస్థానములో నున్నచో, అతి కష్టముమీద గాని సుఖమును పొందలేడు. భ్రాతృవులకు కష్టము కల్గును. ముఖ్యముగా వ్యయాధిప దశాకాలమున నీఫలములు చెప్పవలయును.

వ్యయేశుడు పుత్రభావము నందుండెనేని సంతాన కష్టము. పంచమ భావము శుభగ్రహదృష్టమైనను కానిచో యీ ఫలము తప్పదు. శుభగ్రహ దృష్టి కూడియున్న దోషముపశమించునని యూహించుకొననగును.

ద్వాదశాధిపతి ఆరవయింట యుండెనేని జాతకుని శత్రువులు నశింతురు- యిట్టి వ్యయాధిపతి మేనమామను చంపును. రాజస్థానమున భయప్రాప్తి, ధనలాభము, కార్యాకార్య విచక్షణ కలుగును.

సప్తమమందున్న వ్యయాధిపతి, కళత్రనష్టమును కలిగించును. శరీర దౌర్బల్యమును పుట్టించును. 

వ్యయేశుడు అష్టమమందున్న యెడల సకలసుఖ సౌభాగ్యములను ఒసంగునుకాని శరీరమునందు కించి దనారోగ్యమును చేయును. జాతకుడీ స్వల్పదోషఫలమును గమనించడు.

భాగ్యభావమునందున్న వ్యయాధిపతివలన జాతకుడు ధర్మకార్య విముఖుడగును. అతి కష్టముమీద కించి ద్ధర్మకార్యములను చేయును. ఇట్టి వ్యయాధిప దశయందు తప్పక భాగ్యహాని కలుగును.

వ్యయాధిపతి దశమమందున్నచో తండ్రి సంపాదించిన ధనము నష్టమగును. తండ్రిప్రారంభించిన సత్కృషియు జాతకునిచే వ్యర్థబరుపబడును. జాతకునికి, ప్రభుస్థానమున ఐశ్వర్యము పదవియు నశించగలవు.

వ్యయాధిపతి లాభము నందుండినచో సంతానకష్టము. ధనము నిల్వయుండదు. ఆదాయమునకు సరిపోవు వ్యయ ముండును- ధనమెట్లు వచ్చునో అట్లు పోవుచుండునేకాని మిగులదు.

వ్యయాధిపతి వ్యయమందేయున్న, శత్రువులవల్ల హాని కలుగును. ప్రభుస్థానమునుండి ధనప్రాప్తి, ధనధాన్య లాభము కలిగియుండును.

—]o[—